The Largest Circulated Telugu Monthly

# చతుర

నవంబర్ 1995

రూ. 6/-



'సాంబయ్య చదువు'

-కాలువ మల్లయ్య

[కన్సోలేషన్ బహుమతి పొందిన నవల]

# చతుర ప్రపంచం

## చెత్తనుంచి బంగారం

ఎందుకూ పనికిరాని చెత్తని కూడా ఉపయోగించి కోట్లు గడించవచ్చు అంటున్నాడు రాజస్థాన్‌కి చెందిన మాలవీయ ఇంజనీరింగ్ కాలేజి ప్రొఫెసర్ రాజారామ్‌గారు. చెప్పడమేకాదు, చేసి కూడా చూపించిన ఆచరణవాది ఈయన. రోడ్డుమీద కనిపించే ప్రతి వస్తువును తెచ్చి తన దొడ్లో పడేస్తాడు రాజారామ్. అందులో విరిగిన కుండ పెంకులు, కుళ్లిన కూరగాయలు, కోడిగుడ్డు గుల్లలు, సిగరెట్టు పీకలు, చెట్ల కొమ్మలు... ఒకటేమిటి... సమస్త వస్తువుల్నీ తెచ్చి ముందు దొడ్లోకి చేరుస్తాడు. అటుపైన గొయ్యితీసి ఆ గోతిలో ఈ చెత్తనంతటినీ పాతి పెడతాడు. తిరిగి ఓ సంవత్సరం తరవాత అది ఎరువులా మారుతుంది. అప్పుడు మళ్లీ దాన్ని తవ్వితీసి మొక్కలకి వేస్తాడు. ఈ ఎరువుతో మొక్కలు ఏపుగా పెరిగి విపరీతమైన ఫలసాయాన్ని అందిస్తున్నాయి. దాంతో చుట్టుపక్కలవాళ్లు కూడా ఈ ఎరువు




కోసం ఎగబడుతున్నారు. తన ఇరుగుపొరుగు వాళ్లకి కూడా చెత్తనుంచి వచ్చిన ఈ బంగారం లాంటి ఎరువును దానం చేస్తున్నాట్ట రాజారామ్.

## జంతువుల్లో సమాచార సాధనాలు

మాట్లాడటం, ఆలోచించడం వగైరా అన్ని శక్తులూ కేవలం మనిషికే పరిమితమని జంతువులకు ఇలాంటి శక్తులేం వుండవనీ అనుకుంటే పొరపాటే.

జంతువులు కూడా తమలో తాము సమాచారమందించుకోవడం, వాసననుబట్టి చుట్టుపక్కల వస్తువులను, ఇతర జంతువులను పసిగట్టడం, మనిషికూడా వినలేని అతి చిన్న శబ్దాలను చక్కగా వినగలగడం ఇలా ఎన్నో చేస్తాయని శాస్త్రజ్ఞుల పరిశోధనలో వెల్లడి అయింది.

పూర్వం పావురాలద్వారా ఉత్తరాలను పంపితే ఇప్పటిలా 'పోస్టల్ డిలే' అనో, లేక అడ్రసు తప్పని వెనక్కి రావడమో వుండేది కాదు. వేలమైళ్ళ దూరంలో వున్న వ్యక్తికైనా ఠంచనుగా నిర్ణీత సమయానికి చేరవలసిన వ్యక్తికి చేర్చేవి పావురాలు.

ప్రమాదాలనుంచి తప్పించుకోవడానికి, తోటి జంతువుతో కలవడానికి లేదా ఆహారం కోసం మరో జంతువును వేటాడ్డానికి వాటి ఘ్రాణశక్తి అద్భుతంగా పనిచేస్తుంది.

ఈమధ్య జరిగిన పరిశోధనల్లో తేలిందే






మంటే కరెంటు వైర్ల ఉనికిని కూడా వాసన ద్వారా పసిగట్టగలవు జంతువులు. దీనికి కారణాన్ని శాస్త్రజ్ఞులు రెండు రకాలుగా చెప్పారు. వైరులో కరెంటు ప్రవహిస్తున్నప్పుడు మనిషి చెవులకు వినిపించని అతిచిన్న శబ్దాలు వస్తూవుంటాయి. వాటిని జంతువులు పసిగడతాయి. మరో వాదనేమంటే కరెంటు వైరునుంచి ఉత్పత్తి అయ్యే ఓజోన్ వాసనను జంతువులు పసిగట్టగలవంటారు శాస్త్రజ్ఞులు. ఘ్రాణశక్తి కొన్ని జంతువులలో ఎక్కువగాను, మరి కొన్నిటిలో తక్కువగాను వుంటుంది.

కొన్నిరకాల పక్షులు నోటినుంచి ఎలాంటి శబ్దాన్నీ చేయకుండా కేవలం రెక్కలు విదిలించి, లేదా ముక్కును అటూ ఇటూ కదిపి తమ ఉనికిని తెలియజేయడం లేదా తోటి పక్షులకు సమాచారాన్ని అందజేయడం చేస్తాయి.

ఆడ వడ్రంగి పిట్ట మగ పిట్టను ఆకర్షించడానికి తన రెక్కలను గట్టిగా శబ్దంచేస్తూ కొడుతుంది. ఒక నిముషంలో అది 40 కన్నా ఎక్కువసార్లు రెక్కలు కొట్టుకుంటుంది.

తేనెటీగ నిమిషానికి 440 సార్లు రెక్కలు కొట్టుకుంటే మిగిలిన కీటకాలు దాదాపు 220 సార్లు రెక్కలు టపటపలాడిస్తాయి.

ఊసరవెల్లి రంగులు మార్చడంలోనే ఎంతో సమాచారాన్ని అందిస్తుంది తోటి ఊసరవెల్లులకి. అలాగే మిణుగురులు మినుకుమినుకుమంటూనే సమాచారాన్ని అందించుకుంటాయి. గబ్బిలాలు అతిచిన్న శబ్దాన్ని కూడా క్షణాల్లో గ్రహించి దానికి తగ్గట్టు నడుచుకుంటాయి. ఇదికాక వాటికొచ్చే చిన్నచిన్న అనారోగ్యాలకు అవే వైద్యం చేసుకుంటాయి. కుందేలు తనకు దెబ్బతగిలితే ఒక రకం చెట్టు ఆకును ఆ పుండుపై వేసుకుంటుంది. నిద్రపోయేముందు ఎలుగుబంటి కాసిని దేవదారు ఆకులు తిని మరీ పడుకుంటుంది. అవి ఆరోజు అది తిన్న ఆహారంలో ఏమైనా సూక్ష్మక్రిములు వుంటే నశింపచేస్తాయి. కుక్క గాయాన్ని నాకినాకి మాన్పుకుంటుంది.

---

## సప్తవర్ణ చికిత్స

అనాదిగా మనిషి ఎన్నో రోగాలను ప్రకృతి చికిత్సద్వారా నయం చేసుకోడానికి ప్రయత్నిస్తూనే వున్నాడు. అందులో ఓ పద్ధతి సూర్యకాంతిలో వుండే 7 రంగులను విభిన్న పద్ధతులలో మన శరీరంపై ప్రసరింపచేయడం. సూర్యకాంతిలో 7 రంగుల మిశ్రమం వుంటుంది. ప్రాచీన ఆయుర్వేద వైద్యులు ఈ సూర్యస్నాన చికిత్సలో సిద్ధహస్తులని చెప్పొచ్చు. అనేక రోగాలను తగ్గించడానికి ఈ సిద్ధవైద్యులు 'పంచభూతాలను' ఈ వైద్య విధానంలో భాగంగా పరిగణించేవారు.

ఉదయించే సూర్యుడిలో వుండే 7 రంగులూ మన శరీరంలో కూడా వున్నాయి. ఈ రంగులు అతిగా ప్రకోపించినా, లేదా తగ్గిపోయినా శరీరం రోగగ్రస్థమవుతుంది. ఇప్పటి




ఆధునిక శాస్త్రజ్ఞులు కూడా దీన్ని సమర్థించి ఈ రంగులద్వారా చేసే చికిత్సకి కలర్ థెరఫీ లేదా 'క్రోమోథెరఫీ' అని పేరెట్టారు.

సూర్యకాంతిలో వున్న సప్తవర్ణాలే ఇంద్రధనుసులో కూడా వున్నట్లు మనకు తెలుసు. సూర్యస్నానం ప్రకృతి చికిత్సలో అతిముఖ్యమైన అంగం. పశ్చిమ దేశాల్లోను, యూరప్లోను సూర్యస్నానం ఎక్కువగా ప్రసిద్ధి చెందింది.

విదేశీయులు బీచిల్లో నగ్నంగా ఎండలో ఇసుకపై పడుకుని సూర్యస్నానం చెయ్యడం మనకు తెలిసిన విషయమే. ఇందులోని ఒక్కొక్క రంగు శరీరంలో ఒక్కొక్క రోగానికి ఔషధంగా ఉపయోగిస్తుంది.

ఎరుపురంగు శరీరానికి వెచ్చదనాన్నిచ్చి క్షయ, చక్కెర వ్యాధి, కామెర్లు, కీళ్ళనొప్పులు, చర్మవ్యాధులు మొదలయిన రోగాలను తగ్గిస్తుంది. ఊదారంగు నరాలకు శక్తినిచ్చి, ఎర్రరక్తకణాల సంఖ్యను పెంచుతుంది.

ఇండిగోరంగు ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధులను నయం చేయడంలోను, మలబద్ధకాన్ని పోగొట్టడంలోను ఉపయోగపడుతుంది. నారింజరంగు రక్తప్రసరణను చక్కచేసి, నరాలకు శక్తినిస్తుంది.

ఆకుపచ్చ నేత్రదృష్టిని బలపర్చి కంటి సంబంధిత రుగ్మతలను పోగొట్టడమేకాక, వీర్యకణాలను వృద్ధిచేస్తుంది.

పసుపురంగు కుష్టువ్యాధిని నయం చేస్తుంది.

సూర్యకిరణాలను సూటిగా శరీరంమీదకి పసరింపచేసుకోడం కన్నా, పరోక్షంగా తీసుకునే మరో పద్ధతి కూడా వుంది. ఈ కిరణాలను నీళ్ళద్వారాగానీ, నూనెద్వారాగానీ గ్రహించి ఆ నూనెతో నీటితో స్నానం చేయడం. ఇది సూర్యస్నాన చికిత్సలో ఉత్తమ పద్ధతి. దీనికి నువ్వుల నూనె లేదా ఆవనూనె మాత్రమే శ్రేష్టం. నీటిపై సూర్యకాంతిని ప్రసరింపచేయడానికి కూడా ఓ ప్రత్యేకమైన పద్ధతి వుంది. మొట్టమొదట నూతి నీరుగానీ, వాన నీరుగానీ ఓ సీసాలోకి $^3/_4$వంతుదాకా నింపాలి. అటుపైన ఆ సీసాను సూర్యకిరణాలు సూటిగా పడే ప్రదేశంలో వుంచాలి. అలా ఒక వారంపాటు ఆ




సీసాని కదపకుండా అలాగే వుంచాలి. మరీ తొందరగా కావాలంటే రెండు రోజులపాటు వుంచి అటుపైన వాడుకోవచ్చు. ఒకవేళ సూర్యకాంతి తక్కువగా వుండి మబ్బులతో కూడిన వాతావరణం ఎక్కువకాలం వున్నప్పుడు, లేదా రాత్రి సమయాల్లోను కూడా ఈ సూర్యకాంతి చికిత్సచేసుకుందుకు ప్రత్యేక పద్ధతులున్నాయి, అంటున్నారు వైద్యులు.

ఈ 7 రంగులలో దొరికే పలుచని ఉల్లిపొర కాగితాలను ఒకదానిపై ఒకటి పేర్చి 40 వాట్ల బల్బు వెలిగించి దానిపై ఈ కాగితాలకట్ట నుంచి దానిద్వారా వచ్చే రంగు కిరణాలను నూనెపైగానీ, నీటిపైగానీ ప్రసరింపచేసి వాటిని వాడుకోవచ్చు.

ఎలా చేసినా... ఈ సప్తవర్ణ చికిత్స ఉత్తమమైనదే అని ఒప్పుకుంటున్నారు ఆధునిక శాస్త్రజ్ఞులు కూడా.




# పా... పా... పా... పాము!

చైనీయులకి సర్పం జీవితంలో ఓ భాగంగా చెప్పచ్చు. భోజనంలో పదార్థంలా, వైద్యంలో ఔషధంలా, ఆటల్లో వినోదంగా పాముల్ని ఉపయోగిస్తుంటారు వారు. కుల్మింగ్ అనే ఈ చీనీ బాలుడు పాములతో అనేక విన్యాసాలు చేయించి పొట్టపోసుకుంటాడు. చీలిన నాలుకలను క్షణక్షణం బయటకు తెచ్చి, బుసలుకొట్టే సర్పాలను ఐదారింటిని ఒకేసారి ముఖానికి తాకించుకుంటాడు. ముక్కులోంచి పాము తలనుపంపి, ఓ చేత్తో తోక పట్టుకుని, అది నోట్లోంచి బయటకు వచ్చాక మరో చేత్తో దాని తలను పట్టుకునే ఈ వినోదం చైనాలో సర్వసాధారణం కావచ్చేమోగానీ చాలామందికి ఒళ్ళు గగుర్పొడిచే భీతిని కలిగిస్తుంది మరి!

# 'ఆవలిగట్టు'పై సమీక్షలు

సెప్టెంబర్ 'చతుర'లో ప్రచురితమైన నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన రెంటాల నాగేశ్వరరావు నవల 'ఆవలిగట్టు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.

## అట్టడుగు జీవితం

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

రెంటాల నాగేశ్వరరావుగారి 'ఆవలిగట్టు' చక్కని కథనంతో ఆద్యంతమూ ఆసక్తికరంగా సాగింది.

పల్లెటూళ్ళలోని కుత్సిత రాజకీయపు విషనాగులు శేషయ్యవంటి మంచి మనుషుల్ని కూడా కాటేసి ఊరొదిలి పారిపోయేలా చేసిన వైనం, మన గ్రామాల దౌర్భాగ్యస్థితిని కళ్ళకు కట్టినట్టు చూపిస్తుంది.

ఏ ఆధారమూ లేకుండా కట్టుబట్టలతోనూ, కట్టుకున్న భార్యతోనూ, లోకం తెలియని పసివాళ్ళతోనూ బ్రతుకు తెరువు వెతుక్కుంటూ ఊరుగాని ఊరుచేరిన శేషయ్యను మంచి మనసుతో ఆదుకున్న ఇస్రాయేలు వంటివారిని తలచుకున్నప్పుడు లోకంలో మంచి ఇంకా చావలేదు సుమా! అని ఊరట కలుగుతుంది.

ఎదుటివారి బలహీనతల్నే తన పెట్టుబడిగా వాడుకుని దర్జాగా బ్రతికే జయప్రకాష్, ఖర్చుపెట్టే ప్రతి పైసానూ లెక్క చూసుకుంటూ స్వశక్తితో పైకి వచ్చిన వెంకటసుబ్బయ్యా కండబలానికి మేధస్సును కూడా జోడించి వక్రమార్గంలోనే అయినా అందరికీ అవసరమైనవాడిగా అవతారమెత్తిన దాదా, పెద్దలు సంపాదించిన డబ్బుతో చెడిపోయిన కుర్రకారూ, చచ్చిన శవంమీద పడిన డబ్బులు కూడా ఏరుకునే బాపతు లంచగొండి అధికారులూ, కార్మిక నాయకులూ, ఇన్నిరకాల వారి జీవనవిధానాన్ని చాలా గొప్పగా చిత్రించిందీ నవల.

సున్నపు బట్టీ కార్మికుల వెతలు, యజమానుల మోసాలు, చట్టంలోని లొసుగులూ సవివరంగా చర్చించడంలో రచయిత పడిన శ్రమ ద్యోతకమైంది.

ఒక సీరియస్ ఇతివృత్తాన్ని సక్సెస్‌ఫుల్ నవలగా మలిచే ప్రయత్నంలో, ఏ దశలోనూ కథనంమీద పట్టు తప్పిపోకుండా జాగ్రత్తపడుతూ, అవకాశం దొరికినప్పుడల్లా వ్యంగ్యాన్నీ, హాస్యాన్నీ సందర్భోచితంగా ప్రయోగిస్తూ చాలా చాకచక్యంగా కథను నడిపించిన రచయిత అభినందనీయులు.

-సీతాసత్య
చింతపల్లి

## అసంబద్ధం

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

'ఆవలిగట్టు' అంతగా చెప్పుకోదగిన నవల కాదు. రచయిత ఈ నవల ఏ కోణంనుంచి ఆలోచించి రచించారో అర్థంకాదు. అసలు ఈ నవలలో ఉన్న పాత్రలే అసహజమైనవి. అరకల దగ్గర మొదలైన తగాదా ఈ నవలకు మూలకారణమని రచయిత అభిప్రాయం కాబోలు. అంత పెద్దకాపు శేషయ్య పోలిరెడ్డికి భయపడి భూమిని అమ్మి డబ్బు తీసుకొని ఊరు వదిలిపెట్టి

వెళ్ళాడు. దానికి మరో కారణం పోలిరెడ్డి శేషయ్య భార్యాబిడ్డలను చంపుతానని బెదిరించడం కూడా కావచ్చు. తిరిగి అదేబాటలో శేషయ్య కొడుకు వెంకటేశం పయనించినట్లుగా వర్ణించడం శోచనీయం. జయప్రకాష్ సుబ్బారావుకు, వెంకటసుబ్బయ్యకు పెట్టుబడి లేకుండా వ్యాపారం చేయటం ఎలాగో చెప్పి డబ్బు వసూలు చేయడం అసంబద్ధంగా ఉంది. అలాగే సుబ్బారావు నెలకు వేలరూపాయలు సునాయాసంగా సంపాదించటం అంతుపట్టని విషయం. దాదాను చివరకు జాన్స్ చంపాడో లేదో రచయిత వివరించలేదు. ఉన్నంతలో ఇస్రాయేలు, మరియమ్మ, ఏసుపాత్రలు ఒకరకంగా ఉన్నాయి. రచయిత శేషయ్య కుటుంబాన్ని చంపివేసినట్లుగా చిత్రీకరించడం బాగాలేదు. అంజమ్మ పాత్ర ఉన్న పరిధిలో బాగుంది.

మొత్తానికి ఈ నవల అసంబద్ధమైన నవలగా అనిపించింది.

-ఎం. రవీంద్రకుమార్,
కె. బల్లేలపల్లి

## వేదనాభరితం

**(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)**

సాఫీగా సాగిపోయే బతుకుబండిని ఒక యాదృచ్ఛిక ఘటన సైతం ఎలా కకావికలు చేస్తుందో తెలియచేసే వేదనభరిత నవల 'ఆవలిగట్టు'. సర్వమూ కోల్పోయి కట్టుబట్టలతో తండ్రివెంట ఆ ఊరిలో దింపివేయబడిన వెంకటేశంతో మొదలయిన కథ అతడు ప్రాణాలను అరచేత్తో పట్టుకుని ఆ ఊరినుంచి పారిపోవటంతో ముగుస్తుంది. శేషయ్య లాంటివారి మంచితనం, నిజాయితీలను చేతగానితనంగా పరిగణించే రోజులివి. అన్ని ప్రమాదాలు శేషయ్య కుటుంబానికే ఎదురుకావటం కార్మికులనుభవిస్తున్న దారుణస్థితిగతులను తెలియచేసే కథాగమనమేగాని నాటకీయంగా లేదు. తిరుపతమ్మ ప్రతిఘటన గగుర్పాటు కలిగించింది. ప్రాణంకంటే మానానికే ఆమె ఎక్కువ విలువనిచ్చింది.

భారతదేశపు ప్రస్తుత దౌర్భాగ్యపు పరిస్థితికి కారణభూతాలకు జయప్రకాష్ ప్రతీక. అతడి ఏకైక సిద్ధాంతం 'నేను పెట్టుబడి పెట్టను'. పెట్టుబడి పెట్టకుండా, ఉత్పత్తి లేకుండా లాభాలు దండుకోవాలనే కంప్రాడార్ బూర్జువాల ప్రతినిధి జయప్రకాష్. సుబ్బారావుకి అతడు చెప్పిన ఉపాయాలు ఆధునిక వ్యాపార గీతోపదేశం వంటివి. దేశానికి స్వతంత్రం వచ్చిందనుకుంటున్నాం కానీ దేశప్రగతికి అవరోధం పెట్టుబడిదారివర్గమే అన్నట్టుంది. దేశ అధోగతికి అవినీతి, రెడ్‌టేపిజం మయమైన అధికారవర్గం మరో కారణం;

ఇంత పకడ్బందీగా నవల రచించి చివరకు ఊరి స్వగతంలో తేలగొట్టేరు రచయిత. ప్రపంచ దేశ పరిణామాలను చాలా సూపర్‌ఫిషియల్‌గా విశ్లేషించి దోపిడీ ఏదోరూపంలో తప్పదనే నిర్ధారణకు వచ్చారు. సమసమాజం రంగుల కల అనీ, స్త్రీ పురుష సమానత్వం యుటోపియా అని భావించారు. మళ్లీ అంతలోనే 'దోపిడీ కొంత తగ్గించటానికి ప్రయత్నం చేస్తాను. అదే రాస్తాను' అంటారు. ఊరు దోపిడీని తగ్గిస్తుందా?

-కె. సురేష్,
ఘంటశాలపాలెం

## అతకని కథనం

**(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)**

సెప్టెంబరు చతుర నవల 'ఆవలిగట్టు' గజిబిజి పాత్రలతో, కథకుతగ్గ కథనం లేక పేలవంగా ఉంది. కొన్ని పాత్రలను రచయిత ఎందుకు ప్రవేశపెట్టారో అర్థం కాదు. ఆయా పాత్రలు ఈ నవలలో ఇమిడ్చిన తీరు సబబుగా లేదు. శేషయ్య కుటుంబ ఫ్లాష్‌బాక్ కూడా




అనవసరమేమో! బహుశా, గౌరవంగా బతికిన ఓ మంచి వ్యక్తి జీవితం స్థానిక రాజకీయాలకు బలి అయి ఎలా చితికిపోయిందో చూపాలని రచయిత తాపత్రయపడ్డా, అనవసర పాత్రలు మధ్యలో కల్పించుకున్న జోక్యంవల్ల సానుభూతికి నోచుకోలేకపోయింది.

మాటల గారడీతో బతకొచ్చనేలా రూపుదిద్దబడిన జయప్రకాశ్ పాత్రను బాగా సాగదీశారు. అలాగే దాదా పాత్రకు లేనిపోని ప్రాధాన్యత కల్పించబడింది. వెంకటసుబ్బయ్య, సుబ్బారావు పాత్రలు కూడా అంతే. మూడు, నాలుగు చిన్న కథలను ఓ నవలగా మలచొచ్చనేది రచయిత ఆలోచన కాబోలు! అసలు ముగింపులో ఏం చెప్పాలని రచయిత భావించారో పాఠకులకు అర్థంకాలేదు. విషాదాంతం చేయాలనుకునేట్లయితే ఇన్ని ఫీట్లు అవసరం లేదేమో!

'సున్నపుబట్టీ'ల గురించి చేసిన విశ్లేషణ, వాటి యజమానులు, కార్మికుల లైఫ్ గురించి పరిశోధనాత్మకంగా వివరించిన విధానం ఒక్కటే విజ్ఞానయుతమైన అంశం ఈ నవలకు. చప్పగా, అనవసర సంఘటనలతో సాగిన ఈ నవలలో ఈ ఒక్క అంశమే పాఠకుల్ని ఆకట్టుకున్నా, ఆ అంశం గురించి ఓ వ్యాసం రాయొచ్చు, నవలే అక్కరలేదు అనిపిస్తుంది. పరిపక్వతగల రచయిత రెంటాలగారే ఇటువంటి అతకని కథనం గల నవల రాశారనేది జీర్ణించుకోలేకపోతున్న నిజం!

**- పంతంగి రవీంద్ర శ్రీనివాస్,**
సూర్యాపేట

## ఆశావాదం

*(ఐదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**వ్యక్తుల** చరిత్రే సమాజ చరిత్ర. కొన్ని గ్రామాల చరిత్రే... ఒకదేశ చరిత్ర... కొన్ని దేశాల చరిత్రే 'ప్రపంచ చరిత్ర'.

ఒక గ్రామ చరిత్రను, ప్రపంచదేశాల చరిత్రతో పోలుస్తూ, ఆ దేశాల కుత్సితత్వం, స్వార్థం, కులం, మతమౌఢ్యం, డబ్బుకోసం ఆరాటం వంటి లక్షణాలన్నీ ఆ గ్రామ ఆత్మకథకు ఆపాదిస్తూ చక్కగా రాశారు రచయిత 'ఆవలిగట్టు' నవలలో.

నిజాయితీగా జీవించే రాజమ్మ, శేషయ్యలు కొందరు స్వార్థపరుల దుర్మార్గానికిలోనై ఎలా అవస్థలు పడ్డారో రచయిత హృద్యంగా చిత్రీకరించారు. కులవర్గాల వైషమ్యాలలో ఎలా దోచుకోబడ్డారో తెలుపుతూ అసోసియేషన్ల పేరుతో వెలసే 'ఉద్యోగుల కులసంఘాల్ని' నిరసించారు. కులం పోవాలి అనే నీతి ఈ నవల ద్వారా తెలుస్తుంది.

కష్టపడితే జీవితంలో ఎలా పైకి రావచ్చో 'సుబ్బయ్య' పాత్ర ద్వారా చెప్పించారు. సమాజాన్ని చట్టబద్ధంగా ఎలా మోసం చేయగలమో అని ఆలోచించే జయప్రకాష్ లాంటివారు నేడు సమాజంలో కోకొల్లలు. కండబలం చూపించి అమాయకులను దోచుకొనే దాదాల గురించీ, ధనికవర్గం చేసే దాడుల గురించీ, కార్మికుల దోపిడీ గురించీ బాగా వ్రాశారు. రచయితకి హాస్యంలో నైపుణ్యం వుంది.

నిజాయితీగా జీవించిన రాజమ్మ, శేషయ్యల దుర్మరణం పాఠకుల సానుభూతి చూరగొంటుంది.

ప్రతి వ్యక్తికి అనుభూతులుంటాయి. అదే జీవన స్రవంతిని నడిపిస్తున్న బలమైనశక్తి. ఆ శక్తి ప్రతిఒక్కరికి కావాలని రచయిత ఆశించారు. సమాజంకోసం కవితలు రాయనవసరంలేదు. భావుకత్వంలో మునిగిపోనవసరంలేదు. మన పరిధిమేరకు దోపిడి కొంతైనా తగ్గించాలనే రచయిత ఆశావాదం ఆహ్వానించదగ్గది.

**-కె. శివసుబ్బారావు**
రామకృష్ణాపురం

చతుర

సంపుటి : 18 సంచిక : 10 నవంబర్ 1995



## స్వపరిచయం

కన్ను తెరిచింది 42 సంవత్సరాల క్రితం కరీంనగర్ జిల్లాలో ఓ అచ్చమైన పల్లె, తెలుకుంటలో. విద్యాబుద్ధులు నేర్చింది, పెరిగింది పల్లెలో, పల్లె వాతావరణంలో. మొదట్లో నిజామాబాద్ జిల్లాలోని పాఠశాల ఉపాధ్యాయుడిగా జీవితం ప్రారంభించి, గత పందొమ్మిదేళ్లుగా ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, రామగుండం యూనిట్‌లో సీనియర్ కెమిస్ట్‌గా పనిచేస్తున్నాను. పారిశ్రామిక కాలనీలో ఉంటున్నా పల్లెలంటే మక్కువ, పుట్టిన నేలంటే మమకారం!

"తెలుగులో ప్రగతిశీల కథాసాహిత్యం" అనే అంశంపై చేసిన పరిశోధనకు 1993లో ఉస్మానియా యూనివర్శిటీనుండి డాక్టరేట్ డిగ్రీ... 1983లో రాయడం ప్రారంభించి ఇంతవరకు 250 కథలు, 25 సాహిత్యవ్యాసాలు, కొన్ని కవితలు 'అవ్వతోడు గిది తెలంగాణ' పేరుతో తెలంగాణ మాండలికంలో రాసిన శీర్షికా రచనలు, నవసాక్షరుల కోసం రాసిన కొన్ని రచనలు... వివిధ పత్రికల్లో కథలకు బహుమతులు.

ప్రధానంగా కథకుడ్నైనా మూడు నవలలు రాశాను. మొదటి నవల 'భూమిపుత్రుడు' చతుర డిసెంబర్ '91 సంచికలో అచ్చయి 1992లో తెలుగు యూనివర్శిటిలో పురస్కారాన్ని పొందింది.

రెండవ నవల 'ఊరంటే...?' సాహిత్య సేవాసమితి ట్రస్ట్ విశాఖపట్నంవారు నిర్వహించిన నవలల పోటీలో (డిసెంబర్ '94) ప్రథమ బహుమతి పొందింది.

మూడవ నవల 'సాంబయ్య చదువు'కు కన్సొలేషన్ బహుమతినిచ్చి నా నవలా రచనకు ప్రోత్సాహం కల్పిస్తున్న చతుర సంపాదకవర్గానికి, యాజమాన్యానికి, న్యాయనిర్ణేతలకు నా కృతజ్ఞతాభివందనాలు.

ఊపిరున్నంతవరకు రాయాలన్నదే జీవిత లక్ష్యం...

డా॥ కాలువ మల్లయ్య
బి. 37,
ఫెర్టిలైజర్ సిటీ,
కరీంనగర్ 505 210

# సాంబయ్య చదువు

– కాలువ మల్లయ్య

"దండాలు దొరా! బాంచెను!" అన్నాడు అతడు వణికిపోతూ.

"ఏంది చిలుకయ్యా! ఎందుకస్తివి?" అన్నాడు దొర దర్పంగా.

"నా కొడుకును బడికి తోలన్ననుకుంటున్న దొర..." అన్నాడు నసుగుతూ.

ఆ మాటకి పకపకా నవ్వాడు దొర.

"ఏందిరా! నీ కొడుకు చదివి రాజ్యమేలతడా? చదువుకున్న పోరడు నీ మాటింటడా? చాకలోడు, మంగలోడు... అందరు చదివితే చదువుకేం విలువుంటదీ... నాకాడ గొడ్లు కాయడాని కుంచు..." అన్న దొర మాటలకి ఆ అమాయకపు తండ్రి ప్రతిస్పందన ఏమిటి? తన బిడ్డను చదివించుకుందుకు... మరెవరి సమ్మతినో తీసుకునే పరిస్థితులు... ఈ ఆధునికయుగంలో... ఇంకా ఎక్కడున్నాయి? చివరికతడు... దొరని కాదని... తన బిడ్డను చదివించగలిగాడా?

నిరక్షరాస్యతా నిశీధిలో నేటికీ కొట్టుమిట్టాడుతున్న కొంతమంది ప్రజల మనోభావాలకు... మనసుకు హత్తుకునే విశ్లేషణ... నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి రూ. 5,000/- పొందిన

కాలువ మల్లయ్య రచన

"సాంబయ్య చదువు"

ఈ నెల చతుర సమగ్ర నవల.



"అ.. ఆ, ఇ.. ఈ...

దిద్దుబాబూ దిద్దు... దిద్దమంటే దిద్ద వేంది? దిద్దు దొరా? మంచోడు మా చిన్న దొర... మంచిగ చదువుకుంటడు..."

వెంగళరావు దొర దేవిడీ కచ్చేరింట్లో చదువు చెప్పుతున్నాడు వెంకటయ్య పంతులు. ఆ ఊరికి కొత్తగా మంజూరైన ఏకోపాధ్యాయ పాఠశాలకు ఉపాధ్యాయుడిగా ఈమధ్యనే వచ్చాడు వెంకటయ్య. ఊరికి పాఠశాల భవనం లేకపోవడంవల్ల ఆ ఊరి మోతుబరి వెంగళరావు దొరింట్లోనే ప్రస్తుతానికి బడి నడుస్తోంది.

"నేనేం దిద్దపో... దిద్దనంటే దిద్ద. నేనసలే దిద్ద' అంటూ పంతులు ఎంత చెప్పినా వినడంలేదు వెంగళరావు గారాల కొడుకు శ్యాంరావు.

చుట్టూ నాలుగైదూళ్లకు జమీందారుగా, దొరగా పేరున్న వెంగళరావంటే అందరికీ భయమే. అతనికి ధనబలంతోపాటు అన్ని బలాలున్నాయి. అతని కెదురుగా మాట్లాడటానికందరూ జంకుతారు. అలాంటి దొర కొడుక్కు చదువు చెప్పడం వెంకటయ్యకో సమస్యగానే ఉంది.

ఒక్కొక్కా మొక్కాటి.. ఒక్క రెండూ రెండు..

'కా'కు బలుపాల గిలకిస్తే ర్కల్.

'క'కు నకార పొల్లిస్తే...

అంటూ కొందరు పిల్లలు చదువుకుంటున్నారు.

కొందరేమో పలకపై పెట్టించిన అక్షరాలను దిద్దుతున్నారు. వాళ్లెవరితోనూ సమస్యలేదు వెంకటయ్యకు.

"చిందొర మంచోడు... నీకు నిమ్మ పులుసు పిప్పరమెంట్లు కొనిస్త... దిద్దు... చదువుకుంటె నీకు పెద్ద నౌకరస్తది'' బుజ్జగించి చదివించాలని చూస్తున్నాడు వెంకటయ్య...

"నాకు నౌకరద్దేమద్దుపో... నేనే నౌకరుంచుకుంటా. మా బాపు దొరేనాయె... నేం దిద్దపో'

ఎంత చెప్పినా వినడంలేదు శ్యాంరావు. నాలుగు రోజులుగా అతనితో ఏమీ రాయించలేకపోతున్నాడు వెంకటయ్య. కొడదామంటే దొర ఏమంటాడోనన్న భయం. దొరకు కోపమొస్తే తనను పట్టపగలే చంపి నడిబజార్లో పాతిపెట్టినా అడిగే నాధుడు లేడని భయపడుతున్నాడు వెంకటయ్య. ఎదురుగా దూరంగా పడక కుర్చీలో కూర్చొని చూస్తున్నాడు వెంగళరావు.

'చిన్నదొరకు చధువు రాకుంటే దొర తిడతాడు. బాబేమో చెబితే వినడు. బడి మరో చోటున్నా బాగుండేది. ఈ నౌకరి తన చావుకే వచ్చింది. మరో దిక్కు దొరసాని కూడా చూస్తుంది. బాబు నేమన్నా అంటే తనకూళ్లో ఉండడానికి చోటు కూడా లేకుండా చేస్తారు' తనలో తానే గొణుక్కుంటున్నాడు వెంకటయ్య.

మిగతా పిల్లలు చెప్పింది చేస్తున్నారు. శ్యాంరావు తాను దిద్దకపోగా ఇతర పిల్లలనూ చదవకుండా చేస్తున్నాడు.

"అల్లరి చేయొద్దు చిన్నదొరా! దిద్దుతవా లేదా?" గద్దరించి నట్టన్నాడు వెంకటయ్య.

"అమ్మా! సారు కొడుతండే..." అని ఏడ్వసాగాడు శ్యాంరావు.

"ఊర్కో బాబూ ఊర్కో... నిన్నేమన... నువ్వు రాయకున్నా మంచిదే'' బుజ్జగించి ఏడుపు మానిపించాడు వెంకటయ్య.

అతని పరిస్థితిప్పుడు ముందుకు పోతే నుయ్యి, వెనుకకు పోతే గొయ్యిలా ఉంది.

'దొర ఆగ్రహానికి గురై ఎంతోమంది తన్నులు తిన్నారని విన్నాడు తాను. బాబును కొడితే కష్టం. కొట్టకుంటే వినడు. తాను ఛండశాసనుడే. కాని దొర కొడుకును ఏమనలేడు. అని బతుకలేడు. ఇంకొక పిల్లవాడైతే కోదండ మెక్కించి కింద కంపపెట్టించేవాడు తాను. బెత్తంతో వీపు బద్దలయ్యేట్టు కొట్టేవా





డు. కాని దొరముందు తాను పిల్లిలాంటివా డే. ఈ పోరనితోని చావే వచ్చింది'... బెత్తం చేతిలో పట్టుకొని తిరుగుతూ అనుకుంటున్నా డు వెంకటయ్య. శ్యాంరావు తప్ప మిగతా పిల్లలంతా తమ తమ పనుల్లో నిమగ్నమ య్యారు.

కొద్దిసేపటి తర్వాత పడక కుర్చీలోంచి లేచి గంభీరంగా అడుగులేస్తూ అక్కడికొచ్చా డు వెంగళరావు. ఆతని మొలకు ధోతుంది. శరీరంపై ఆపారం అంగీ ఉంది. ముఖం మీద పిడికెడేసి మీసాలున్నాయి. దొరను చూసి వినయంగా నిల్చున్నాడు వెంకట య్య. ఉన్న ఒక్క కుర్చీలో దొర కూర్చున్నా డు. పిల్లలందర్నీ చూసిన దొర నొసలు ముడిపడింది.

"పంతులూ! గిదేంది? ఏం సంగతి?" అన్నాడు. దొర దేన్ని గురించడుగుతున్నాడో అర్థంకాక ప్రశ్నార్థకంగా ముఖం పెట్టాడు వెంకటయ్య. కొద్ది క్షణాలాగి...

"దేన్ని గురించి దొరా మీరనేది?" అన్నా డు.

"పంతులూ! నీకు బుద్ధిలేదు. స్వతంత్ర మచ్చిందని చిన్నంతరం పెద్దంతరం చూడ కుంటెట్ల? అంటు ముట్టు మరసిపోవుడేనా? గా పోరడెవ్వడు? పెద్ద మాదిగ లింగని కొడుకు గదా?" అన్నాడో పిల్లవాని దిక్కుచూ వుతూ.

"అవును దొరా! మాదిగోల్ల పిల్లవాడే వా డు"

"అయితే దూరం కూచోబెట్టక నడుమనే కూచుండబెట్టిన వేంది? మాదిగోల్లు చదువు కునుడే ఎక్కువంటే అందర్ని ముట్టుకునుడే నా?" కోపంగా అన్నాడు వెంగళరావు.

"అవును దొరా! నేను మరిచే పోయాను" దొరతో అని.

"అరే నర్సిమ్మా! నువ్వు పోయి వెనుక కూచో. నేను నిన్న చెప్పింది జ్ఞాపకం లేదా?" బెత్తం ఝళిపిస్తూ అన్నాడు వెంకటయ్య.

ఏడేళ్ల నరసింహ పలకా బలపం తీసు కొని నిల్చున్నాడు. వెంకటయ్య చెయ్యి చూ పగానే అందరికంటే వెనుకకు పోయి కూర్చున్నాడు.

"ఈల్లు గంతే... ఇటేటు రమ్మంటే ఇల్లంత ఆక్రమించుకుంటరు. ఎక్కడుంచెటో ల్ల నక్కన్నే ఉంచాలె... చచ్చేటోడు చావక గాంధీ వాళ్లకో హరిజనులని పేరుపెట్టి పోయా డు. అంటరాని తనమద్దని అంత గజిబిజి చేసి పోయిండు"

గాంధీగారంటే అపారమైన భక్తి శ్రద్ధలు న్నా అంటరానితనంపై ఖచ్చితమైన అభిప్రా యాల్లేవు వెంకటయ్యకు. తన ఉద్దేశ్యాలేవైనా దొరను కాదనే దమ్ముల్లేవతనికి.

"అవును దొరా! మీరన్నది నిజమే" అన్నాడు.

"సరెగని పంతులూ! ఏ ఊరో అంటివి నీది" అన్నాడు వెంగళరావు.

"మాది కరీంనగర్ దగ్గర మానకొండూరు దొర..."

"ఏమిటోల్లు మీరు... గొల్లోల్లని చెప్పినవు గదా!"

"అవును దొరా! మేం యాదవులం"

"గొల్లోడంటే మోటనిపిస్తుందా? యాదవు లట యాదవులు. సరెగని గీ పద్యం నీకు వత్తదా? గొల్లని సాహిత్య విద్య, కోమలి నిజమున్... అన్న పద్యం... చిన్నప్పుడు చదివింది యాదికుంది. ఐతే మానాయెకని పుట్టింది గొల్లకులంల నీకు చదువెట్ల బ్బింది?"

దొర మాటలు బాధాకరంగా ఉన్నా ఆత న్నేమనలేకపోతున్నాడు.

"ఏదో దొర... మొదట్లో కానిగిరి బళ్లోనే చదివిన. ఆ తర్వాత కరీంనగర్‌లో ఎనిమిదో తరగతి వరకు చదివిన. ఆ తర్వాత ట్రేనింగ్ పోయిన. నౌకరయింది" అన్నాడు వెంకట య్య.



"అట్లనా? ఐతె మానాయెకని చిన్న దొర మంచిగ చదువుతండా లేదా?"

"చిన్నదొర.. చిన్నదొర" చెప్పడానికి సంశయిస్తున్నాడు వెంకటయ్య.

"ఎందుకు నసుగుతవ్? సరిగ్గ చెప్పు"

"ఏం జెప్పాలె దొర? మింగమంటె కప్ప క్కోపం.. విడువమంటె పాముక్కోపం అన్నట్టుంది. చెప్పుతె మీరు కోపానికొస్తరని''

"ఎంత పిచ్చోనివోయ్ పంతులు? నే నెందుకు కోపానికత్త? ఆడు గడుసుపిండెం. వింటండా? లేడా?"

"నేనెంత చెప్పినా వినడంలేదు దొర! తాను చదువుకోవడంలేదు. అందరితోని 'కై లాటుకం' పెట్టుకుంటండు. దిద్దుమంటె నన్నే దిద్దుమంటండు. ఏం జెయ్యిమంటరో చెప్పుండ్రి?"

"ఏం జేసేదేంది? నాలుగు తన్నకపెయిన వా?"

"దొర కొడుకాయె... తమరేమంటారో నని..." భయంగా అన్నాడు.

"హో... హో... హో..." అంటూ బొణగూ పినట్లు నవ్వాడు దొర. కొంచెంసేపటి తర్వాత ఆగి

"నీకు గీ పద్యం తెలుసా...?" అన్నాడు.

"ఏ పద్యం దొరా?"

'దొర కొడుకునైనను - తొడ పాశమును బెట్టి - చెవ్వులు మెలివేసి నులుమ వల యు...' అని చదివి

"దొర కొడుకైనా కొట్టంది చదువు రాదు... తన్ను, కొట్టు ఏమన్న చెయ్యి. వానికైతే చదువు రావాలె' అన్నాడు వెంగళరావు.

ఆ మాటలతో కొండంత ధైర్యం వచ్చింది వెంకటయ్యకు. ఇక చూపిస్తాను నా తఢాకా అనుకున్నాడు. తాను చదివిన గణపతి నవ లను జ్ఞాపకం చేసుకున్నాడు.

"దొరా! మీ ఆజ్ఞయింది కదా! నెల రోజు ల్లో చిన్నదొరకు అక్షరాలన్నీ వచ్చేట్టు చేస్తా ను. మీరేం ఫికరు పడకుండ్రి. వెనుకటో పెద్ద మనిషన్నాడట కుండలో కూడు కుండల్లోనే ఉండాలి. పిల్లవాడు దుండుముక్కవలె ఉండాలని. అలా అయితే చదువు రాదు'' అన్నాడు.

"నాకు ఫికరెందుకు? ఆడు చదువుకొని ఎలుగవెట్టేదేం లేదు. మాకు ఒగలకింద నౌకరి జేసే అవుసరమేం లేదు. బల్లున్నయి గద నాలుగక్షిరాలు అత్తయని తోలుడు. చిన్న దొరకు మంచిగ చదువు చెప్పు" అని లేచి నిల్చున్నాడు వెంగళరావు.

"అలాగే దొరా!" వినయంగా అన్నాడు వెంకటయ్య.

చాలా సేపట్నుంచి బజాట్లో నిల్చోని వాళ్లను చూస్తున్న చిలుకయ్య చెప్పులు బయటే విడిచి తలపై రుమాలు తీసి చేతిలో పట్టుకొని లోపలికొచ్చాడు.

"దొరా! దండాలు బాంచెను'' అన్నాడు.

"ఆం... ఆం... మంచిగున్నవా చిలుక య్యా! బజాట్ల నిల్చోని బడింజూత్తన్నవా? నాకోసం జూత్తన్నవా?" అన్నాడు వెంగ ళరావు.

"మీతోని మాట్లాడేదుంది. మీరు పంతు ల్తోని మాట్లాడుతుంటే అట్లనే చూసుకుంటు న్న'' అన్నాడు చిలుకయ్య.

"నీ కొడుకును తోలుతవా బడికి?" అన్నా డు వెంకటయ్య.

"ఆల్లేదు చూల్లేదు కొడుకుపేరు సోమ లింగమన్నడట పంతులు నీ అసొంటోడు. చిలుకయ్యకు కొడుకులేడున్నరు? అయినా అందరు సదివిత్తే సదువుకేం విలువుంటది?"

"నిజమే దొరా!" అన్నాడు అతని మాట ను కాదనలేక వెంకటయ్య.

"నాకు పిల్లల్లేరు పంతులు. నాల్గు కాన్పు లైనా ఒక్కలు గూడ దక్కలేదు. ఏ జన్మలో పాపం సేసిన్నో? ఇప్పుడు నా పెండ్లాం పొట్టతో ఉంది. రేపో మాపో అన్నట్టుంది. కొడుకు పుడితే దొరనడిగి మా చదివిత్త'






"చదివిత్తురా! అందరు చదివిత్తరు'' వ్యంగ్యంగా అని "ఎందుకో వచ్చినవ్? చెప్పకనే పోతివి?" అన్నాడు.

"ఒక్క నూర్రూపాయలు కావాలె దొర... నా భార్య నీల్లాటకుంది''

"మా షేరిదారు పంతులే అన్ని చూసు కుంటండు. కాయిదం రాసిచ్చి పైసలు గొంచవో' అని బజాట్లో సిద్ధంగా వున్న సవారెడ్ల బండ్లో కూచొని మక్కపెరడి దగ్గరి కెల్లాడు వెంగళరావు.

చిలుకయ్య షేరిదారు దగ్గర డబ్బు తీసు కొని రుమాట్లో పెట్టి తలమీద పెట్టుకున్నాడు. వచ్చి కొంచెందూరంగా వెంకటయ్యను, పిల్ల లను చూస్తూ నిల్చున్నాడు. ఇంతవరకూ సంతానం దక్కని చిలుకయ్యకా పిల్లలను చూస్తుంటే ఏదో ఆత్మీయతాభావం కలుగు తోంది. తనకు కొడుకు పుట్టి దక్కుతే తప్ప కుండా చదివించాలనుకుంటున్నాడు.

దొర ఇచ్చిన బలంతో బెత్తం చేతిలో పట్టుకొని శ్యాంరావు దగ్గరికొచ్చాడు వెంకటయ్య.

"దిద్దు..." అన్నాడు గట్టిగా.

"నేం దిద్ద పో... నువ్వే దిద్దు'' పాతపాటే పాడాడు శ్యాంరావు.

బెత్తంతో అరచేతిలో రెండు దెబ్బలేశాడు వెంకటయ్య.

"అమ్మా!" అంటూ ఏడవసాగాడు శ్యాంరావు.

"ఊర్కో... లేకుంటే చంపేస్తా'' అని మరో నాలుగు దెబ్బలేశాడు.

ఇంకా హటంబెడుతూ ఏడుస్తున్నాడు శ్యాంరావు.

"ఊర్కో... ఊర్కో'' అంటూ వీపుపై, కాళ్ళపై, చేతులపై ఎక్కడపడితే అక్కడ బాదసాగాడు వెంకటయ్య. ఇన్నిరోజులు తనను ఇబ్బంది పెట్టినందుకు కసిదీర్చుకుంటున్నట్టుగా కొడ్తున్నాడు. శ్యాంరావు ఏడ్పు విని సాధారణంగా బయటకు రాని వసుంధరాదేవి బయటకొచ్చింది. కొడుకును దగ్గరకు తీసుకుంది. శరీరమంతా బెత్తం దెబ్బలతో దద్దులు రావడం చూసింది. వెంకటయ్యమీదికి కళ్ళెర్రజేసి చూసింది.

"నీ ఇంట్ల పీనుగెల్ల. నీ మొకం పాడుగాను. నీ చదువు నాశినెంగాను. నా కొడుకును చంపుతావుర లేకిడి గాడ్డికొడుక? ఆనికి చదువు రాకుంటేంది? నీ అసొంటోల్లను నూరుమందిని నౌకరుంచుకుంటడు. నీకు బుక్కెడు బువ్వ గూడ పెట్ట పో. నీ చేతులకు జెట్టలు పుట్ట. నువ్వు నాశినమైపోతావు. నా ఇంట్లనుంచెల్లిపో..." తిట్లవర్షం కురిపిస్తోంది వసుంధరాదేవి. అతడు ఉపాధ్యాయుడని కూడా చూడకుండా నోటికొచ్చినట్లు తిడుతోంది. దొరసాని నేమనలేక నిస్సహాయంగా నిల్చున్నాడు వెంకటయ్య.

"నువ్విక్కడుంటే నీ కాళిరుగ గొట్టిపిత్త నీ మాలపంకిడి మొకం పాడుగాను'' ఇంకా తిడుతూనే ఉంది.

ఈ గొడవకు పిల్లలంతా లేచి నిల్చున్నారు.

"పోంగ్రి పోరగాండ్ల... ఇక్కడ చదువు లేదేం లేదు'' అని వాళ్లందర్నీ తరిమేసింది.

వెంకటయ్యకు కళ్లవెంట నీళ్లు రావడమొక్కటే తక్కువైంది. ఆతనికి తన ఊరు జ్ఞాపకం వచ్చింది. తల్లిదండ్రులు జ్ఞాపకం వచ్చారు. పొట్ట చేత పట్టుకొని వచ్చిన ఉద్యోగం జ్ఞాపకం వచ్చింది.

"నువ్విక్కన్నుంచెల్లిపో..." అని కొడుకును తీసుకొని లోపలికెళ్లింది వసుంధరాదేవి.

తల వంచుకొని బజార్లోకొచ్చాడు వెంకటయ్య.

"పంతులూ గింతన్యాయమా? దొర్సాని గంతగనం తిడుతుంటె చప్పుడన్న చేత్తలేక పోతివి? చదువుకున్నోల్లను గూడ గంతగనం తిడితెట్ల పంతులు?" వెంకటయ్యవెంట నడుస్తూ అన్నాడు చిలుకయ్య.

"ఏం జెయ్యాలె చిలుకయ్యా? గంగలవడి చావల్నా? ఊరుగానూరు. ఓ ఊరి పోలీసు పటేలు ఇంకో ఊరి సుంకరోని తోని సమానమట. నా తల్లిదండ్రులతోని కూడా నేనిన్ని తిట్లు తినలేదు చిలుకయ్యా'' దుఃఖంతో అన్నాడు. వెంకటయ్య.

పంతులును చూస్తే చిలుకయ్యకు జాలని పిస్తుంది. కాని తానేం చేయగలడు?

చదువుకుంటే దొరలలాంటివాళ్లు కూడా గౌరవిస్తారనుకున్నాడు చిలుకయ్య. 'రేపు తన కొడుకు చదువుకున్నా అంతేనా? అయినా తనకు కొడుకే పుడతాడన్న నమ్మకమేంది? బిడ్డయితే చదివించడం అనవసరం. కొడుకు పుట్టి దక్కితే తాను చదివిస్తాడు' తనలో తాననుకుంటూ తన ఇల్లు రాగానే పంతులుకు చెప్పి ఇంట్లోకెళ్లాడు చిలుకయ్య.

పంతులు దీనమైన ముఖమే చిలుకయ్య కళ్లముందు కదులుతోంది. సారని కూడా చూడకుండా తిట్టిన తిట్లు తిట్టకుండా తిట్టిన




దొర్సాని ముఖం జ్ఞాపకం వస్తోంది. 'నాలుగై దేళ్లక్రితంవరకక్కడ రజాకార్ల దౌర్జన్యం సాగింది. స్వాతంత్ర్యం వచ్చిందన్నారు. ఎన్నికలొస్తున్నాయన్నారు. అయితే ఇప్పుడు దొరలుమాత్రం రజాకార్లకంటెక్కువే సాగించుకుంటున్నారు. ఆ ప్రాంతంలో మొన్నమొన్నటివరకూ కమ్యూనిస్టుల ప్రభావముండేది. దొరలు వాళ్లకు భయపడేవారు. వెంగళరావు దొర పెద్దపల్లికి పారిపోయాడు. మూడేళ్లక్కడే ఉండి ఏడాదిక్రితమే తిరిగొచ్చాడు. అలాగే ఎంతోమంది...' గతాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు చిలుకయ్య.

'వారం రోజుల్లో ఎన్నికలున్నాయి. ఎవరికోటెయ్యాలి?' తనను తానే ప్రశ్నించుకున్నాడు చిలుకయ్య.

"కమ్యూనిస్టులు దొంగలు. వాళ్లు మనుషులను చంపుతరు. పైసలు దోచుకుపోతరు. మనదేశానికి స్వతంత్రం తెచ్చింది కాంగ్రెస్. రజాకార్లు లేకుంట చేసింది కాంగ్రెస్. కాంగ్రెస్‌కే ఓటెయ్యాలి'' దొర చెప్పిన మాటలు జ్ఞాపకం చేసుకున్నాడు.

"రజాకార్లకు వ్యతిరేకంగా పోరాడింది కమ్యూనిస్టులు. ఎంతోమంది ప్రాణాలు వదిలారు. వాళ్లకే ఓటెయ్యాలి'' రంగారావన్న మాటలూ జ్ఞాపకం చేసుకున్నాడు చిలుకయ్య.

'ఎవరికో ఒకరికేత్తాం' అనుకొని తన పనిలో నిమగ్నమయ్యాడు.

తెల్లవారినుంచే బడి పట్వారీ పంతులింటికి మారింది. వెంకటయ్య ఆ ఊర్నుండి బదిలీకోసం ప్రయత్నిస్తున్నాడు.

★ ★ ★

రోజూలాగే కోడికూతతోనే ఆ ఊరు మేల్కొంది.అయితే ఆరోజు కోడికూతకెంతో ప్రాముఖ్యముంది. ఊరి జనమంతా ఎంతో ఉత్సాహంగా ఉన్నారు. ఆ రోజు మొట్టమొదటిసారిగా వాళ్ళు ఓటేయబోతున్నారు. అంతవరకు ఓటంటే ఏమిటో తెలియని జనం ఓటు హక్కును వినియోగించుకోబోతున్నారు. రజాకార్ల కాలంలోలా తమకు కష్టాలుండవు. దేశానికి స్వతంత్రం వచ్చినా కొంతకాలంవరకు తమ ప్రాంతానికి స్వాతంత్రం రాలేదు. ఆ తర్వాత నైజాం పాలన పోయింది. ఇప్పుడు ప్రథమంగా దేశాన్నేలేవాణ్ణి ఎన్నుకోబోతున్నారు.

ఎన్నికలయితే మునుపట్లా తమపై జులుం, వేధింపులుండవని వాళ్ళు సంతోషపడ్తున్నారు. అందరూ గబగబా వాకిళ్లూడ్చారు. అలుకు చల్లారు. ఇళ్ళముందు ముగ్గులేశారు. పశువులను బయటకు పంపించారు. కొందరు అత్యవసర వ్యవసాయప్పనులు ముగించుకొని ఓటేసిరావాలని పొలాల కెళ్ళారు. కొందరు ఓటేసే పనులకెళ్దామని చూస్తున్నారు. మొదటిసారిగా ఓట్ల పండుగను జరుపుకోబోతున్నవాళ్ళకెంతో ఆనందంగా ఉంది. చావట్లో పోలింగ్ కేంద్రమేర్పాటు చేశారు. ఇంట్లో పనులు ముగించుకొన్నవాళ్ళు చావడి దిక్కు నడుస్తున్నారు.

అంబటాల్లయింది. ఊరి చాకల్లు 'చాకల్దాన్నవ్వా' అంటూ ఊరు తిరుగుతున్నారు. ఓట్లు వేయడం ప్రారంభమైంది. మూడు బజార్ల దగ్గరున్న బండలమీద కూర్చొని చాలా మంది మాట్లాడుకుంటున్నారు. ఓటు వేయడానికి ఉత్సాహంగా పోతున్న చిలుకయ్య వాళ్ళను చూసి ఆగాడు.

"ఏం చిలుకయ్యా బాగురుకుతన్నవు? ఓటేసుటానికేనా?" అన్నాడు రాజిరెడ్డి.

"ఓటేసుటానికి కాకపోతే ఏడికిపోత? ఇయ్యాల్ల ఓట్ల పండుగేనాయె'' అన్నాడు చిలుకయ్య.

"మరి నీ భార్యను తీసుకపోతలేవేంది? ఆడోల్లకు గూడ ఓటుంది తెలుసా?"

"ఉంది నిజమే... అది పొద్దుల్తో నుంది. ఇప్పుడో అప్పుడో అన్నట్టుంది. నేను ఓటేసుటానికి రమ్మని మా అన్న... కడుపు నొత్తంది



రానని పన్నది'' అన్నాడు చిలుకయ్య.

"నిల్చుండే మాట్లాడవడ్తివి.... అట్ల కూసోలేవు. పొద్దుగూకె రాక ఎప్పుడన్న పొయ్యి వేయచ్చోటు. ఇప్పుడే షురువైంది''

చిలుకయ్య వేపచెట్టు నానుకొని కూర్చున్నాడు.

"చిలుకయ్యా! ఎవ్వలకేత్త వోటు?"

ఎవ్వలకో ఒగలకేత్త... అక్కడికి పోయినంక ఎవ్వలకు బుద్ధిపుడితే వాళ్ళకేత్త'



"భలే చాలుగానివే ఉన్నావు... ఎవ్వలకేత్తవో చెప్పలేవు''

"వెంగళరావు దొరైతే కాంగ్రేస్‌కే వెయ్యమని చెప్పిండు. పట్వారి పంతులు, కొండల్‌రెడ్డి గూడ గట్లనే చెప్పిండ్రు. గా రంగారావు గిట్టనేమో కమ్యూనిస్టుల కెయ్యాలన్నడు. ఎవ్వల కేసుడో తెలుత్తలేదు. అక్కడ ఎవ్వలకు బుద్ధిపుడితె వాళ్ళకేత్త'

"దొరలు చెప్పినట్టు కాంగ్రేస్‌కే ఓటెయ్యాలె... మన దేశానికి స్వాతంత్రం తీసుకొ

చ్చింది కాంగ్రేసోల్లే. గాంధీ, నెహ్రూలు ఎంత పాటుపడితే స్వాతంత్ర వచ్చింది?"

"అం... కాంగ్రెసోల్లు చేసింద్రు తియ్యి''

"ఇంకెవరు చేసింద్రు వాళ్ళు చేయ కుంటే? గాంధీ ఇంగ్లీషు వాళ్ళ బూట్ల తన్నులు తిన్నాడు. జైలు కెళ్ళిండు. నెహ్రూ కూడా ఎన్ని కష్టాలు పడ్డడు ససంత్రంకోసం?"

"మనకిక్కడ నైజాం పాలనే ఉండె. కాంగ్రేసేం చేసింది మనకు?"

"అవు మరి మొన్న మొన్నటాక ఎన్ని కష్టాలు పడ్డం మనం? తురుకోల్ల చిన్నపోరడు గూడ పెద్దపెద్ద వయిసున్నోల్లను బెదిరించెటోడు. తురుకోల్లకు దొరలు కూడా భయపడెటోల్లు

తురకోడు లేని కాడ దూదేకులోడే సయ్యద్ అన్నట్టు మనూల్లె ఇమామ్‌సాబ్ ఎంత సాగించుకున్నడు?"

"ఇప్పుడదే ఇమామ్‌సాబ్ సుంకరి పని సేత్తండు... అయినా మునుపటలువాటుతోని సాబనే పిలువాలె''

"ఏం కష్టాలవి? ఊళ్ళెకు గిరుదావరి, తాసీల్దార్ వత్తున్నడంటె జెనమంత గజగజ వణికెటోల్లు. మంచి కోడి కనవడితె దొరుకవట్టి కోసుకునుడేనాయె. ఏది దొరుకుతది కొంచవోయెటోల్లు''

"ఒక్కలిద్దరైతె కోడి, ఎక్కో మందైతె గొర్లమందలకు పొయ్యి మాంచి పొట్టేలును తీసుకపోయెటోల్లు... ఆల్లకు దాతెక్కడిది? ఫిర్యాదెక్కడిది... ఆల్లను మాట అని బతికి నోల్లెవ్వరు?"

"తాసీలు కట్టనోల్లను వంగబెట్టి మీది నుంచి బండలెత్తెటోల్లు. తాసీలు గట్టలేక ఎంతోమంది భూములనే ఇడిసిపెట్టుకున్నరు. ఆ కష్టాలు పగోనికిగూడ రావద్దు''

"నీయవ్వ! గా రజాకార్లు నాశినెంగాను. గా నల్గొండ దిక్కైతె ఆడోల్లను బట్టలిడిపిచ్చి బతుకమ్మలాడిచ్చింద్రట. మానం బొయినంక బతుకుడెందుకని కొందరు నూతిలవడి సచ్చింద్రరు''

"మన దొరలు, పెద్దపెద్దోల్లంత నైజాం నవాబుకే మద్దతిచ్చింద్రు''

"అందరు గట్లేంలేరు. నైజాం దిక్కున్నోల్లు నైజాం దిక్కున్నరు. కొందరు దొరలైనా పేదోల్ల దిక్కున్నరు''

"నీ యవ్వ! జుట్టు పన్నులనుండె. గవ్వి కట్టలేక సచ్చెటోల్లు''

"అప్పుడు చదువులు గూడ తురకంలనేనాయె... ఊల్లెకు 'అక్బర్' వత్తె అదో తప్పు"

"అప్పుడు చదువుకున్నోల్లెవ్వలు? ఇప్పటికి గూడ ఊరంత గొడితె పదిగేనిరువై మంద తయితరేమొ? ఊల్లెకు కారటత్తె, ఇంకేదన్న కాయిదమత్తె పట్వారి దగ్గెర్నే చదవించుకునేటోల్లు... ఒక్క కొండల్ రెడ్డింటికి ఎప్పుడన్నోపారి గోల్కొండ పత్రికచ్చేది''

"పేదోనికి మంచి పెండ్లాముండద్దంటరు సూడు. గట్లుండేది దొరల సంగతి. నైజాం కింద ఉండి మస్తు ఘోరాలు చేసెటోల్లు. సముర్తయినాడిది మొదాలు దొరల దగ్గెరికే పోవన్నాయె''

"ఇప్పుడు మాత్తురం వెలుమదొరలు, రెడ్డి దొరలు తక్కువ సాగించుకుంటుంద్రా? గా జగిత్యాల దగ్గెరో వెలుమ దొరున్నడట... అయినె ఆడోల్లు ముంతలు పట్టుకొని పోయేకాడికి మనిషిని తోలిత్తడట. అండ్లనుంచి ఎవ్వలను రమ్మంటె ఆ ఆడామె దొరింటికి ముంతతోనే పోవాలె... గట్లెంతో మందిని పాడుజేసిండటాయినె. అట్ల తెచ్చిన ముంతలన్ని ఓ అర్రలేస్తె అర్రే నిండిందట"

"గోడలకు చెవ్వులుంటయి... బాగా మాట్లాడకుండ్రి. మనూల్లె మాత్రం కొంచెమెక్కోతక్కో అసోంటోల్లు లేరా ఏంది? దార్ల లచ్చయ్య బిడ్డను నర్సిరెడ్డి దొర కొడుకు నాశినెంజేత్తె ఎవ్వలేం జేసింద్రు?"

"ఇన్ని రోజుల కాలం వేరు. ఇప్పటి కాలం వేరు... ఇన్రోజులు నవాబు మనలనేలె. ఇప్పుడు మనల్ని మనమే ఏలుకుంటం.

మెల్లె మెల్లెగ ప్రజలు తెలివికత్తంద్రు''

"ఏం తెలివికత్తంద్రో నాకైతె సముజయిత లేదు. దొరలు ఓటెయ్యి మన్నోల్లకే ఏసెటోల్లే చాలమందున్నరూల్లె'

"గిప్పుడే ఓట్లాయె... గీటి సంగతేడ తెల్సింది జెనాలకు. రొండు మూడు సార్లోటే త్తె గప్పుడు తెలివికత్తరు''

"ఇవ్వన్నీటి సంగతి నాకు తెలువది కని నాకైతె నాలుగేండ్ల కింద రజాకార్లున్నప్పటి కున్ను, గిప్పటికేమంత తేడ లేదనిపిత్తుంది. గప్పుడు రూమి టోపి పెట్టుకున్నోల్లత్తె భయ పడెటోల్లం. గిప్పుడు మన దొరలే గంతకంటె క్కో నడిపిత్తంద్రు''

"ఎంతైన గంతన్నాయెం ఏం లేదు. ఈల్లు గూడ సాగిత్తంద్రు నిజమే. ఇదెట్లున్నదంటె వానకు, ఎండకున్న తేడ లెక్కున్నది. మనం ఎండెంతున్నా కొంచెమన్న పనిజేత్తం. ఎండల కొంచెంసేపు నిల్చుండ గల్గుతం. అదే వాన ఉతికుతికి చంపిందనుకో. ఒక్క నిమిషమన్నుంటమా? మునుపున్న నైజాం కాలం వానల బతుకుడసొంటిదైతే, అటెనుక కాలం ఎర్రటెండల బతుకుడసోంటిది. గందుకే ఎండ ఎలుమోడైతె వాన తురుకోడ న్నరు.."

"రాజిరెడ్డి చెప్పింది నిజం. మా తాత చెప్పుతె విన్న... అప్పుడయినె పెద్దపెల్లిల ఉండెనట. ఆ రోజు రాత్రి పట్నం నుంచి బైలెల్లి రజాకార్లు కరీంనగర్ జిల్లాల కొన్ని వేలమందిని చంపేదుండెనట. అయితె వాళ్లు బయలెల్లే యాల్లకు కుండపోత వర్షం పడిందట. తెల్లందాక వానేనట. రోడ్లమీది నుంచే మోకాళ్ల బంటి నీళ్లు పోయినయట. అట్ల ఆల్ల రాకడ బందయిందట. అంతల్నే మిల్టి యాక్షనైందట. గప్పుడు రజాకార్లంత ఎక్కడోల్లక్కడ తోకలు ముడిచింద్రు''

"అటెనుక మనోల్లు ఆల్లమీది కెగవడ్డ రట"

"గదేం పని? ఎవ్వలదైన పానమే. ఎప్పుడైనా తురకోల్లుగాని, మనోల్లుకాని నష్టపడ్డది బీదోల్లె'

"అవుమరి... రజాకార్లకు వ్యతిరేకంగా కొంతమంది పేద తురుకోల్లు కొట్లాడింద్రు''

"మొత్తం మీద కమ్యూనిస్టులు కొట్లాడితెనే మనకు రజాకార్ల పీడ పోయింది''

"ఆల్లతోనేంగాదు తియ్యి... పటేలు మిల్టి రాకుంటె వీళ్లను తుక్కుతుక్కు జేసెటోల్లు రజాకార్లు''

"పటేలు సైన్యం పంపింది రజాకార్లనణిచే పేరుమీద కమ్యూనిస్టోల్లను చంపడానికి. అప్పటికే వీళ్లు భూములు పంచింద్రు. అట్లనే ఉంటె దొరల పట్టుపోతుందని వాళ్లనణచేసింద్రు. ఎంతమంది దొరలు ఊళ్లిడిసి పోలేదు?"

"అవు.. మన వెంగళరావు దొరకూడ పారిపోయిండు''

"గూండాగిరి చేత్తె ఎవ్వలైన భయపడుతరు. కమ్యూనిస్టులు చేసే పని మనుషులంజంపుడు. పైసలు వసూలు చేసుడేనాయె''

"వాళ్లెవ్వల కోసం పైసలు జమ చేసింద్రు? వాళ్లను దొంగలని ప్రచారం చేసింది కాంగ్రెసోల్లే'

"గట్టెపెల్లి మురళయ్య మన ఊళ్లె కొత్తె ఎంత భయపడెటోల్లు? ఇప్పుడచ్చినా అందరు వంగివంగి దండాలు పెడుతరు''

"అయినె మన వెంకటేశ్వర్‌రావు పట్వారి పంతులుకు చుట్టమేనాయె. రజాకర్ల కెదురుగా మన దిక్కునుంచి అయినే మస్తు పోరాటం చేసిండు. అయినె కాలుకు తపాకి గుండు దెబ్బలున్నయి''

"మురళయ్య దొరే కాక శ్యాంసుందర్ సింగ్, రాజారాం సింగ్, అనభేరి ప్రభాకర్, ఎస్.కె.పిళ్లే పని చేసింద్రు మన దిక్కునుంచి''

"ఆల్లందరి సంగతేమొకని మురళయ్యైతె పనిజేసిండు''




"ఏదేమైనా కమ్యునిస్టులతోనే మనకు రజాకార్ల పీడపోయింది. మనమాల్లకే ఓటె య్యాలె"

"ఆల్లకోటేత్తె దొరలూకుంటరా? దేశానికి ససంత్రం తెచ్చినోల్లు కాంగ్రెసోల్లు. ఆల్లకే ఓటెయ్యాలె"

"ఎవ్వల కోటేసింది ఎట్ల తెలుత్తది? మన ఇష్టమున్నోల్లకేత్తాం"

కొందరు కాంగ్రెస్‌కు, కొందరు కమ్యుని స్టులకేయాలని వాదించుకుంటున్నారు. ఆ వాదన ముదిరి ముదిరి కొట్లాటకు దారి తీసే పరిస్థితేర్పడింది. ఇంతలో అక్కడికి పోలీసు లొచ్చారు. వాళ్లను చూసి కూర్చున్న వాళ్లు కూడా నిల్చున్నారు.

"ఏం చేస్తున్నరిక్కడ? క్యా గడ్‌బిడ్ కర్‌రై" లాఠీ ఊపుతూ అన్నాడో పోలీసు.

"ఏం లేదు సార్. ఓటెయ్య పోతన్నం" ఒకతనన్నాడు.

"మరిక్కడెందుకు జమయింద్రు? గడ్‌బి డ్ కర్నేసే హత్‌కడీ లగాయేగా" అనగానే ఎక్కడివాళ్లక్కడ వెళ్లిపోయారు.

గాలికి పొయ్యేకంపను తలుగబెట్టుకును డంటే ఇదే. ఓటేయడానికి పోయేటోన్ని పోక ఇక్కడెందుకాగినట్టు? తొందరగా పోయి ఓటేసి రావాలె. ఇంట్లామె ఎట్లుందో? తనలో తాననుకుంటూ చావడి దగ్గరికెళ్లాడు చిలుక య్య.

ఓటెలా వేయాలో ఎవరికేయాలో చెబు తున్నారు రెండు పార్టీల వాళ్లు. తమకే వేయాలని ఫలానా చోటే ఒత్తాలని ఇరుపక్షా లవాళ్లూ చెబుతున్నారు. ఇద్దరు చెప్పిందీ విని తలూపి చావట్లోకి వెళ్లాడు చిలుకయ్య.

లోపలికెళ్లి తన పేరు చెప్పింతర్వాత వేలుకేదో రంగు రాస్తుంటే అదోలా అని పించిందతనికి. బ్యాలెట్ పేపరు తీసుకొని లోపలికెళ్లాడు. బెంచీపై దాన్నుంచి విప్పా డు. రెండు గుర్తులనూ పరీక్షగా చూశాడు. గుర్తులే తప్ప వ్యక్తుల పేర్లాతడు చదువలే డు. కొద్దిక్షణాలు ఎవరికోటేయాలా అని ఆలోచించాడు. ఒక గుర్తుపై ముద్ర వేశాడు. ఎందుకోకాని అతనికది సంతృప్తిగా లేదు. మరికొద్ది క్షణాలాలోచించాడు. మరో గుర్తుపై ముద్ర వేసాడు. బ్యాలెట్ పేపర్ మడిచి బాక్స్‌లో పడేసి బయటకొచ్చాడు.

ఎవరికోటేసావని అడిగితే "ఇద్దరికీ..." అన్నాడు చిలుకయ్య.

ఇంటికెళ్తున్న చిలుకయ్య కెదురుగా పరు గెత్తుకొచ్చాడు రామనర్సు.

"చిలుకన్నా! ఓటేసుటానికి పొయ్యి గింత సేపేం జేత్తున్నవే? ఇంటికాడ వదినె ఆపతి పడ్తంది. కానుపు కష్టమాయెటట్టుంది. జెప్పన్నడువింటికి" అన్నాడు రామనర్సు.

ఆ మాటలు విని వణికిపోయాడు చిలుక య్య.

నాలుగైదు కాన్పులయి పురుట్లోనే పోయారు. ఈ కాన్పునైనా దక్కించుకోవా లని నానా తంటాలు పడుతున్నాడు చిలుక య్య. ఎవరేది చెబితే ఆ జాగ్రత్త తీసుకుంటు న్నాడు. భార్య కోరినవన్నీ తినిపించాడు. బాలెంత వెచ్చాలవీ కొనుంచాడు. మంచి తేనె సీసానిండా కొనిపెట్టాడు.

"రామనర్సన్నా! మంత్రసానిని తీసుకొ చ్చింద్రా! నేనిట్నుంచే పొయ్యి తీసుకురావ న్నా?" గబగబా నడుస్తూనే అన్నాడు చిలుక య్య.

"మంగలి సాయమ్మ మా వచ్చింది. వదినె మొత్తుకుంటుంది. జెల్ది జెల్ది నడు వింటికి"

ఇద్దరూ చిలుకయ్య ఇంటికి చేరుకున్నా రు.

"అమ్మో... అమ్మో... భగవంతుడా... భగవంతుడా!" లోపల్నుంచి కేకలేస్తోంది ఆయాసంతో చిలుకయ్య భార్య రాజమ్మ.

అరుగెక్కి లోపలికి పోబోయిన చిలుక య్యనాపి "మొగోల్లు లోపలికి పోతరా?" అని

మందలించారాడాళ్లు.

భార్య బాధకాగలేక మొత్తుకుంటుంటే చిలుకయ్య ఆందోళన పడుతున్నాడు. ఈ కాన్పయినా దక్కాలని మనసులోనే వేయి దేవుళ్లకు మొక్కుకుంటున్నాడు. వేములవాడ రాజేశ్వరస్వామికి కోళ్లాగెను కట్టి వేస్తానని మొక్కాడు. కొండగట్టంజన్న దగ్గర కొబ్బరికాయగొట్టి కోణ్ని కోస్తానన్నాడు. కొమురవెల్లి మల్లన్న దగ్గర పట్నాలేస్తానన్నాడు. ఓదెల మల్లన్నకు గజ్జెల లాగు కుట్టిచ్చి కట్నం ఇస్తానన్నాడు. అన్నిదేవుళ్ల దగ్గరా పుట్టు వెంట్రుకలు తీస్తానని మొక్కాడు. శుక్రవారం దేవతకు గొర్రెను బలిచ్చి కొలుస్తానన్నాడు.

మంత్రసాని ఆడవాళ్ల సాయంతో కాన్పు చేయడానికి ప్రయత్నం చేస్తోంది. సమయం గడుస్తున్నకొద్దీ చిలుకయ్యకు భయం పెరుగుతోంది.

"రామనర్సూ! కరీంనగర్ దావఖానకేసు కపోదామా వదినెను''

"బస్సేమో లేకపాయె. గంత దూరం పోయేదాక బతుకుతదా? ఏంగాదు? సాయమ్మ నూర్లకాన్పుల్జేసింది. మంచిగనే సేత్తది''

"వదినెకేమన్నయితే నేనైతె బతుక"

ఇంతలో లోపల్నుంచి కెవ్వుమని కేక విన్పించింది. ఆ తర్వాత నిశ్శబ్దం... కొద్ది నిమిషాల తర్వాత పసిగొంతు ఏడ్పు... చిలుకయ్య తల్లి కొంరమ్మ బయటకొచ్చి

"నీకు కొడుకు పుట్టిండు బిడ్డా?" అంది.

"తల్లి పిల్ల మంచిగున్నారె అవ్వ'' ఆతురతగా అడిగాడు.

"మంచిగనే ఉన్నరు. ఇన్నోజులకు నీ మొర దేవునికి ముట్టింది. నీ తవుసులు పలించినయి. బొడ్డుగొయ్యాలె నేం బోత" అంటూ లోపలికెళ్లింది కొంరమ్మ.

చిలుకయ్య మనసు తంద్రినయ్యానన్న ఆనందంతో పురివిప్పిన నెమలిలా నాట్యమాడుతోంది. అతని కాలొక్కచోట నిలువడంలేదు.

"చిలుకన్నా! నాకు కల్లు జెప్పు. నీకు కొడుకు పుట్టిండుకదా!" అన్నాడు రామనర్సు సంతోషంగా.

"పురుడునాడు పండి బొర్లెటట్టు తాగిపిత్త తియ్యి. నీకు తాగన్ననుంటె అన్నగౌని దగ్గర తాగుపో. నేను పైసలిత్త ఎనుకసిరి''

రామనర్సు అక్కడ్నుంచి వెళ్లిపోయాడు.

చిలుకయ్య కొల్లుగుంట తోడాడు. బాలింతకు స్నానం చేయించడానికి నీళ్లలో వేసి కాగబెట్టడానికి వాయిలాకు, తక్కలాకు తీసుకొచ్చాడు. కాగుల్లో నీళ్లు కాగుతున్నాయి. ఒకామె వెచ్చాలు నూరుతోంది.

"తంఢ్రి లెక్కనే ఉన్నడు కొడుకు'' అంది వెచ్చాలు నూరే స్త్రీ.

"చల్లగ బతుకుతె ఐపాయె'' అంది మరో స్త్రీ.

కొద్దిసేపటి తర్వాత అరుగుమీదికెక్కి గడప దగ్గర నిల్చొని మంచంలో పడుకొనున్న కొడుకును చూసుకున్న చిలుకయ్యకెంతో ఆనందం కలిగింది. తనువు పులకించింది.

ఆడవాళ్లంతా కలిసి బాలింత స్నానం చేయించారు. రాజమ్మతో వెచ్చాలవీ తినిపించారు.

చూస్తూ ఉండగానే ఇరవై రోజులు గడిచాయి. ఆ రోజే చిలుకయ్య కొడుకు బారసాల.

గౌండ్లు తెచ్చిన కల్లు వాసన గుప్పుమంటోందా ఇంట్లో. కాగులో గుడాలు తుకతుకా ఉడుకుతున్నాయి.

అండాల్లో అన్నముడుకుతోంది. రెండు గొర్రెపోతుల కూర తుకతుకా ఉడుకుతోంది. కొడుకు పుట్టాడన్న సంతోషంతో ఎంత ఖర్చు చేయడానికైనా వెనుకాడటంలేదు చిలుకయ్య.

పగలు కల్లు గుడాలతో విందు చేశాడు చిలుకయ్య. రాత్రి పేరు పెట్టడానికి కూర్చు





న్నారు.

"ఏం పేరు పెడుదాం?" అందొకావిడ.

"మంచి పేరు పెట్టాలె నా కొడుక్కు" అంది రాజమ్మ.

"వేములవాడ రాజేశ్వరస్వామి పేరు పెడుదాం"

"అయిలోని మల్లన్న పేరు పెడదాం"

"కొండగట్టంజన్న పేరైతే బాగుంటుంది"

"ఇవ్వన్ని మోటుగున్నయి. తిరుపతి వెంకన్న పేరు పెడుదాం"

"నారాయణమూర్తి పేరు నారాయణని పెడదాం"

మనిషికోపేరు సూచిస్తున్నారు.

"చిలుకన్నా! అందరేమో నీ కొడుకు పేరు గురించాలోసిత్తంటే నువ్వేం మాట్లాడ వేంది?" అన్నాడు రామనర్సు.

"లేక లేక కల్గిన కొడుకు. మంచి పేరు పెడితే కండ్లు గుట్టి తీసుకపోతడు దేవుడు. మోటుపేరు పెడితెనన్న బతుకతడు. ఏ పేరైతేంబాయె భూమీమ్మద బతికి పేరుకత్తె సరిపాయె. పోంగపోంగ మిగిలిన పిల్లలకు భిక్షపతి, భూమయ్యని, సాంబయ్యని పేర్లు పెడుతరు. నా కొడుకు పేరు సాంబయ్యని పెడుతున్న. మా తాతపేరు కూడా సాంబయ్యే" అన్నాడు చిలుకయ్య.

"గా పేరు మోటుగుంది" అందొకామె.

"మోటుగుంటేంబాయె. పొల్లగాడు బతుకుతయిపాయె"

"అంతే... అంతే..." అన్నారందరూ.

'సాంబయ్య... సాంబయ్య కూ...' అని చిలుకయ్యతో ఆ పసివాడి చెవుల్లో ఊదించారు. ఆ తర్వాత నలుగురైదుగురాడవాళ్లు అలాగే పిలిచారు. ఆ అల్లరికి ఏడ్వసాగాడా పసివాడు. తండ్రి చేతికిచ్చారతన్ని.

తండ్రిమీద చిమ్మిచ్చి మూత్రం పోశాడు సాంబయ్య.

"ఇంతసేపెత్తుకున్నా ఎవ్వలమీద పొయ్యలే. తండ్రిమీదనే పోసిండు. తండ్రి మీద మస్తు ప్రేముంటదీ పిల్లగానికి" అంది ఓ ముత్తైదువ.

"కొడుకు పుట్టిండు గద! ఇగాగడు చిలుకయ్య" అతనికి వదిన వరుసలున్న ఆడవాళ్లు పరాచికాలాడారు.

"చిలుకయ్యా! నీకు వంశాంకురం పుట్టాడు. నాకేమిస్తావో చెప్పు" అంటూ ఆ ఊరి అయ్యగారు రెండు రూపాయలడుక్కపోయాడు.

ఆ తర్వాత పొట్టేలు మాంసంతో వచ్చిన వాళ్లందరికీ కడుపునిండా భోజనం పెట్టాడు చిలుకయ్య.



సాంబయ్యంటె తల్లికి ప్రాణం. నానమ్మకు ప్రాణంకంటే ఎక్కువే. తండ్రికి పంచప్రాణాలు. తాతకు అపురూపం. లేక లేక కలిగిన పిల్లవాడిగా తమ వంశాన్ని నిలబెట్టే వంశోద్ధారకుడిగా సాంబయ్యను వాళ్లు ప్రాణాధికంగా చూసుకుంటున్నారు. కొంరమ్మ కోడలును అంతకుముందు పిల్లలు లేరని దెప్పేది. గొడ్రాలని తిట్టేది. సాంబయ్య పుట్టింతర్వాత రాజమ్మకత్తపోరు తప్పింది. సాంబయ్య పుట్టినేడు వర్షాలు బాగా పడి చిలుకయ్యకు మంచి పంటలు పండాయి. అంతకుముందు స్వల్పంగా ఉన్న అప్పుల్లో కొన్ని తీరాయి. అందువల్ల సాంబయ్యను

తమ అదృష్టదేవతగా భావిస్తారు వాళ్లు.

"నీ కొడుకు స్వతంత్రం వచ్చింతర్వాత పుట్టిండు. బానిస బతుకు బతుకవల్సిన పన్లేదు. అదృష్టవంతుడు''

"మొట్ట మొదటి జెనరల్ ఎన్నికల రోజున పుట్టిండు.. గొప్పోడే అయితడు''

నవ్వితే చెంపలు లొట్టలు పడుతుంటాయి. నషీవ వంతుడే''

తన కొడుకును గూర్చి మిత్రులు, బంధువులు అంటుంటే ఎంతో మురిసిపోతున్నాడు చిలుకయ్య. ఆ ఇంటి వాళ్ళంతా సాంబయ్యను చేతులమీదే ఎత్తుకొని తిప్పుతున్నారు.

"చిలుకయ్యా! నీ కొడుకును బాగా చదివించాలె. మీ వంశంలనే చదువుకున్నోల్లు లేరు. మీ కులంలనే ఇంతవరకు నౌకరిజేసినోడు లేడు. నీ కొడుకును నౌకరాయెదాక సదివియ్యాలె' అనేవారు చిలుకయ్య స్నేహితులు.

"తప్పకుండ చదివిస్త... పెరుగనైతె పెరుగనీయ్'' అనేవాడు చిలుకయ్య.

పిల్లలపై ఎంత ప్రేమున్నా, వాళ్ళనెంత ప్రాణాధికంగా చూసుకుంటున్నా గ్రామాల్లో వ్యవసాయం చేసుకుంటూ, వ్యవసాయ కూలి పనులు చేసుకుంటూ బతికే కుటుంబాల వారు పనులకు పోక తప్పదు... పోకుంటే వెళ్ళదు. అందువల్ల రాజమ్మకెంత పోవద్దని ఉన్నా సాంబయ్యకు ఆర్నెల్ల వయసొచ్చి రాకముందు నుంచే చేను పనికి పోవలిసివచ్చింది కొడుకును అత్తకప్పగించి పోయేది రాజమ్మ. ఊరు దగ్గరున్న పొలంలో పనయితే మధ్యాహ్నమొచ్చి పాలిచ్చి పొయ్యేది. దూరంగా ఉన్న పనయితే రావడానికి వీలుపడేది కాదు. అలాంటిరోజు రాజమ్మ తన చనుబాలను బొడ్డుపావులో పిండేది. అందులో రెండు బియ్యపు గింజలు వేసుంచేది. బాబుకు ఆకలయినప్పుడు కొంరమ్మ ఆ పాలను పట్టేది. పోతపాలు తాగిపిస్తే కొడుక్కు మంచికాదని తన పాలే పిండుంచేది.

సాంబయ్య ఇప్పుడిప్పుడే తప్పటడుగులు వేస్తున్నాడు. కొంరమ్మ వాకిట్లో ఆతన్నెత్తుకొని ముద్దాడుతోంది.

"నా మనుమడం టేందనుకున్నవు? పోలీసైతడు, అమీనైతడు'' తన పక్కన కూర్చున్న నర్సమ్మతో అంది కొంరమ్మ.

"అంతకంటె ఇంకెన్నో పెద్ద నౌకర్లున్నయి'' అంది నర్సమ్మ

"అయితె నా మనుమడు తాసీల్దారైతడు''

"ఎందుకు పుక్కానికచ్చిన కోళ్ళు బాగా తినచ్చనా?"

కొంరమ్మకు ఊళ్ళోకి తాసీల్దార్, అమీన్ సాబ్ లాంటి వాళ్ళొస్తే ఎంత హడావిడి జరిగేదో కళ్ళముందు కనబడుతోంది. అందుకే తన మనుమడు కూడా అలా వైభవంగా బతుకాలని కోరుకుంటోంది.

"నా మనుమడు పుక్కానికచ్చినయేం తినడు. ఎక్కో మాట్లాడుతె పెద్ద వకీలైతడు'' అంది కొంరమ్మ.

అప్పుడే వాకిట్లో కడుగుబెట్టిన చిలుకయ్య బారెడు జోల్లు అరుగుమీదున్న గుమ్మికి తగిలించి.

"ఏందే అవ్వ... ఏంది? ఏమో అంటున్నవు?" అన్నాడు.

"ఏం లేదు కొడుక... మనుమన్ని బాగా చదివియ్యాలంటన్న'' అని కొడుకు చేతుల్లోకి వ్వబోయింది కొంరమ్మ.

అప్పుడే సాయమాన్లోంచి బయటకొచ్చిన రాజమ్మ "కాళ్లేతులు కడుక్కోకనే పొల్లగాన్నెత్తుకుంటన్నవా? పొయ్యి పొయ్యచ్చి దుబ్బ ధూళితోని పొల్లగాన్నెత్తుకుంటె 'మైలలు' తలుగయా? కాల్లు కడుక్కచ్చుకో పో' అంది.

కొడుకును తల్లి దగ్గరే ఉంచి

"అబ్బో నీ యవ్వ కొడుకంటే బాగానే





ఇదుంది'' అని బావిదగ్గరికెళ్ళి నీళ్ళు చేదుకొని కాళ్ళు చేతులు, ముఖం, కడుక్కొని రుమాల్తో తుడుచుకుంటూ వచ్చాడు చిలుకయ్య. రుమాల్ను మంచంమీద పెట్టి కొడుకు నెత్తుకున్నాడు.

తండ్రి చంకలో చేరి 'నాన... నాన' అన్నాడు సాంబయ్య. మొదటిసారిగా ఆ మాటలు విన్న చిలుకయ్య మనసు ప్పొంగింది. ఆనందంతో గంతులేసింది. కొడుకును ప్రేమగా హృదయానికత్తుకున్నాడు.

రాజమ్మ వాకిట్లోకొచ్చి కొడుకును దగ్గరకు తీసుకొని బాపని పిలువు బిడ్డా. 'బాపూ... బాపూ...' అని ఒక్కొక్కక్షరం అనిపించడానికి ప్రయత్నం చేస్తోంది.

"నానా అని పిలిత్తేంబోతందే?" అన్నాడు భార్యతో చిలుకయ్య.

"ఇయ్యాల్ల రేపు మాదిగి మన్నెపోల్లు గూడ నాన్ననే పిలుత్తండ్రు... బాపనే పిలువనియ్యి... మంచిగుంటది'' అంది రాజమ్మ.

స్వంత వ్యవసాయం చేసుకుంటున్న వాళ్ళు, ఆర్థికంగా కొంచెం మెరుగ్గా ఉన్నవాళ్ళు స్వాతంత్ర్యం తర్వాతి కాలంలో తండ్రులను బాపూ అని పిలువడం మొదలైంది. స్వాతంత్ర్య సంగ్రామ ప్రభావం తెలంగాణా జిల్లాల్లో పెద్దగా లేకున్నా గాంధీగారి పేరు, ఆతన్ని బాపూ అని పిలవడం గూర్చి అక్కడ ప్రచారంలో ఉంది. ఆ ప్రభావంతోనే కావచ్చు బాపూ అనే పదం అక్కడ వాడుకలో కొచ్చింది.

అతికష్టంగా 'బాపు... బాపు' అని సాంబయ్య పిలిస్తే ఎంతో ఉప్పొంగిపోతున్నాడు చిలుకయ్య.

బాపూజీ మరణం గూర్చి, ఆతని సేవల గూర్చి, హరిజనుల గూర్చి ఆతడు చెప్పిన విషయాల గూర్చి ఎవరో చెప్పిన విషయాలను జ్ఞాపకం చేసుకున్న చిలుకయ్య మనసులోనే ఆతనికి జోహార్లర్పించాడు. కొడుకు నెత్తుకొని వాకిట్లో అటూ ఇటూ తిరుగుతున్నాడు. కొడుకు చెవులు పీకుతున్నా, కాళ్ళతో పొట్టపై తన్నుతున్నా ఆనందంగానే ఉందతనికి. ఇంతలో చిలుకయ్య తండ్రి లచ్చుమయ్యొచ్చి వాకిట్లో దూరంగా నిల్చొనున్నాడు. చేతిలో ఉన్న కట్టెను గోడకానించి.

"ఛీ నీయవ్వ! మాదిగిండ్లల్ల కెల్లచ్చిన. కాళ్ళకు చెప్పుల్లెవ్వని ఎన్నిసార్లు చెప్పినా తేకపాయె లింగడు. బట్టపేలికలు బజార్లనే పారేసిరి. కాలుకు తలిగింది. పెయ్యి కడుక్కోవాలె' అన్నాడు. కొడుకు నెత్తుకొమ్మనిఇస్తున్న చిలుకయ్యతో దూరంగా జరిగి.

"ఏందే నాయిన్న... హరిజనవాడకు పొయ్యచ్చినందుకే పెయ్యి కడుక్కోవన్నా? గీ మాట వాళ్ళింటె తప్పువెడుతరు''

"ఎవ్వలిట్టమాల్లు... ఆడెవడు తప్పనుటానికి? మా నాయిన్నయితె వాళ్ళ వాడకు పోతె నోటికడ్డం బట్టగట్టుకునెటోడు. ఆల్లెవ్వలన్న ఇంటికత్తె బజార్లకే పొయ్యి మాట్లాడెటోడు... ఆల్లు ఆకిట్ల అడుగు పెడితె ఆల్లు పోయినంక నీల్లు చల్లందెవ్వలను నడువనియ్యక పోవు'' అన్నాడు లచ్చుమయ్య.

"గిప్పుడు ససంత్రమచ్చింది. గవ్వన్ని మరిచిపోవాలె'

"వత్తేంది? దేనికదే'' అని బావిదగ్గరికెళ్ళి స్నానం చేసి పొడిబట్టలు కట్టుకొని తడిబట్టలను పిండి ఆరేసాడు లసుమయ్య.

వచ్చి మనుమన్నెత్తుకొని ముద్దాడుతున్నాడు.

"నాయిన్నా! గా ఏముల పోచాలు గన్ని భూములెట్ల సంపాయించిండే?" అన్నాడు చిలుకయ్య.

ఆ మాటలు విని నిట్టూర్చాడు లసుమయ్య...

"మాది ఎడ్డికాలం కొడుక. కొంచెమంత తెలివున్నోంది, అచ్చెరప్పొడ (అక్షరజ్ఞానం) ఉన్నోంది రాజ్జమైంది. మాకు పైసేడ దొరికేది? తాసీలుగట్టుమంటె భయపడి గు

మ్ముల సందున దాగుండెటోల్లం, లేకుంటె ఆల్లుపోయేదాక ఊల్లెకు రాక చేనుమీదనే ఉండెటోల్లం. తాసీలు గట్టలేక ఎంతోమంది భూములిడిసిపెట్టింర్రు. పోచాలసోంటి కొంచెం చదువచ్చినోడు, పట్వారి పంతుల సొంటోడు అటుయిటుజేసి నూర్లకొద్దెకురాలు సంపాయించిండ్రు''

"నువ్వు మీ అన్నతోని గూడ బాగనే కొట్లాడినవటగద"

"అవు బిడ్డ... అయినేమొ ఊళ్ళె పెద్దమనిషి తనంజేసే... పంతుల్ను, పెద్దమనుషులను చేతిల వట్టుకోని మంచిమంచి భూమంత దొబ్బిండు... అయితేమచ్చె? అయినెకు పిల్లలే లేకపోయిరి. ఉన్న భూమిని కూడా నిల్పుకుంటానికి నేనో సావు సావవల్సచ్చింది''

"అవునే నాయిన్న! నాలుగేండ్లకింద చచ్చిపోయేదాక పెద్దనాయిన్న నిన్ను అర గోస పుచ్చుకున్నది నాకెరుకే... ఆనికేమొ కొంచెమంత చదువచ్చె... నీకురాకపాయె''

"గందుకే నీ కొడుకును బాగా చదివియ్యాలె... నిన్ను కానిగిరి బడికి మా తోలిన గని నువ్వే పోలే... మల్ల మనకు ఎవుసప్పని ఎల్లకపాయె... గందుకే ఊకున్న గీ ఎవుసంల గడియ రికాముండది... గవ్వ రాక డుంఢదన్నట్టుంటది. చేసింది చేసినట్టే మల్ల ఎక్కడేసిన గొంగడక్కడన్నట్టే''

"ఇన్నొద్దుల కాలం వేరు... ఇప్పటి కాలం వేరు. ఇప్పుడు మనోల్లే మనల నేలుతండ్రు. కొంచెమన్న పరుకుంటది''

"ఎవ్వడేల్తె మనకేమచ్చె? కాని చదువుకున్నోడెట్లయిన తెలివికల్లోడుంటడు. అందరికి రొండుకండ్లుంటె చదివచ్చినోల్లు నాలుగు కండ్లతోని చూస్తరు. మన శాంబయ్యను బాగా చదివియ్యాలె''

"మా చదివిత్తనే నాయిన్న'' అన్నాడు చిలుకయ్య.

వాళ్లు మాట్లాడుకుంటూ ఉండగానే చిలుకయ్యతో 'మజ్జత్ పోతూ వ్యవసాయం చేసే గంగయ్య వచ్చాడక్కడికి.

"ఏం గంగన్నా! ఎందుకో వత్తివి?" అన్నాడు చిలుకయ్య.

"ఏంజేత్తన్న వింట్ల? కచ్చీరు కాడికి పోదాం పా... చాకలి బక్కమ్మ పంచాయిత్తైతందక్కడ సూద్దాంపా''

"ఇంతకు ముందే నాగలిడిసచ్చిన, బుక్కెడంత బువ్వదినత్త... అట్ల కూసో' అని మంచంలో కూర్చున్న గంగయ్యకు కొడుకునిచ్చాడు చిలుకయ్య. సాయమాన్లోకెళ్లాడు. అన్నం తిని కొద్దినిమిషాల్లో బయటకొచ్చాడు.

"పోదాం పా'' అన్నాడు. సాంబయ్యను లసుమయ్యకిచ్చి లేచాడు గంగయ్య.

వాళ్లిద్దరక్కడికి చేరుకునేసరికి పెద్దలంతా కూర్చొనున్నారు. పంచాయతప్పుడే మొదలైంది. చాకలి బక్కమ్మ నిండు గర్భంతో తలవంచుకొని చెట్టుకింద కూర్చొనుంది.

"ఏంది గీ పంచాయతి?" చుట్టను కిందపడేస్తూ అన్నాడు వెంగళరావు.

"బక్కమ్మ మొగడు రొండేండ్లకిందనే చచ్చిపోయిండు. దానికిప్పుడు కడుపైంది. కులపోల్లు కులతప్పు పెడ్తండ్రు. ఏంజేసుడో ఆలోచించాలె' అన్నాడు చంద్రారెడ్డి. ఆతడు పోలీసు పటేలు.

"గిట్లనే ఉంటాదె బొడ్డి? ముండబొడ్డికి మొగడు కావల్సి వచ్చినాడె?" అన్నాడు పట్వారి వెంకటేశ్వరరావు.

బక్కమ్మేం మాట్లాడలేదు.

"గీ చాకలోల్లకు గిదో లెక్కా తియ్యిండ్రి'' అన్నాడు కొండల్‌రెడ్డి.

"వాళ్లు మంచిగుంటానన్నా ఉండనిచ్చే వాళ్లెవ్వలు? దొరల కొడుకులో దొరలో వాళ్లను నాశినం చేస్తారు'' అన్నాడు రంగారావు.

"ఇంతకు దానికి కడుపెవ్వళ్లేసింర్రో చె






ప్పుంద్రి?" అన్నాడు పద్మశాలి మచ్చయ్య.

"ఎవ్వల్జేత్తేంది? దీన్ని కులంలకెల్లి ఎల్లగొట్టాలె! దీనికి అగ్గి నీల్లు బందు. ఎవ్వలు దానింటికి పోయినా తప్పున పడుతరు'' అన్నాడు మాలీపటేలు.

"అది చేసింది నేనే. దాన్ని నేను పెండ్లి చేసుకుంటా'' అన్నాడు బక్కమ్మ మేనబావ కొంరయ్య.

"పెండ్లి చేసుకుంటానన్న తర్వాత పంచాయతెందుకు? వాడు దాని మేనబావేనాయె'' అన్నాడు రంగారావు.

"నీకేంది? ఊరి కమాసే లేదంటవు! ఊరన్నంక కొన్ని కట్టుబాట్లుంటయి. కొంరన్న, బక్కిని కులం నుంచి తీసేత్తన్న'' అన్నాడు వెంగళరావు.

బక్కమ్మ, కొంరయ్య తల్లిదండ్రులు వెంగళరావు, ఇతర పెద్ద మనుషుల కాళ్లమీద పడి బతిమిలాడుతున్నారు. దయజూడుమని

వేడుకుంటున్నారు. పెద్ద మడేలు బాలయ్య మాత్రం దొరనే సమర్థిస్తున్నాడు.

"ఇంకొక మాట చెప్పుండ్రి దొరా!" బక్కమ్మ తండ్రి ఏడుస్తూ అన్నాడు.

"బాగ బతిమిలాడుతండు బక్కి తండ్రి. వెలి తీసేద్దాం. మున్నూరు రూపాయలు దండుగ గట్టి కులంలకు రావచ్చు'' అన్నాడు వెంగళరావు.

ఆ మాటలు విన్న చాకలివాళ్ల తలలపై పిడుగుపడ్డట్టయింది.

"దొరా గన్ని పైసలు మేమేన్నుంచి తెత్తం? మా ఇండ్లమ్మినా గన్ని పైసలెల్లయి. మా లగ్గాలకు నూటపదార్ల కట్నమిత్తె అదే ఎక్కువ. దండుగ కిందికి మున్నూరంటె ఎట్లగడ్తం?" ఏడుస్తూ అన్నాడు బక్కమ్మ తండ్రి.

వాళ్లెంత బతిమిలాడినా పెద్ద మనుషుల మనసులు కరగడం లేదు.

కొంరయ్య వస్తున్న కోపాన్నాపుకోలేకపోతున్నాడు.

"దొరా మాకు కులం బోయిందన్నరు! మున్నూర్రూపాయల దండుగ గడితె బోయిన కులమెట్లత్తది? ఈ పైసలతోని కల్లు దాగుతరు. కల్లుదాగుతె వచ్చే కులం పోతేంది? ఉంటేంది?" అన్నాడు.

ఆ మాటలా పెద్ద మనుషులకు కొత్త, కొంరయ్య మాటలతో ఏదో ప్రళయం ముంచుకొచ్చినట్టు భావిస్తున్నారు వాళ్లు.

"ఏం మాటల్రా అవి? బాగ బలుపచ్చిందా? కన్నుమిన్నకానకుంటున్నవు. తంతె పండ్లిరుగాలె' అన్నాడు రాజారావు.

తండ్రి ఆపుతున్నా కొంరయ్య ఆగడంలేదు.

"దొరా! న్యాయమందరి కొక్కటేకద" అన్నాడు వెంగళరావుతో.

అవునన్నట్టు తలూపాడు వెంగళరావు.

"అయితే మీ కొడుకు తెనుగు నర్సయ్య బిడ్డను పాడుజేసిండు. దానికేం దండుగ గడ్తతో చెప్పుండ్రి'' అన్నాడు కొంరయ్య.

ఆ మాటలు విన్న వెంగళరావు ఆగ్రహొదగ్రుడై లేచి నిల్చున్నాడు.

"నాకే పంచాయతులు చెప్పెటోనివైనావురా? నీయమ్మ. చాకలి పీసునా గొడుదు, గాడ్దికొడుకును చెట్టుకు కట్టేయిండ్రి'' వెంగళరావనగానే నలుగురైదుగురొచ్చి కొంరయ్యను పంచెలతో వేపచెట్టుకు కట్టేసారు.

చేతిలో ఉన్న కట్టెతో వెంగళరావు కొంరయ్యను ఎక్కడ దొరికితే అక్కడ చావబాదుతున్నాడు. వాళ్లెంత ఏడుస్తున్నా వినిపించుకోవడం లేదు. ఇష్టమున్నట్టు కొట్టి,

"గాడ్దికొడుకును ఇయ్యాల్ల రాత్త్రిరంత ఇట్లనే ఉండనియ్యండ్రి. అన్నం నీల్లేం బెట్టద్దు. తెల్లారిడిసి పెట్టుండ్రి. యాడాది దాక కులంలకు రానియ్యద్దు. అటెనుక చూద్దాం" అని పంచె భుజమ్మీదేసుకొని వెళ్లిపోయాడు వెంగళరావు.

అతని వెనుకే మిగతా పెద్ద మనుషులు వెళ్లిపోయారు. కొంరయ్య తల్లిదండ్రులు, బక్కమ్మ, ఆమె తల్లిదండ్రులు అక్కడే ఉండి గోడుగోడున ఏడుస్తున్నారు.

అవన్నీ చూస్తూ నిలబడ్డ చిలుకయ్య మనసు వికలమైంది.

'నీయవ్వ! ఆ రజాకార్లే ఇంతకంటె నయ్యం. ఏమన్యాయమిది. దాన్ని పెండ్లి జేసుకుంటానన్నా పట్టించుకున్నవాడు లేడు. చిన్నోల్లు జేస్తేనేమొ తప్పు... దొరకొడుకు తప్పును గూర్చడుగుతె ఇంత దౌర్జన్యమా?' తనలోతానే గొణుక్కుంటూ ఇల్లు చేరుకున్నాడు చిలుకయ్య. గంగయ్య అంతకుముందే పనుందని వెళ్లిపోయాడు. చిలుకయ్య ఇంటి కెళ్లేసరికి కొంరమ్మ మనుమన్నెత్తుకొని,

"నా బంగారికొండ... నా చెక్కరికొండ... నా దొర" అంటూ మురుస్తోంది.

* * *




దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందన్న రోజున ఎంతో సంతోషించాడు చిలుకయ్య. రజాకార్ల పీడ విరగడైపోయిందన్న రోజున అంత కంటెక్కువగా ఆనందించాడు. మొట్టమొదటి ఎన్నికల రోజున పొంగిపోయాడు. అదేరోజు కొడుకు పుట్టినందుకూ ఇంకా ఆనందించాడు.

ఇక గ్రామాల్లో తనలాంటివాళ్ల బతుకుల్లో తప్పకుండా మార్పు వస్తుందనుకున్నాడు. ముఖ్యంగా తమ జీవితాలతో ప్రత్యక్ష సంబంధాలు కలిగివున్న దొరల అధికారాలు తగ్గుతాయనుకున్నాడు. కాని ఈ విషయంలో ఏ మార్పూ కనబడటంలేదు చిలుకయ్యకు, నీ బాంచెను, నీ కాల్మొక్తాలతోపాటు వంగివంగి నమస్కారాలు చేయడం అలాగే ఉంది. వెట్టిలాంటివి చెక్కు చెదరలేదు. మొన్నటికి మొన్న పోలీసు పటేలు కూతురు పెళ్ళయితే గొల్లలంతా కలిసి పది గొర్లు ఉచితంగా ఇవ్వాల్సివచ్చింది. పట్వారింట్లో బోయని మల్లయ్య వెట్టి చేస్తూనే ఉన్నాడు. చెప్పులు సమయానికి తేలేదని మాదిగ దుర్గయ్యను చెప్పులు విరిగేట్టు కొట్టాడు దొర. ఈమధ్యన మరోసారెన్నికలయ్యాయి. ఊళ్లో మూడు గదుల స్వంత పాఠశాల భవనం కట్టారు. ఇప్పుడూళ్లో ఐదవ తరగతి వరకుంది. చిలుకయ్య తండ్రి రెండేళ్లకితమే చనిపోయాడు.

సాంబయ్యకిపుడు ఆరేళ్లు. కొడుకునిక బడికి పంపించాలనుకుంటున్నాడు చిలుకయ్య. 'తన కులంలోనే చదువులు చదివి నౌకర్లు చేసినవాళ్లింతవరకూ లేరు. తన ఒక్కగానొక్క కొడుకును చదివించాలి... ఎంతైనా చదువుకుంటే మనుషులు తెలివికొస్తారు. తనకీమధ్యే కలిగిన కూతురును చదివించకున్నా మంచిదే కాని కొడుకును చదివించాలి. మరయితే తనకు పని వెళ్తుందా? నాన్న ఉన్నా కొంత తోడుగా ఉండేది. అమ్మకు చేతగాకుంటయింది. తాను పాలేరును పెట్టుకొని వ్యవసాయం చేసే స్థితిలో లేడు. మరి కొడుకును చదివించడం తన వల్లవుతుందా?' రకరకాలుగా ఆలోచిస్తున్నాడు చిలుకయ్య.

ఏదేమైనా తన కొడుకుని చదివించాలి. తనకులేని చదువును కొడుక్కివ్వాలి. తాను పడ్డ అవమానాలకు దూరంగా ఉంచాలి. పలకా బలపం పట్టుకొని తన కొడుకు బడికి పోతుంటే చూడాలి. ఏ పాఠమైనా గడగడా చదివేస్తుంటే విని ఆనందించాలి. ఈ విషయం గూర్చి ఒక్కసారి వెంగళరావు దొరనడగాలి. తనకు తెలియకుండా ఏ పని చేసినా దొరకు కోపం. వర్థిపుణ్యానికి దొర ఆగ్రహానికి ఎందుకు గురి కావాలి? దొరకు చెబితే మునిగిపోయేదేముంది?

లేచి వెంగళరావు ఇంటికెళ్లాడు చిలుకయ్య. కచ్చేరింట్లో పడక కుర్చీలో కూర్చొనున్నాడు దొర. అతని చుట్టూ తిరుగుతూ గడ్డం గీకుతున్నాడు మంగలి నర్సయ్య. దొర ఎటు కదిలితే అటు తిరుగుతున్నాడు. కత్తి తగిలి దొరకు రక్తం వస్తుందేమోనని నర్సయ్య భయం. అట్లని తలను కదిలించొద్దని దొరకు చెప్పే ధైర్యం లేదతనికి.

నర్సయ్య గడ్డం గీకడం పూర్తి చేసేవరకూ దూరంగా నిల్చొనున్నాడు చిలుకయ్య. దొర తన దిక్కు చూడగానే

"దండాలు దొరా!" అన్నాడు.

"ఏంది చిలుకయ్యా! ఎందుకో వస్తివి?" చంక లేపుతూ అన్నాడు వెంగళరావు. నర్సయ్య తన పని కానిస్తున్నాడు.

"ఏం లేదు... కొంత మాట్లాడుదామని"

నర్సయ్య దొర కాళ్లసందున, కుర్చీకింద, పక్కన పడ్డ వెంట్రుకలను చేతితో దొబ్బి ఎడమచేతిలో పెట్టుకున్నాడు. లేచి నిల్చొని వాటిని పెంటబొందలో పారేసొచ్చాడు. పోబోయాడు.

"నర్సిగా గోల్లు తియ్యి" అనగానే కలప కింద పెట్టాడు. గోరుగాలు బయటకు తీసి

దొరకు గోళ్లు తీస్తున్నాడు నర్సయ్య.

"ఏం మాటో చెప్పు" చిలుకయ్యను చూస్తూ అన్నాడు దొర.

"ఎన్నో తవుసులు చేస్తే పుట్టిన కొడుకు నాకు సాంబయ్య. నాకున్నదే గా ఒక్క పోరడు"

"అవును... నిజమే... అయితే నేనేం జెయ్యాలె?"

"ఏం లేద్దొర... ఒక్క మాట మీ చెవులేసి పోదామని. నా కొడుకును బడికి తోలియ్యాలనుకుంటున్న"

ఆ మాటలు విన్న వెంగళరావు ముఖంలో రంగులు మారాయి. ముఖమదోలా మారింది. నర్సయ్య గోళ్లు తీయడం పూర్తిచేశాడు. కిందపడ్డ గోళ్లను చేతిలోకి తీసుకుంటున్నాడు. దొర లేచి "తానం చేసచ్చి మాట్లాడుత ఉండు" అని లోపలికి పోయాడు.

నర్సయ్య కలప చేతిలోపట్టుకొని పోబోతున్నాడు.

"ఎవ్వలింటికి పోతన్నవు నర్సయ్యా?" అడిగాడు చిలుకయ్య.

"వేముల పోచాలింటికి"

"ఆయనింట్ల పనయినంక మా ఇంటికిరా... బూరు బాగ పెరిగింది. కొరిగిచ్చుకోవాలె. మా సాంబయ్యగ్గూడ పెంటర బాగ పెరిగింది"

"ఇంటికచ్చి చేయించుకుంటేంబాయెనే?"

"చేయించుకుంటలేనా ఏంది? ఇక్కరాకచ్చినవు గద... ఆయింత నాలుగడుగులు రాలేవు. పోచాలిల్లు మా ఇంటికేమంత దూరముంది? దొర తానం జేసచ్చేదాక కూసుంట. నువ్వు పొయ్యిరాపో" అన్నాడు చిలుకయ్య.

"మా వత్తకని వేసంగిపంట బత్తెం ఇంకా ఇయ్యకనేపోతివిగాదె! ఆర్నెల్లకోపారి గా ఇత్తులు కొల్సుటానికేద్దిరి. ఇంటింటికి తిరిగి మేం సవురాలు చెయ్యన్నాయె"

"నేను కొంచెవోంగ నిన్నద్దన్ననా?. నువ్వు రాంది నేనేం జెయ్యాలె?"

"కల్లాలప్పుడు రెండుమాట్లు మా వచ్చిన. ఇంట్లెవ్వలు దొరుకులే. ఏడికి పోతయనూకున్న. రేపచ్చి కొంచవోత".

"రేపెందుకియ్యాల్లనే కొంచవో. ఎవ్వలద్దన్నరు? ఎవ్వలకిచ్చేటి యాల్లకిచ్చుడేనాయె. వాళ్లింట్ల గీకి జెప్పున్నా. పొద్దుపోతే నాగలి గట్టుడాల్చెమైతది"

"మా వస్త" అనుకుంటూ వెళ్లిపోయాడు నర్సయ్య.

లోపలికెళ్లిన దొరకోసం చూస్తున్నాడు చిలుకయ్య. మరికొద్దిసేపైన తర్వాత వచ్చాడు వెంగళరావు. అరుగంచుకు కూర్చున్న చిలుకయ్య లేచి వాకిట్లో నిల్చున్నాడు. దొర కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమో అంటివి చిలుకయ్యా?"

"నా కొడుకును బడికి తోలన్ననుకుంటన్న"

ఆ మాటలకు 'హిహిహి' అని నవ్వాడు వెంగళరావు.

"ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కుతనన్నదట. నీ కొడుకు చదివి రాజ్జేలేలుతడా చెప్పు?" అన్నాడు.

"ఏదో దొర... ఒక్కడే పోరడాయె. చదివిత్తేం బాయెననుకుంటన్న"

"ఏం బోతదో చదివిచ్చినంక తెలుత్తది. చదువుకున్న పోరడు నీ మాటింటడా? నీ ఇంట్లుంటడా? చదువుకున్న పోరగాండ్లను నమ్మొద్దెరికేనా?"

మరి మీ కొడుకుల నెందుకు చదివిస్తున్నారని అడిగే ధైర్యంలేదు చిలుకయ్యకు. నోట్లో వరకొచ్చిన మాటలను దిగమింగాడు.

"ఎంతైన చదువుకుంటె కొంచెమన్న తెలివికత్తరు గద దొర"

"మంట్లె తెలివికత్తరు తియ్యి. చేతికి రాకుంటైతరు. వాళ్లు గీ మురికి మురికి




ఇండ్లల్లుండరు. చదువచ్చి నౌకరయిందంటె చెంగో బిల్లంటరు. నిన్నెవ్వలు చూసుకుంట రు చెప్పు? అయినా ఇన్నొద్దుల వట్టి మన మంత చదువుకొనే బతికినమా?"

"నౌకరాయెదాక చదివిచ్చుడు నానుంచేడై తది దొర? ఏదో మనూల్లె ఉన్నదాక చదివిత్త. మనూల్లెకు బడచ్చినంక మాలేషు (చాలా) మంది చదువుతంద్రుగా దొరా?"

"మా చదువుతంద్రు తియ్యి. చాకలోడు, మంగలోడు అందరు చదువుతె దానికేం విలువుంటది? ఎవ్వలు చేసేపని వాళ్లు చేస్తేనే లోకం నడుత్తది. నువ్వు ఊల్లె ఉన్నదాకనే చదివిస్తననవడ్తివి. అట్లయితె రెంటికి చెడ్డ రేవడోలైతడు. ఇటు మోటుపని జెయ్యరాదు. అటు నౌకరిగాదు.

"మేం బడికి తోలినా పోరగాండ్లు పనిజె య్యందెల్లది మాకు. ఒక్క బడికే పొయ్యేత్త నంటె ఎట్ల నడుత్తది? పన్జేసుకుంటనే చదువు కుంటడు మా పోరడు''

"నిజమేకని ఎంతైనా చదువుకున్న పోర గాండ్లు నాగలి దున్ని పోగువొయ్యరు. మల్ల బడికి పోతండంటె టెర్రీకాట్ టెర్లిన్‌బట్టలు గావన్నంటరు. షోకుల వడ్తరు. గివ్వన్ని నీనుంచైతయా? నీకింత భూముండె... నీతోని పని నేర్పక ఈ ఆరాటాలన్నెందుకు?"

తానెన్ని విధాల చెప్పినా దొర తన కొడుకును చదివించకుండా చేయడానికే ప్ర యత్నించడం చిలుకయ్యకు నచ్చడంలేదు. అయినా దొరను ధైర్యంగా కాదనే దమ్ములే దు. అసలాతన్ని అడగడమే పొరపాటేమో ననుకున్నాడు. అడగకుంటే మరో విధంగా తీసుకుంటాడేమోనన్న భయం మరో దిక్కు.

"గా షోకులు, గా బట్టలు మాకేడ నడు త్తయి దొర? అగ్గోయో సగ్గోయో మాకెల్లినయి కొంటంగని టెర్లీన్లు మాకేమెరుక? కుండల గలదింత తిని బడికి వోతడు. నాతోని ఎవుసం గూడజేత్తడు. ఊళ్లెనేనాయెనని తోల్త నంటన్న''

"మొత్తంమీద చదివిత్తనంటవు! నీ కొడు కును చదివించకుంటె నాదేం బాయెగని నీ మంచి కోసమే చెప్పుతన్న. నీకు చేతినిండ పనిలేకుంటె నాకు పాలేరుంచు. మూడు గుంచాల మక్కలు జీతమిత్త పసిపోరడేం పనిజేత్తడని భయపడకు. ఎడ్లగాసుకొత్తె ఐపా యె. నువ్వా ఒంటినాగలెవుసంగానివి. ఎంత జేసినా గంతే. వాన్నా కొసెల్ల చదివియ్య లేవు. నడుమాపుతె ఎందుకు కొరగాకుంటైత డు: అందుకోసం నాకు గొడ్లకుంచు. మూడు గుంచాల మక్కలు నీకు వేన్నీళ్లకు చన్నీల్లోలె అక్కెరకత్తయి. నా మాటిను''

"మీరన్నది మంచిగనే ఉంది దొర. కా దంటలేను. వాడు నాకు ఒక్కడేనాయె. లాత బొక్కలు ముదురకనే పాయె. ఆని కోసమె ట్లనో కష్టపడుతం. చదువు కొసెల్లుతెల్లె లే కుంటె లేదు. రెక్కలు ముదిరెదాకనన్న చదివిత్త. గీ సంగతే మీ చెవులేసి పోదామన చ్చిన"

"నీ ఇష్టమున్నది చేసుకుంటనే చెవులేత్త నంటవేంది? నీ కొడుకు నీ ఇష్టం. చదివిచ్చు కో. కలెక్టర్ను జేసుకో. ప్రధాన మంత్రింజేసు కో. నాదేంబాయె? ససంత్ర మచ్చినంక మీకందరికి బలుపులత్తన్నయి''

"గట్ల కోపానికెందుకత్తరు దొర? విలువి ద్యలెన్ని నేర్చిన కుల విద్యకు సాటిరావని చెప్పుతె విన్న. అయినా కాలమెప్పటికొక్క తీరే ఉంటదా? గా బెస్త నర్సింహులు చదువు కోని నౌకరిజెయ్యవట్టె''

"వాళ్ల నాయిన్న వరంగల్‌బట్టల మిల్లుల పన్జేత్తండు. గందుకే చదివి చ్చిండు. నేంజెప్పేది చెప్పిన. నీకు చది వించన్ననుంటె చదివించుకో నేనెందుక ద్దంట? సరెగని నీ కొడుకు పురుడప్పుడు కొంచవోయిన నూర్రూపాయలింకా ఇయ్య కపోతివి? మిత్తి గలిపి జెప్పన తెచ్చియ్యి'' అని లేచి నిల్చున్నాడు వెంగళరావు.

"తెచ్చిత్త దొరా'' అని దొరకు నమ స్కారం చేసి బయటపడ్డాడు చిలుకయ్య.

చిలుకయ్య ఇల్లు చేరేసరికి మంగలి నర్సయ్య వాకిట్లో గొంగళిముద్దగా చేసి వేసుకొని దానిమీద కూర్చొనున్నాడు. ఆతని ముందో చెక్కపీట, పక్కనో నీళ్ల చెంబుంది.

"ఏందే.. గింతసేపైంది? దొరిడిసి పెట్ట లేదా?" అన్నాడు నర్సయ్య.

"చదువుకుంటెనట మనుషులు చెడిపో తరట. మా పోరన్ని పాలేరుంచితె మూడు గుంచాల మక్క లిత్తడట. భలేటోడున్నడు దొర! పెద్ద మనిషని పేరంటం బిలిత్తె గిద్దెడు పసుపు ముడ్డికి రాసుకున్నదట ఓ ముత్తయిదువ. గట్లుంది దొర సంగతి'' నర్సయ్య కెదురుగా పీటమీద కూర్చుంటూ అన్నాడు చిలుకయ్య.

"నీ కొడుకును నువ్వు చదివించుకుంటా నికి గా దొరనెందుకడుగుతే! మనం చదు వుకుంటె తెలివికత్తమని చదువుకోనియ్యరా ల్లు. ఇంక మనూల్లె కొంచెం నయం గా సర్పంచ్ కొండల్‌రెడ్డి చెయ్యవట్టి ఊళ్లెకు బడచ్చె. కొందరు దొరలు బడిగూడ రాని య్యరు. మనం తెలివికత్తె ఆల్ల సంగతెట్ల?" తన పనిచేస్తూ అన్నాడు నర్సయ్య.

"నిజమేరా నర్సయ్య! నాకు బుద్ధి తక్కో అయి అడిగిన. మరి మా సాంబ య్యకు సవురం చేసినవా లేదా?"

"ఎద్దెయ్యాని కోల్లాగోలురుకుతండు. పిల్చిన కొద్దురుక వుచ్చుకునుడేనాయె. ఏడదొరుకుతండే... నీకైనంక సేత్త' అని తలగొరగడం మొదలు పెట్టాడు నర్స య్య.

"సరెగని చిలుకన్నా నీ కొడుక్కు పుట్టెంటికలు తీసినావె? సవురం జేపిత్త ననవడ్తివి! మొన్న మొన్నటాక జడేత్తిరి గద!"

"ఐదేండ్లు దాటే మోపుకు తీసిన మొ క్కుకున్న అన్ని దేవుళ్లకాడ మొక్కులు ముట్టజెప్పిన. ఒక్క ఐలోని మల్లన్న కోసం జుట్టుంచిన. దేవునెంటికలవ్వి. కత్తిరిచ్చేవు మరి!"

"గా సంగతి నాకు తెలువదా ఏంది? మంచిగనే సేత్తగని పటేలేడ దొరికెటట్లున్న డు? ఎంతైన దొరలతోని తిప్పలేనే. ఎను కట తురుకోల్ల లెక్క కిందవడ్డా మీదవడ్డా బాంచోత్ అంటరు''

తల గొరగడం పూర్తి చేస్తూ అన్నాడు నర్సయ్య.

"మంచిగ గొరిగినవా గుండు?" అని తల పుణుక్కున్నాడు చిలుకయ్య.

"గడ్డం గూడ దియ్యి మీసాలు కత్తిరి య్యి'' అని అలాగే కూర్చున్నాడు.

"నేను సవురం జేసినంక వంకబెట్టెటో ల్లున్నారె చిలుకన్న? తొందరగ కానియ్యా లె. లింగరెడ్డి పటేలింట్ల కాళ్లగోల్లున్నయి. పందిరికి మామిడాకు తోరణాలు గట్టాలె'

"అందరికి చెప్పచ్చినవా మరి?"

"రాత్తిరి వరకు నేను కొంతమందికి, చాకలి బాలయ్య కొంత మందికి చె ప్పుతం. అది మా పనేనాయె'' అని పనిపూ ర్తిచేసి, "నువ్వు లేచి మీ కోల్లాగెను పట్టు కరా పో' అన్నాడు.

చిలుకయ్య లేచి, "సాంబన్నా... ఇక రాబిడ్డ ఇగరా..." అని పిలిచాడు.

"నేన్రాను పో... నేను సవురం జేసుకో ను'' దూరముండే అన్నాడు.

"బాగ కోడిగూడోలె పెరిగింది బూరు... పేండ్లు పడ్తయి. సవురం దీసుకుంటె నీకు అల్లమురబ్బా కొనిత్త'

"నాకదే మద్దు. బెల్లం గావాలె'

"బెల్లం బెడుత... నువ్వులు నూకలు గూడవెడుత రా'' సాంబయ్య పరుగెత్తుకొ చ్చి తండ్రి చంకలో చేరాడు.







ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**నవంబర్** 'చతుర నవల **'సాంబయ్య చదువు'** ..........

**సమీక్షకుని పేరు :** ..............................................

**చిరునామా :** ..............................................

..............................................

..............................................

..............................................

కొడుకును పీటమీద కూర్చోబెట్టి ఆత న్ని పట్టుకొని పక్కన కూర్చున్నాడు చిలుక య్య.

"పెంటర బాగ పెరిగిందే చిలుకన్న... నున్నగ కొరిగి పారెయ్యన్నా?" అన్నాడు నర్సయ్య.

"భలెటోనివున్నవు నర్సయ్య! బడికి పోయే పిల్లగానికి గుండు గీకుతవా? మంచిగ్గొట్టు పెంటర" అంది రాజమ్మ అక్కడికొచ్చి.

"అట్లనే సేత్త" అని సాంబయ్య తలను చేతిలోకి తీసుకున్నాడు. నీళ్లు పోసి టప టపా రాసాడు. గిలిగింతలు పెట్టినట్టయి అటూ ఇటూ కదుల్తున్నాడు సాంబయ్య.

కత్తెరతో టకటకా కత్తిరిస్తుంటే వెనుకకు ముందుకు తల తిప్పుతున్న సాంబయ్య తలపై ఒక్కటేసాడు నర్సయ్య.

"ఏందిర నర్సయ్య పోల్లగాన్ని కొట్టవ డ్తివి?"

"కదుల్తె తెగుతది... కదులకుంటుండు మను"

"కదులకు బిడ్డ" కొడుకుతో అన్నాడు చిలుకయ్య.

"నాకు చెక్కల గులయితంది" అన్నా డు సాంబయ్య.

కొద్దిసేపట్లో సాంబయ్య కటింగ్ పూర్తి చేశాడు. నర్సయ్య లేచి నిల్చున్నాడు. ఇంతలో లింగయ్యొచ్చాడక్కడికి.

"నర్సన్నా! సవురంజెయ్యక సానరోజు లాయె. ఎంటికలు బాగ పెరిగినయే! ఎప్పుడింటికచ్చినా దొరుకుత లేవు. కష్టమ నుకోక ఇయ్యాల్ల సవురంజెయ్యి" అన్నా డు లింగయ్య.

"నేనేడికి పోతన్నరా లింగయ్య. రేపురా సేత్త ఇయ్యాల్ల బాగ పనుంది"

"గట్లనకె నర్సన్న నేనూరికి పోవాలె. ఎంతట్లసేత్తవు" బతిమిలాడినట్టన్నాడు లింగయ్య.

"చెయ్యలేవుర నర్సయ్య... జబ్బిరిజి బ్బిరి పెరిగినట్టుంది" అన్నాడు చిలుక య్య.

"ఏం జేసుడే చిలుకన్న... అందరికి సే సినట్టు కాదుగద... ఈల్లకు సమరం జేయ న్నంటె ధో తిడిసి గొంగడి కట్టుకోవన్నాయె... ఇదో భాగోతమిగ"

"ఇప్పుడు గూడ గవన్నేంది? టేలాలల్ల ఏకులమని సూత్తండ్రా?"

"కస్బ్బారు సంగతులు గీ పల్లెలల్ల నదు వయి... పోచాలు హొటల్ల ఈల్లకు గిలాస లు వేరేపెడుతరు"

అని అంగీ విడిచేసాడు నర్సయ్య. గొంగ డి కట్టుకొని ధోతీ కూడా విడిచేసాడు. అక్క న్నుంచి పీట తీశాడు. బజాట్లో కూచోబెట్టి లింగయ్యకు క్షవరం చేస్తున్నాడు నర్సయ్య.

హరిజనులకు క్షవరం చేసేప్పుడు గొంగళి కట్టుకొని చేయడం చాలా కాలంగా ఉంది. ఉన్నికి ముట్టుడుండదని, నూలువైతే మైలప డతాయని వాళ్ళ నమ్మకం.

"లింగయ్యా! గాంధీ మహాత్ముడు చెప్పి నా ఇంకా అంటుముట్టు పోకనేపాయె" అన్నా డు అక్కడే నిల్చొని చిలుకయ్య.

"ఏమో! నాకు గవ్వన్నేమెరక" అన్నా డు లింగయ్య.

"గవ్విగిప్పుడే ఏడపోతయి. మొన్ననే ససంత్రమచ్చె"

"మొన్నంటవేంది నర్సయ్య? పదేండ్లు దాటె" అన్నాడు చిలుకయ్య.

"ఓటెనుకోటి మెల్లెమెల్లగ పోతయి"

"ఏమోర నర్సయ్య! ఇదంత సూత్తంటె వడ్లు పెరుగు కలిపినట్టనిపిత్తంది... ఏం ససంత్రమో ఏమో" అన్నాడు చిలుకయ్య.

"గా పెద్దపెద్ద సంగతులు మనకెందుకే

చిలుకన్న'' తన పని ముగించుకొని వెళ్ళిపో యాడు నర్సయ్య.



"బాపూ! ఓ బాపూ! రేపట్నుంచి నేను బడికిపోనే పోను'' చెక్కపలక, గుట్ట బలపం అరుగుమీద పడేస్తూ బుంగమూతిపెట్టి అన్నాడు సాంబయ్య.

పొలంలోకి ఎరువు బారగొట్టొచ్చి కనాల వొత్తెలు, పగ్గం చేతిలో పట్టుకొనున్న చిలుక య్య వాట్ని అరుగుమీదికి విసిరేసాడు. కొడు కును దగ్గరకు తీసుకున్నాడు.

"ఎందుకు బిడ్డా! బడికెందుకుపోవు? ఏమైంది?"

"నేను పోనేపోను పో... అస్సలుకే పోను''

"ఏమైందో చెప్పలేవు?" బుదరకిస్తూ అడి గాడు.

"మా సారు గొట్టిండు''

"సార్లు గొట్టకుంటె ఎవ్వలు గొడుతరు మరి? మంచిగ రాయకుంటె కొట్టకుంటేం జేత్తరు?"

ఒక్క క్షణం ఆలోచించాడు సాంబయ్య.

"రాయనందుకు గాదు సారు 'గొట్టింది'' అన్నాడు.

"మరెందుకు గొట్టిండు?"

"దొరల కొడుకులనేమొ ముంగట కూసుండ వెడుతంద్రు... మమ్ముల నేమొ ఎనుక కూసుండవెడుతంద్రు. ఆల్లకే చదువు మంచిగ చెప్పుతంద్రు''

పసివాడలా మాట్లాడటం చిలుకయ్య కా శ్చర్యమనిపించింది. నవ్వు కూడా వచ్చింది.

"నేం జెప్పుతె నవ్వుతన్నవేంది?"

"సార్లెవ్వలకైన మంచిగనే చెప్పుతరు''

"కాదు బాపూ? నేనవద్దమాత్త లేను. హాజి రప్పుడాల్ల పేర్లే ముందుగాల పిలుత్తరు''

"సరెగని ఇంకేమన్నడు సారు?"

"రాజయ్య పక్కన నేను కూసుంటె కొట్టి, గద్దరిచ్చి దూరం కూసుండవెట్టిండు''

"ఆల్లు మాదిగోల్లాయె... గా పోరని పక్క నెందుకు కూసున్నవు మరి...? గాడే దొరి కిండా?"

"మాదిగోల్లంటేంది బాపు...?"

"మాదిగోల్లంటే చెప్పులు గుడుతరు... చీపుర్లు తయారుజేత్తరు. డప్పు గొడుతరు. ఆల్లకు ముట్టుడుంటది''

"ముట్టుడంటేంది బాపు? అవ్వ తాపకో సారి ముట్టుకోకంటది. ఎందుకంటె ఓరకు న్ననంటది. తానంజేసి ఇంట్లకచ్చినంక ము ట్టుడు లేదంటది. మరాల్లు తానంజెయ్యరా?"

కొడుకెక్కెలా చెప్పాలో అర్థంకాక జుట్టు పీక్కుంటున్నాడు చిలుకయ్య.

"అవ్వ సంగతి వేరు... వాళ్ళదసోంటిది గాదు. మాదిగి మన్నెపోల్లు అంటరానివాళ్ళు వాళ్ళను ముట్టుకోవద్దు''

"అంటే వాళ్ళెప్పుడు తానంజెయ్యరా?"

"నీకు గివ్వి ఇప్పుడే తెలువయిగని ము ట్టుకోవద్దనే సారు చెప్పిండు? కొత్తగచ్చిన వెంకటయ్య సారా?"

"వెంకటయ్య సారు మంచోడు. మనుషు లందరొక్కటేనని చెప్పుతడు. బుదురకిచ్చి చదువు మంచిగ చెప్పుతడు. గా రాజిరెడ్డి సారే మంచోడుగాదు. బాగ కొడుతడు. రాజ

య్యను ముట్టుకోవద్దని కొట్టిండయినే"

"మరి ముట్టుకోకుంటయిపోతది గద"

"రాజయ్య మంచోడు. నేనయితోనే ఆడు కుంట"

కొడుక్కేం చెప్పాలో అర్థంకాక మాట మార్చాడు చిలుకయ్య.

"సరెగని ఇయ్యాల్ల ఏం రాసినవు?" అన్నాడు.

చెప్పడానికి సిగ్గుపడుతున్నాడు సాంబ య్య.

"బాపూ! బాపూ!"

"ఏంది బిడ్డ?"

"నాకు ఉ... ఊలు ఎంత దిద్దినా వత్త లేవు. మూడు రోజుల్నుంచి దిద్దుతన్న... వత్తలేవు"

"మంచిగ రాత్తె అవ్వే వత్తయి"

"గవ్వొక్కటే ఎందుకో వత్తలేవు... సారు పలుకతోని మూతిమీద గుద్దిండు"

నలిగిపోయిన లేత పెదవిని చూపించాడు సాంబయ్య.

కొడుకు పెదవిని చూసిన చిలుకయ్యకు బాధా, కోపం వచ్చాయి.

"మంచోడే ఉన్నడు సారు. పొల్లగండ్లను గిట్లనే కొడుతరా? చదువు పేసునా గొడుదు... రాకుంటె రాకపాయె తియ్యి" అని కొడుకు ను మరింత దగ్గరకు తీసుకున్నాడు చిలుక య్య.

చాలా సేపట్నుంచి సాయమాన్లో పొయ్యంటుబెట్టడానికి సతమతమవుతోంది రాజమ్మ. గొట్టంతో ఊది ఊది ఆమె బుగ్గలు లు నొప్పి పెడుతున్నాయి. పొయ్యంటుబెట్టి పొగవల్ల కళ్ళవెంట కారుతున్న నీళ్ళను తుడుచుకుంటూ బయటకొచ్చిన రాజమ్మ కొడుకుంజూసి,

"ఏంది కొడుకా? ఎవ్వలు కొట్టిండ్రు నిన్ను? మీ బాపేమొ కోపానికత్తండు? అయి నెనుంచేమైతది గని మీ నాయనవ్వకు చె ప్పు. నిన్ను కొట్టినోన్ని దులిపత్తది" అంది నవ్వుతూ.

"సారట సారు... అక్షురాలస్తలేవని పలుక తోని మూతిమీద పొడిసిండు. పెదవొరుసుక పెయింది" అన్నాడు చిలుకయ్య.

"అయ్యో బిడ్డ! సారింట్ల పీనుగెల్ల... కొడితెగొట్టెకని ఎనుకముందు చూడద్దా? అత్తనడిగి రమ్మని చెప్పనా?" అంది రాజ మ్మ కొడుకును దగ్గరకు తీసుకుంటూ.

కొంరమ్మ నోరున్న మనిషి... మనుమ డంటే ప్రాణం. సాంబయ్యమీద ఈగవాలనీ యదు. సారు దగ్గరి కామెను పంపిస్తే విపరీతంగా తిట్టి మన్నుపోసొస్తుంది. ఉపా ధ్యాయుడు కొట్టినంత మాత్రాన అలా చే యడం మంచిది కాదనుకున్నాడు చిలుక య్య.

"పోనియ్ తియ్. అవ్వతోని చెప్పకు మరి! భయముండన్నని కొట్టిండేమో? మన మన్నిట్నీ పట్టిచ్చుకోవద్దు"

"సరెతియ్" చిలుకయ్యతో అని.

"రా బిడ్డ రా... నీల్లు కాగినట్టున్నయి... తలకు వోత్త... నెత్తినిండ మురికుంది. పొద్దు గాల తలకు వోత్తనంటె బడి యాల్లయి తందని ఉరుకుతివి. పనేమొ తీరిసావకపా యె" అని కొడుకును బావిదగ్గరికి తీసుకెళ్ళి ంది రాజమ్మ. బట్టలిప్పి బండమీద కూర్చో మంది. పొయ్యిమీది నీళ్ళకుండ తెచ్చక్కడ పెట్టింది. నీళ్ళను ముట్టి చూసింది. ఉడుకేం లేవు.

అప్పుడే వచ్చి నిల్చున్న గంగయ్య

"బడికి తోలుతన్నవెమో? నీ కొడుకు చాలు'గాడైతండు పటు. అయితె మానాయె గని కొడుక్కు అక్షరాభ్యాసం చేయించినవా? లేదా...?"

"మనమేమన్న కోమట్లం, బామండ్లమా అన్నిటికి పూజలు సేయించటానికి. ఎద్దుము డ్డి పొడుసుకుంట బతికెటోల్లం... మంచి



దినం జూసి బడికి తోలిచ్చిన... పురాగ వట్టిగెందుకని ఓ కొబ్బరికాయ గొట్టిన"

"గంతే పటు... పైసలు పెరుగుతె నీటుకాలు పెరుగుతయ్''

"అవుమరి. రథాలు, పూజలు గివ్వన్ని మనకేడ కలుత్తయి? అవ్వన్ని తీరిపారున్నొల్లకే. ఐతెమానాయె గని ఎందుకో వత్తివి?" అన్నాడు చిలుకయ్య కూతుర్ను బయటకొచ్చిన తల్లి చేతికిస్తూ.

"నేనత్తె బరువైతందా ఏంది?"

"నాకేం బరువు? నేం దేనికి భయపడ"

"గీ సంగతి నీకెరుకేనా? రాజారావు దొర పాలేరును ఆవు పొడ్సింది''

"ఈనినావా ఏంది?"

"ఈనిందే... ఈనినావుకు కోపమెక్కువ. ఈనిందైనా కాకున్నా పశువున్ను సాధనద్దు. కొమటయినెను పేదనద్దు అనెటోరు పెద్దలు''

"నిజమే... బుచ్చయ్య షావుకారి కట్టుబట్టల్తోని మనూరచ్చిండా? వచ్చి ఉప్పు మిరపకాయ దుకాణం బెట్టిండు. కల్లు మండువాల దగ్గెరికి పొయ్యి బజ్జీలమ్మిడు వెట్టిండు. ఈ పది పన్నెండేండ్లల్ల చిన్నగ ఇల్లు గట్టె. కొంత భూమిగొనె. కొన్ని పైసలు వడ్డీలకు నడుపవట్టె''

"షావుకార్లు చాలుగాల్లుంటరు. అడివికి అందుగుచెట్టు మెత్తన ఊరికి కొమటయినె మెత్తన' అనున్నా వీళ్లు దొరలను, ఊరి పెద్దోల్లను చేతులవెట్టుకొని అయ్య అయ్య అనుకుంటనే ముంచుతరు. వడ్డీలకు వడ్డీలు గట్టి మస్తు సంపాయిత్తరు''

"దుర్గయ్యను చూసత్తామా మరి?"

ఇద్దరూ కలిసి రాజారావింటికెళ్లారు. వాకిల్నిండా జనమున్నారు.

"గాడ్దికొడుకు ఎర్ర రుమాలు చుట్టుకోని ఈనినావు దగ్గరికి పోతె అది కుమ్మకుంటేం జేత్తది?"

దుర్గయ్యపై సానుభూతి చూపకపోగా తిడ్తున్నాడు రాజారావు. దుర్గయ్య కడుపులో గాయంతో నేలమీద పడి మొత్తుకుంటున్నాడు.

"దావఖానకు ఏసుకపొమ్మంటారా దొర?" ఒకరడిగారు.

"గీ దీనికి దావఖానకెందుకు? అయినా దావఖానేడుందని తీసుకపోవుడు? గట్టయ్యను పిలిచి నేను చెప్పిన్నని చెట్లమందు పొయ్యిమనుండ్రి'' అన్నాడు రాజారావు.

నలుగురు మనుషులు దుర్గయ్యనెత్తుకొని అతనింటికి తీసుకుపోయారు.

దుర్గయ్యను చూసిన చిలుకయ్యకదోలా ఉంది. అతడు బతకడం కష్టమేననుకుంటూ ఇంటికెళ్లాడు.

ఆ రాత్రే దుర్గయ్య చనిపోయాడు.

తెల్లవారి అంత్యక్రియలయ్యాయి.

అయినా నోరెత్తి మాట్లాడినవాళ్లెవరూ లేరు.



సాంబయ్యిప్పుడు ఐదవ తరగతిలో ఉన్నాడు. తన ఈడువాళ్లు ముఖ్యంగా తన వాడవాళ్లు సాంబయ్యకు స్నేహితులయ్యారు. వాళ్లు కలిసి హోం వర్కవీ చేసుకుంటున్నారు. పిక్కలాట, కబడ్డీ, బొంగరాలు, ఖోఖో, చిర్రగోనాటలు కలిసి ఆడుకుంటున్నారు. వీలైనప్పుడు కలిసి చదువుకుంటున్నారు.

మాఘమాసం... ఎముకలు కొరికే చలి. అయినా బావినీళ్లతోటే స్నానం చేశాడు సాంబయ్య. వాళ్లింట్లో వారానికోసారో, పండుగలపుడో క్షవరం చేయించుకున్నప్పుడో వేన్నీళ్లతో తలస్నానం చేస్తారు. మిగతా రోజుల్లో అందరూ చన్నీళ్ల స్నానమే చేస్తారు.

బట్టలేసుకొని ఉడుకుడుకు గడుకన్నం చింతకాయ పచ్చడితో తిన్నాడు సాంబయ్య. చివర్లో పెరుగు కలుపుకొని భోజనం ము

గించాడు. పుస్తకాలు, నోటుబుక్కులు చంకలో పెట్టుకొని బడికి పోతున్నాడు. బడి ఊరు వెలుపలుంది. ఊరుబయట బర్ల మంద అడ్డమొచ్చింది. 'హై... హై... ఎను పకులం కదులది...' అంటూ వాట్ని కట్టెతో కొడుతున్నాడు బర్ల హనుమయ్య. అయినా అవి పెండ్లిమేళంలా నెమ్మదిగా నడుస్తు న్నాయి.

"మొండితోక బర్రె పెట్టే పెండ నాది..."
"పెద్ద కొమ్ముల బర్రె పెండ నాది"

అంటూ వాటి పెండకోసం తట్టలు పట్టు కొని తిరుగుతున్నారు పిల్లలు. ఆ మందను దాటి పోవడానికి కష్టమవుతోంది సాంబ య్యకు. సాంబయ్యకెంతోకాలంగా పశువు లు కాసే పిల్లల్లా బర్రెమీదనో, ఎద్దుమీదనో, గుర్రంపైనో కూచున్నట్టు కూచొని సవారు చేయాలనుంది. అదో పెద్ద కోర్కె కాకున్నా తీరడంలేదు. తండ్రితో చెబితే 'చదువుకునే

పిల్లలకు గివ్వేం బుద్ధులు?' అని తిట్టాడు. ఈ బర్లన్నీ బడిదాటిపోతాయి. బడిదాకా ఆ పని చేస్తే... అనుకున్నాడు సాంబయ్య.

బర్ల హనుమయ్య దగ్గరికి పోయి "నన్నో బర్రెమీదెక్కియ్యవా?" అన్నాడు.

హనుమయ్య వద్దంటున్నా వినడంలేదు సాంబయ్య.

పిప్పరమెంట్లకని తల్లిచ్చిన పది పైసలు హనుమయ్యకిచ్చాడు. హనుమయ్య అతన్ని ఎత్తుకొని బర్రెమీద కూచోబెట్టాడు.

"పైలం మరి... కిందవడేవు" అని ఆ బర్రె పక్కనుంచే నడుస్తున్నాడు హనుమయ్య.

సాంబయ్యకెంతో గొప్ప పని చేస్తున్న అనుభూతి కల్గుతోంది. బడి దగ్గరిదాకా వెళ్లిం తర్వాత అతన్ని దింపేశాడు హనుమయ్య.

సాంబయ్య లోపలికి చేరుకునేసరికి ప్రార్థనయి ఎవరి గదుల్లోకి వాళ్ళెళ్ళారు. తన తరగతి గదిలోకెళ్లిన సాంబయ్య గదిలో జరుగుతున్న దృశ్యాన్ని చూసి స్థాణువై నిల్చున్నాడు.

రామయ్య మీదపడి పిల్లలంతా కొడుతున్నారు. అతన్నెందుకు కొడ్తున్నారో సాంబయ్యకర్థం కావడంలేదు. అక్కడే నిల్చొని వెంగళరావు చిన్న కొడుకు భీంరావ్ "కొట్టుండ్రి... కొట్టుండ్రి..." అంటున్నాడు.

రామయ్య ఆ ఊరి పక్కనున్న చిన్న పల్లెనుంచి వస్తాడు రోజూ. అతన్నందరూ ఎడ్డిమొహమంటారు. రామయ్య మొత్తుకుంటున్నా పిల్లలంతా కొడ్తూనే వున్నారు. అందరూ కొడ్తున్నప్పుడు తానెందుకు కొట్టకూడదని సాంబయ్య కూడా రెండు దెబ్బలేశాడు. అతన్నింకెంతసేపు కొట్టేవారో కాని ఇంతలో లెక్కల సారు ఆ గదిలోకొచ్చాడు. పిల్లలంతా ఎవరి స్థానంలో వాళ్లు కూర్చున్నారు.

రామయ్య వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"ఏం జరిగింది రామయ్యా?" దగ్గరికెళ్లి అడిగాడు రామచంద్రం సారు.

"వీళ్లంతా వర్తిగనే కొడుతండ్రు నన్ను" ఏడుస్తూ అన్నాడు రామయ్య.

"నువ్వూర్కో". అని రామయ్యను ఊర్కోబెట్టాడు సారు.

"ఎవర్రా వీన్ని కొట్టింది?" గట్టిగా అన్నాడు.

ఎవరూ చప్పుడు చేయలేదు.

"రామయ్యా! నిన్ను కొట్టిందెవరు?"

"అందరూ కొట్టిండ్రు సార్. నన్ను గొట్టిండ్రని మా అవ్వకు తెలుస్తె అవ్వ గూడ కొడ్తది సార్?"

ఒక్కొక్కర్ని నిలబెట్టి అడిగాడు రామచంద్రం.

సాంబయ్య, ఇంకొంతమంది, "అందరూ కొడ్తుండ్రని మేం గొట్టినం సార్' అన్నారు.

ముగ్గురు పిల్లలు మాత్రం "భీంరావ్ కొట్టుమంటె కొట్టినం సార్. మాకేం తెలువది" అన్నారు.

భీంరావ్‌దిక్కు కోపంగా చూశాడు రామచంద్రం.

"ఎందుగ్గొట్టినవు?" గద్దించినట్టన్నాడు.

"గాసాలోనికి నాకంటెక్కో మార్కులత్తేమన్నట్టు? గందుకే కొట్టిన. ఆంది మనూరన్నగాకపాయె"

ఆ మాటలు విని అంతా ఆశ్చర్యపోయారు.

రామచంద్రంసారుది అదే వూరు. కొంత వ్యవసాయముంది. ప్రయత్నించి అక్కడికి బదిలీ చేయించుకొన్నాడు. భీంరావునేమన్నా అంటే తండ్రితో ఏం చాడీలు చెబుతాడోనని భయమాతనికి. తనను ట్రాన్స్ఫర్ చేయించినా చేయిస్తాడు. భీంరావుమీద కోపంగా ఉన్నా అతన్నేం చేయలేక "భీంరావ్ కొట్టుమంటె కొడతార్రా?" అని మిగతా పిల్లలందర్నీ చావబాదాడు రామచంద్రం.





బర్రెమీద ప్రయాణం చేశానన్న ఆనందం ఆ దెబ్బలతో మరుగున పడిపోయింది సాంబయ్యకు. మధ్యాహ్నం ముభావంగానే ఉండి భోజనం చేసి బడికెళ్లాడు. సాయంత్రం బడినుంచి ఇంటికెళ్లేసరికి వాకిట్లో మంచంలో పడుకొనున్న మనుమరాలు పక్కన కూర్చొనుంది కొంరమ్మ. మనుమన్ని చూసి "మా అమీన్‌సాబత్తండు. మా తాసీల్దారత్తండు... ఎందుకు బిడ్డ గింత ఆల్చెమైంది... ఇటా'' అంది.

నానమ్మ దగ్గరికెళ్తే తాను దెబ్బలు తిన్న విషయం తెలుస్తుందని సాంబయ్యకు భయం. రామచంద్రంసారంటే అతనికెంతో ఇష్టం. అలాంటి సారు అలా కొట్టడం వెనుకే ముందో ఆ పసివానికర్థం కావడంలేదు. ఏదేమైనా నానమ్మకు తెలిస్తే సారును తిడుతుందని దగ్గరకు పోవడంలేదు.

"నేను రాసుకోవాలె. నేను రాను'' అన్నాడు సాంబయ్య.

"అయ్యో పిలగాడు... చదువు బాగానే చదువుతండు గద! ఆగనన్నాగడే గూనిపోసి మొగడని పిలిచిన కొద్దురుకవడ్తివి!" అంది.

"పో ముసల్దాన నేను రానుపో'

"ఇట్రాలేవు పిలగా! అరిగిపోతవా? కరిగిపోతవా? నీకొక్క మంచి శాత్రం జెప్పుతరా''

అయినా దగ్గరికెళ్లడంలేదు సాంబయ్య.

"అయ్యో పిలగ. చదువుకుంటన్ననని ఆగుతలెవ్వా... మొన్న నిన్ను అవుసులోల్ల బాపుగాడు గొడితె ఆనిమీద మన్నువోసి రాలేదా? ఆడిగ నీ జోలిక రాడు. నా దగ్గరికి రాకుంటె బాపుగానితోని నిన్ను కొట్టుమని చెప్పుత"

అప్పుడే పనినుంచచ్చిన రాజమ్మ కాళ్లు చేతులు కడుక్కొనచ్చి "గిప్పుడేం పంటన్నవే?" అని కూతుర్ని తీసుకొని ఇంట్లోకి పోతూ "నాయిన్నవ్వ పిల్చినప్పుడు పోవాలె! నెలరోజులకింద గోరంటల భూమయ్య నీ గోలీలు గుంజుకుంటె నాయిన్నవ్వకు చెప్పు తనన్న మోలె ఒక్క దెబ్బకే ఇయ్యలే. నాయిన్నవ్వ దగ్గరికి పో'' అంది.

సాంబయ్య అరుగుమీదినుంచెళ్లి కొంరమ్మ పక్కన కూర్చున్నాడు. మనుమని శరీరమంతా పుణికి చూసింది కొంరమ్మ. చేతులు కమిలిపోయుండటం చూసి మనుమన్నడిగింది. జరిగింది చెప్పాడు సాంబయ్య.

"వీనింట్ల పీనుగెల్ల! సారట సారు... వీని చేతులకు జెర్థలు వుట్ట.. నరుప్పలు వుర్థ. దొరకొడుకును కొట్టుడు సాతగాక పోరగాండ్లందర్ని కొడుతడా?" అని నోటికొచ్చినట్టు తిడుతోంది.

"నాయినవ్వా! ఆ సారు మంచోడోనే. సార్నేమనకు'' అన్నాడు.

"ఎవ్వల నాశినంల వాడే పోతడు తియ్యి'' అంది.

దొరకొడుకు కాక ఇంకెవరైనా ఇంటికెళ్లి దుమ్మెత్తిపోసి బూతులు తిట్టి వచ్చేది కొంరమ్మ. మనుమన్ని దగ్గరకు తీసుకుంది.

"దొరల కాలం నడుత్తంది బిడ్డా! మన సొంటోల్లు ఆల్లకెదురుంగ మాట్లాడి బతుకుతరా?" అని "సరెగాని సాంబయ్య సూరు నీడలు పందిరి గుంజలు దాటి గజం దూరం బోయెవరకు రోజు బడినుంచచ్చెటోనివి. ఇయ్యాల్ల గింత సేపైందేంది?" అంది.

రాజమ్మ వేయించిన పేలాలు తెచ్చి సాంబయ్య చేతుల్లో పోసింది. వాట్ని జేబులో పోసుకొని తింటున్నాడు.

"గదానె నాయిన్నవ్వ! గడీలకు పెద్దపెల్లి దేశ్‌ముఖ్ దొరదట. కారచ్చింది... మేమంత కారుంజూసుకుంటున్నం. మేం దాన్ని ముట్టుకోనువోతె డ్రైవర్ కొట్టకొట్ట రావట్టె. నేను కారును రొండుసార్లు ముట్టుకున్న. ముట్టితె జారిపోతందది''

"కారంటె గా నాలుగు గీరెలదే గడ

"నువ్వు బస్సెక్కినావె నాయిన ?.



బస్సుకంటె చిన్నగుంటదిది''

"నేను రొండుమూడు సార్లు బస్సు మా ఎక్కిన. మా కాలంల గీ బస్సులేడియి? కొంరెల్లికి గూడ నడ్సేపోదుం. ఎన్నామడ నడ్సినా ఏమనిపియ్యకపోవు''

"మనూరికింకా బస్సే పడకపాయె. రోడ్డే త్తరట. దొరల చేండ్లల్లనుంచి పోకుంట చూసు కుంటండ్రట. బస్సెక్కుతె నాకు మంచిగని పిస్తది. బాపుతోని కరీంనగర్ పోయిన నేను''

"నీకు ఎడ్లబండెక్కుతెనే కక్కత్తది. ఇంక బస్సు పడ్తదా? నిరుడు బండి గట్టుకొని యాలాల తీర్థంబోతె నువ్వు తొవ్వొంటి కక్కుడు, ఎర్గడేనాయె. ఎందుకు తీసుకొచ్చి నమని బాదపడ్డం. నువ్వేమొ ఇంట్లుండక పోతివి''

"నాయిన్నవ్వ నేనిగ రాసుకుంటనే''

"ఊకె రాతేనా బిడ్డ? నీకు చదువుమీద బాగారాటం! బాగ సదువుతె పిసోల్లయిత రట"

"ఏం గారు తియ్యి. నీకేమెరుక' అని లేవబోయాడు.

"కూసో బిడ్డ' అని దగ్గర కూచోబెట్టు కుంది.

ఈ రోజెందుకో మనుమనితో ఆత్మీ యంగా మాట్లాడాలని, ఎన్నో విషయాలు చెప్పాలనిపిస్తోంది కొంరమ్మకు.

"మాది ఎడ్డికాలం బిడ్డ! మీరన్న తెలివికి రావాలె. నాకెనిమిదేండ్లకే లగ్గమైంది. ఎత్తుకె త్తు భీమునోలుండె మీ తాతంజూత్తె నాకు గజ్జుమనేది. అయినె వాకిట్ల అడుగుబె ట్టిండంటె నేనురుకబుచ్చుకునేదాన్ని. ఎదు రుంగ నిల్సోవన్నంటె చెమటలచ్చేటియి. అయినె సెయ్యిమీద వడితే గజగజ వణికేదా న్ని'' చెబుతోంది కొంరమ్మ.

"ఏపో... గివ్వన్ని అవద్దాలు. తాత నీకే భయపడెనట... నువ్వు నోరు తెరిత్తే ఉరికెటో డట" అన్నాడు సాంబయ్య.

"మొదట్ల మీ తాతకు భయపడేది నిజ మే... అటెనుక అయిననే వణికిచ్చుడు మొదలుపెట్టింది. జుట్టు చేతిల వట్టుకోని ఆడిచ్చింది'' బయటకొస్తూ అంది రాజమ్మ.

"ఓ పిల్ల నువ్వు సూడచ్చినావు! గప్పుడు నువ్వేడున్నవని సెప్పుతన్నవు?" కోడల్ను దెప్పుతూ అంది కొంరమ్మ.

"ఎక్కడుంటేంది? నాకు తెలవదా ఏంది?"

"నువ్వు నా కొడుకును సేతులవట్టుకోలే దా మరి?"

"ఎవ్వల మొగలనాల్లు సేతుల పెట్టు కుంటరు'' అంటూ లోపలికెళ్ళింది రాజమ్మ.

"గిప్పుడు మీరు కారుం జూసుటాని కురు కుతండ్రుగని మాకాలంలనైతె లైటుంజూసినా ఎక్కనే... గా వెంకటేశ్వర్రావు పంతులు మా కైతుకాలోడు... ఓసారి లైటు దెచ్చి గడ్డం ,లసుమయ్యను పరేశాన్ జేసిండు... చీకట్ల లైటుంజూసి దయ్యమనుకోని వణికిసచ్చాడు లసుమయ్య''

"కచ్చేరు మీనగూసుండి అందరితోని పరాశికాలాడుతడు... కాలులేవట్టి బుర్రు మంటడు... ఆడోల్లు అయినెంజూత్తె దూ రంనుంచి పోతరు..., లైటుతోనేంజేసిండా పంతులు?"

"లైటు గొనుక్కోని నడిసత్తండు పంతు లు... ఊరి పొలుమార్ల కచ్చేవరకు చీక టైంది. ఒగల మొకమొగలకు కనవడ కుంటైంది. అయినెక్కొంచెం ముంగట లసు మయ్య నడుత్తండు... అయినెంజూసి లైటొ త్తిండు పంతులు. లసుమయ్య కొరివిదయ్య మనుకోని ఉరుకుడు వెట్టిండు... మల్లో సారే సిండు... ఇంకా ఉరుకుడు పెట్టిండు... లైటే సిన కొద్దీ దయ్యమెంబడి పడ్డదని పడు కుంట లేసుకుంట ఊళ్ళెదాక ఉరికచ్చిండు లసుమయ్య. అయినె కాళ్ళన్ని కొట్టుకపెయి నయి''




"అటెనుకేమైంది?"

"తెల్లారి పంతులు లసుమయ్యను పిలిచి కాళ్ళు కొట్టుకపోయినయేందని తెలువనట్టడి గిండు... ఏం జెప్పాలె పంతులు బోర్లల్ల మస్తు దయ్యాలున్నయి... నిన్న రాతిరి నా ఎంబడి పడి తరుముకచ్చింది దయ్యం. తప్పిచ్చుకచ్చిన.... నా పొల్లగాండ్ల నసీబు మంచిగుండి గండం తప్పింది'' అన్నాడు లసుమయ్య.

"అట్లనా?" అని "ఓసారి పొద్దుగూకినంక కనవడు'' అన్నాడు పంతులు.

పొద్దుగూకి లసుమయ్యచ్చినంక లైటేసుకుంట, బందు జేసుకుంట సూపెట్టిండు పంతులు. గిదేగా దయ్యమని నవ్విండు.

'భలేకైత్కాలోనివి పంతులా'అని లచ్చుమయ్య వెళ్ళిపోయిండు... కొంరమ్మ చెప్పిన లైటు కథ విని నవ్వాడు సాంబయ్య.

"అయ్యో! గా లైట్లు తెలువయానె నాయిన్నవ్వ... బజార్లల్ల దీపాలు వెట్టింద్రుగద! అమాసప్పుడు ఇమామ్‌సాబ్ నూనె వోత్తడండ్ల''

నాగలిడిసి ఎడ్లను కొట్టంలో కట్టేసి చిలుకయ్య ఇంటికొచ్చాడు. పగ్గం, ముల్లుగర్ర దొత్తెలు అరుగుమీదికి విసిరేసాడు.

కూతురొచ్చి చిలుకయ్య నలుముకుంది.

"మనునునికేం జెప్పుతన్నవే అవ్వ?" అంటూ మంచంలో కూర్చున్నాడు చిలుకయ్య.

"గా పట్వారి పంతులు కైత్కాల పనుల గురించి'' అంది కొంరమ్మ.

"పంతులే ఊళ్లెకు మొట్టమొదాలు గడియారం పట్టుకచ్చిండు... అంతవరకు ఊరోల్లు గడియారం జూల్లే... గదాన్ని చూసుటానికి పంతులింటికి తీర్థమోలె పెయింద్రు జనాలు''

తండ్రి చెప్పేది ఆసక్తిగా వింటున్నాడు సాంబయ్య...

"బాపు... బాపు... నాకొక్క సైకిల్ కొనియ్యవా? మా సోపతికానికుంది'' అన్నాడు.

"సైకిలంటేందనుకున్నవు... మనూల్లె అంతగొడితె నాలుగైదున్నయో లేవో? సైకిల్ కంపినుండనే ఉండె... నేర్చుకో బుద్ధయితే నేర్చుకోలేవు'' అన్నాడు చిలుకయ్య.

"గా కిష్టరెడ్డి సైకిల్‌ను మస్తు నడిపిత్తడు... విమానమోలె'

"అవ్వన్ని నడుమంత్రపేషాలు'' అని "గా పంతులే పెద్దపెల్లిన సైకిల్ జూసచ్చి దాన్ని గురించొగ సెప్పుడా?" అన్నాడు చిలుకయ్య.

"ఇగో... దానికి రొండు గేరెలుంటయి. దానిమీద కూసుంటె ఒగురుకుడు గాదు... గాల్లె పోయినట్టే పోతది... మనిషికంటెక్కో ఉరుకుతదని ఊరిచ్చుకుంట సెప్పిండు... గా సైకిల్ను సూడన్నని సొనోజులనుకున్నం... ఓసారి కత్తెర్ల భూమయ్య సైకిల్ కొనుక్కోని ఊళ్ళెకచ్చిండు... మేమంత పోయి కండ్లనిండ జూసినం"

"అట్లనా...! మరి నాకోటి కొనియ్యలేవె బాపు...?"

"అప్పటి మాటాను చెప్పాక మానాను. అన్నట్టు అదేపనా! నిన్ను సదివిచ్చుడే కష్టమైతంది! బడికెందుకు తోలితినని పిస్తంది... దొరజెప్పినట్టు నాతోని తీసుకపోతె ఎవుసప్పనులన్న వచ్చేటియి... నీ చదువెప్పుడైపోవాలె? నౌకరెప్పుడు రావాలె? అప్పటివరకే రాజు ఏ పట్నమేలుతడో?"

"బడికివోతేంది నేను పన్చేత్తలేనా బాపు...? బడిలేనప్పుడు ఎడ్లగాయ పోనేవడ్తి... కల్లాలప్పుడు బంతి గొడ్తలేనా? బాగా పనుంటె బడెగవెట్ట వడ్తి... అవ్వ పైసలిచ్చి కైకిల్లేసి రమ్మంటె ఏసత్తలేనా...? ఇంకేం పనిజెయ్యాలె?"

అన్నాడు సాంబయ్య బుంగమూతిపెట్టి...

"ఎవుసదార్లకు పనిజెయ్యకుంటెల్లది



బిడ్డ? ఎంత జేసినా చేతికి మూతికే గావట్టె''

"మరి నేనేం జెయ్యాలె?"

"నిన్నేం జెయ్యిమంటన్న? మంచిగ చదువుకో''

"మొన్న మా బడిమీదినుంచి విమానం పోయిందే బాపు... మేమందరం జూసినం"

"విమానమంటే నాకో సంగతి యాదికత్తంది... విమానాన్ని చూసి పట్వారి పంతులు తల్లి ధర్మపురి గోదావరికి దేవతలు తానంజెయ్య వచ్చింద్రని, అక్కడున్నోళ్లకు మోక్షమని తను పాపాత్మురాలునని ఏడ్సింది'' అన్నాడు చిలుకయ్య.

"అన్ని చెప్పుతవుగని ఏది కొనియ్యవు... సర్పంచింట్ల మంచి రేడియుందట... కిషన్‌రెడ్డి నాతోని చదువుకుంటడు... అయినె చెప్పిండు... అండ్ల మంచి మంచి పాటలత్తయట"

"గా రేడియలు, సైకిల్లు, గడియారాలన్ని ఉన్న లోకులకే... మాదంత ఎడ్డికాలమెట్లనో గడ్సింది. నువ్వు నౌకరి జేసి అన్ని కొనుకుందువు తియ్యి'' అని "సరెగని గా ఐలు మామ నీకు తెలుసు గద!" అన్నాడు చిలుకయ్య.

"మా ఎరికే..."

"అయినె మా నాయిన్న దగ్గెరికచ్చి గిట్లనెటోడు... ఒక్కసారి గాదు... ఏ నూరుసార్లనో నేనిన్న... 'లసుమ్మామ... లసుమ్మామ! దొడ్డుకు దొడ్డు... నల్ల గుంటడు సూడే... గా బేతు నారాయణరెడ్డి... గయినె పేరేందే' అనడిగెటోడు... పేరు సెప్పుకుంటనే పేరడుగుతన్న వేందిరా? అని మా నాయిన్న అన్నా వినెటోడు గాదు... మేమంత నవ్వేటోల్లం... తురుకోల్లు, దండలు (టీకాలు) తీసెటోల్లత్తె ఉరుకవుచ్చుకునెటోల్లం మాది గసోంటి ఎడ్డికాలం. నువ్వు బాగా సదువుతె దొరలు గూడ పక్కన కూసుండపెట్టుకుంటరు''

"నీయవ్వ! మంచిగనే ఉన్నవే బాపు! చదువు బందు జేత్తననుకుంటనే చదువుకొమ్మంటవు'' అని నవ్వాడు సాంబయ్య.

"యాష్టకచ్చి అట్లంటి... నిన్నెందుకు బందుజేత్త?"

"బాపు... బాపు... నేను చెప్పుడే మర్సిపోయిన... సర్పంచి నిన్ను రమ్మన్నడని కిషన్‌రెడ్డి చెప్పిండు. కిషన్‌రెడ్డి సరుపంచి కొడుకు... నా క్లాసే'' అన్నాడు సాంబయ్య.

"సర్పంచుకు నా తోనేంపని?"

"నాకేమెరుక? నాకైతె మా తరగతిల ఫస్టు మార్కులచ్చినయి. మా సారు సర్పంచితోని చెప్పిండు... కొన్ని రోజుల్నుంచి కిషన్‌రెడ్డి నాతోని సోపతి జేత్తండు... నన్ను అయినెతోని కలిసి రోజు వాళ్ళింట్లనే చదువుకొమ్మంటడు... గందుకే పిలువవచ్చు నిన్ను''

"పోదాం... తియ్యి'' అని లేచి ఊళ్ళోకెళ్ళాడు చిలుకయ్య... సాంబయ్య లేచి హోంవర్క్ చేసుకుంటున్నాడు.

★ ★ ★

ఈ కొండల్‌రెడ్డి దొర తననెందుకు పిలిచాడు...? తన కొడుకునెందుకు తీసుకరమ్మన్నాడు...? ఈ దొరలతో ఏదైనా కష్టమే... దొర కొడుకు సాంబయ్యతో స్నేహం చేస్తాడా? ఇది నమ్మాల్సిన విషయమేనా? పక్కూర్లో దొరల పిల్లలు కలిసి చదువులో హుషారున్న కుమ్మరోల్ల పిల్లవాన్ని ఈతకు తీసుకెళ్ళి చెర్లో ముంచారని తెల్సింది. ఈ దొరలను నమ్మరాదు. తనలాంటి వాళ్ళ ఇండ్లలోంచి చదువుకున్నవాళ్ళెల్లుతే వీళ్ళోర్వస్తారా? తన కొడుక్కు ప్రమాదం లేదు కదా?

లేకలేక కలిగిన సంతానం తనకు సాంబయ్య... కులం చెడినా సుఖం దక్కాలన్నట్టు తాను చదువేసినందుకు సాంబయ్య బుద్ధిగానే చదువుకుంటున్నాడు. అన్ని వసతులున్నా దొరల పిల్లలు అంతగా చదువుకోవడం లేదు... వెంగళరావు కొడుకు శ్యాంరావ్ ఐదో తరగతిలోనే చదువాపాడు... పట్వారి కొడు




కులకూ చదువబ్బడం లేదు... తన కొడుకు బుద్ధిగా చదువుకుంటున్నాడని దొరలకు ఈర్ష్యగా లేదుకదా! తన కొడుక్కేమన్నా అయితే తాను బతకగలడా? ఇంతకూ సర్పంచెందుకు తనను పిలిచినట్టు...? సర్పంచ్ వెంగళరావంత కఠినాత్ముడేం గాదు... అయినా తన కొడుకుమీద, తనమీద కన్నెందుకు పడింది? తన కొడుకు చదువుకోవడం తప్పా? ఏడాదికో తరగతి పెరిగిప్పుడూల్లో పదవ తరగతైంది... వచ్చేఏడు పద కొండవుతుందంటున్నారు. ఇంకో నాలుగు గదుల బడి కట్టారు. కొన్ని తరగతులు గుడిసెల్లో నడుస్తున్నాయి. ఈ మధ్య చాలా మందే చదువుకుంటున్నారు. కొద్దిమంది హరిజనులు కూడా బడికి పోతున్నారు. అయినా అంటరానితనమలాగే ఉంది... హరిజన పంచాయతీమెంబరైన దానయ్య పంచాయతాఫీసులోనూ కిందనే కూచుంటాడు. దొంత బొందాలు శివరాత్రి భజనలప్పుడు మంచిమంచి కీర్తనలు పాడుతాడు... కాని ఎవరికి తాకకుండా దూరంగా కూర్చొనే పాడుతాడు.

ఇంతకీ కొండల్‌రెడ్డి తననెందుకు పిలిచినట్టు? సాంబయ్య చెప్పినట్టు కలిసి చదువుకుంటానికయితే అంతకంటే కావాల్సిందేముంది? అయినా ఈ దొరలను నమ్మకూడదు... వీళ్ళ కత్తికి రెండు దిక్కులా పదునే... తలదీసి మొలేత్తడా? ఏం చేస్తాడో చూద్దాం.

రాత్రివరకు రకరకాలుగా ఆలోచిస్తూ ఆలస్యంగా నిద్రపోయాడు చిలుకయ్య. సాంబయ్య దీపం వెలుతురుకు చదువుకుంటూ తండ్రికంటె కొంచెం ముందు నిద్రపోయాడు.

తెల్లవారకముందే లేచాడు చిలుకయ్య. కొట్టం దగ్గరికెళ్ళి గడ్డిగుంజి ఎడ్లముందేసాడు. పెండతీసి పెంటబొందలో వేసాడు. చేతులు కడుక్కున్నాడు. వేప పుల్లతో పండ్లు తోముకుంటూ చెరువు దిక్కెళ్ళాడు. దొడ్డికి పోయాడు. చెర్లో ముఖం కడుక్కొని ఇంటికొచ్చేసరికి సాంబయ్య కచ్చికతో పండ్లు తోముకుంటున్నాడు. తండ్రి రావడం చూసి గబగబా ముఖం కడుక్కున్నాడు.

"బాపూ! ఇగ వోదామా సర్పంచింటికి?" అన్నాడు.

"నువ్వు పోలేవు బిడ్డ... నేనెందుకు?"

"నిన్ను తీసుకరమ్మనడట... వస్తేం బోతుంది?"

సాంబయ్యకు త్వరగా కిషన్‌రెడ్డిల్లు చూడాలనుంది.

"లేడికి లేచిందే పరుగని నీ తొందరకాల్లు లేత్తరా? ఆల్లు దొరలైరి... పొద్దుగాల లేస్తరో లేవరో... నేను నాగలిడిసచ్చినంక పోదామేంది?"

"వద్దు బాపు... ఇప్పుడే పోదాం"

"సరె పా..." అని కొడుకుందీసుకొని బయల్దేరాడు చిలుకయ్య.

"ఇద్దరెటో పోతన్నరేందే?" వాళ్ళ వెంటనే నడుస్తూ అన్నాడు కాపు శంకరయ్య... ఆతని ఎడమచేతిలో తట్టుంది... దాంట్లో బొగ్గులున్నాయి... వాటిపై కర్రుంది... ఆ కర్రును పదును చేయించుకురావడానికి కొలిమి దగ్గరి కెళ్తున్నాడు శంకరయ్య.

"కొండల్‌రెడ్డి కొడుకు నా కొడుకుతోని చదవుకుంటడు... కొండల్‌రెడ్డెందుకో రమ్మన్నడట... పోతన్న'' అన్నాడు చిలుకయ్య.

గా పెద్దోల్లతోని సోపతద్దే... వాళ్ళను నమ్మద్దు. నడిగండ్లె బొండిగ గోత్తరు''

"గాల్లతోనేం సోపతిగని రమ్మంటె పోతన్న''

తండ్రియన్ని కర్నపోనెత్తులు... మెత్తటి కత్తి... చాపకింది నీరోలె పన్జేత్తడు... కింది కుండ కిందుండంగ మీది కుండ మీదుండంగ నడిమికుండ తప్పదీసేరకం... కొడుకుం జూత్తె అమాయికపు పోల్లాగాడేనని పిత్తది''

"గింత చిన్న వయసులేం దెలుత్తది''

"ఎందుకంటవే చిలుకన్న! అన్నం ఉడి కింది ఉడుకంది తెలువన్నంటె బువ్వంత పిసుకన్నా? ఒక్క మెతుకు జూత్తె తెలువదా? అదే వెంగళ్రావు దొర కొడుకులం జూడు... ఆల్లకెంత జాం... ఈ పిలగాడు కొంత నయమే''

"నా కొడుకందరితోని కలసిపోతడు''

"నీ కొడుకు సిపాయే కని పునాస దున్ను డైందా?"

"మా దున్నిన పునాస... విత్తునాలన్ని భూమిలేసినంక వానలు మర్సిపోయె... పెస ల్లు, మక్క మొక్కలు మాడిపోతన్నయి. ఇంకో నాల్గుదినాలు వర్షంలేకుంటే విత్తనాలు భూమిపాలైనట్టే''

"మన నసీవెట్లుంటె గట్లయితది. పిరం ధరకు పల్లీలు కొనుక్కచ్చి భూమిలేత్తిమి... మల్ల కొనన్నంటే చచ్చిపోతం"

"ఎంతైన ఎవుసమంటె లాటిరేసినట్టే అయితంది శంకరయ్యా. పండినేడు పండె... ఎండినేడెండె... ఎవుసాన్ని నమ్ముకుంటె బతుకుడు కష్టమే''

"ఎవుసాన్ని నమ్ముకోకుంటే ఎవ్వలను నమ్ముడే చిలుకన్న. మనకేమన్న నౌకర్లా? మల్ల మనకచ్చిన పనే గిదాయె''

వాళ్ళ మాటలను జాగ్రత్తగా వింటున్నాడు సాంబయ్యా. వాట్ని అర్థంచేసుకోవడానికి ప్ర యత్నిస్తున్నాడు.

"నువ్వన్నది నిజమే! గా పోచంపాడు కాల్వలు తవ్వుతన్నరట... గా నీల్లలై మనకో తీరుగుంటది... వానలు వెనుకకయినా ఇన్ని న్ని పంటలు పండుతయి''

"గవ్వెప్పుడు రావాలె... మనమెప్పుడు బాగుపడాలె?"

"తొందరగానే వస్తయంటంద్రు గద"

ఇప్పుడు గా మెట్టుపల్లి దిక్కు తవ్వుతన్న రట... మన కచ్చేవారకు ఏ ఎనిమిది పదేండ్లయితదో?"

"నిజమే... అల్లుడచ్చెదాకా అమసాగద న్నట్లు ఉన్నాటితోని నడిపిచ్చుకోవాలె... సరె గని గోదావరిఖన్లె బొగ్గుబాయిలు పడ్డయట గదా! లచ్చయ్య కొడుకు పనికి వెయిండు''

"గవ్విపడి పదేండ్లు దాటె... గదేం సుకం పని పాడైందా తియ్యి... నాలె బొయ్యారంలకు పోయినట్టేనాయె''

"ఎహే నీయవ్వ! తిన్నకాడికాయె పటు... గీ ఎవుసాన్ని మించిన పనేలేదు... రైతే రాజు''

"రైతు రాజే... ఇగ తరాజొక్కటే తక్కో ఉన్నది'' నవ్వుతూ అని "కర్రు సాటే యించుక రావాలె... కమ్మరోల్లింటికి పోత... పెద్దోల్లతోని జాగ్రత్తనే చిలుకన్న. కాలుకు వెడితె మెడకు, మెడకు వెడితె కాలుకు పెడుతరాల్లు... కిందపడ్డా మీదపడ్డా బంచో తంటరు. నిజామోన్నుంచి నేర్చుకున్నరా ల్లు'' అంటూ వెళ్ళిపోయాడు శంకరయ్యా.

కొడుకుందీసుకొని కొండల్‌రెడ్డి ఇంట్లో కడుగుపెట్టాడు చిలుకయ్యా. కచ్చేరింట్లో పరి చిన చాపమీద కూర్చొనున్నాడు కొండల్‌రె డ్డి... ఆయన పక్కనే ఆగయ్యా షావుకారి... వినయం, భయం నటిస్తూ ఒదిగి కూర్చున్నా డు ఆగయ్యా. లాల్చీ, ధోతీ కట్టుకొని నిండుగా ఉన్న కొండల్‌రెడ్డి నున్నగా గొరిగిన గడ్డం, మీసాలతో ఉన్న వయసుకంటే తక్కువగా కనబడుతున్నాడు. ఆతనికి నమస్కరించి నిలుచున్నాడు చిలుకయ్యా. సాంబయ్యా పెద్ద దరువాజదిక్కు చూస్తున్నాడు. ఓ చెట్టంత మందంతో నగిషీ చెక్కబడున్న ఆ దర్వాజ దాదాపు తన ఇల్లు విలువవుతుందనుకున్నా డు.

"చిలుకయ్యా! రా... రా...!" ప్రతినమ స్కారం చేసి అన్నాడు రెడ్డి.

"ఎందుకో పిలిచిండ్రట?"

"ఆం... పిలిచిన... నీ సామ్మేం గుంజుకో నుగాని అట్ల కూచో' అన్నాడు కొండల్‌రెడ్డి.

కిందికి కాళ్ళు చాపి అంచుకు కూర్చున్నా




డు చిలుకయ్య. సాంబయ్య తండ్రిని పట్టుకొనే నిల్చొని కిషన్‌రెడ్డి కోసం లోపలికి తొంగి చూస్తున్నాడు.

"నేను నాగటికి పోవాలె దొర... ఎందుకు పిలిచిండ్రో చెప్పకపోతిరి?"

"ఎప్పుడూ తొందరేనా చిలుకయ్య'' అని "ఆగయ్యా! నువ్వు లోపలికి పోయి అమ్మకు నాలుగు చాయ్‌లు పంపుమని చెప్పు... సాంబయ్యచ్చిండని కిషన్‌రెడ్డిని తీసుకరా'' అన్నాడు.

ఆగయ్య లోపలికెళ్ళగానే కిషన్‌రెడ్డొచ్చి సాంబయ్య పక్కన కూర్చున్నాడు. చిలుకయ్య కిదంతా అయోమయంగా ఉంది...

"మీవాడు చదువులో మంచి హుషారు. అన్నిట్లోనూ వానికి ఫస్టుమార్కులే... మొన్న హెడ్మాస్టర్ కలిసి చెప్పిండు''

"బడికి మా కోల్తన్నగని వానికెన్ని మార్కులత్తన్నయోనాకైతె తెలువది! ఇంట్లనైతె బాగానే చదువుతడు. పనైప్పుతె మొకం మాడ్సుకుంటడు''

"మంచిగ చదివిస్తె పైకస్తడు''

"పెద్ద చదువులు చదివియ్యాలంటె నాకెల్లుతదా? ఊల్లున్న కాడికి చదివిత్త'

"నందోరాజ భవిష్యత్తన్నరు... ఎప్పుడేమైతదో ఎట్ల తెలుత్తది'' చిలుకయ్యలాంటి వాడి కొడుకును దొర పొగడటం నచ్చక అన్నాడు ఆగయ్య.

"నిజమే ఆగయ్య! నీలాంటోడేనట ఓ బాపనయినె పెండ్లికూతురు ముండెక్కడ చచ్చిందన్నడట పెండ్లిపందిట్లనే''

దొరా మాటనేసరికి ఆగయ్య నోరు మూసుకున్నాడు...

"దొరా...! నన్నెందుకు పిలిచిండ్రో చెప్పకపోతిరి?"

"అంత తొందరపడుతెట్ల చిలుకయ్య!"

"బారెడు పొద్దెక్కింది దొర... నేను నాగలి గట్ట పోవాలె... నన్నేంజెయ్యమంటరో చెప్పకపోతిరి''

"నిన్నేం కొట్టతిట్టకని సాంబయ్యను బాగా చదివించు... పైసలెల్లకుంటే నేనిస్త... రోజూ మనింటికి పంపించు... ఇద్దరు కలిసి చదువుకుంటరు. మా ఇంట్ల మూడు కందీలున్నయి... వీళ్ళకోటిచ్చేస్త అవసరమైతె బిజిలి గూడ ముట్టియ్యిమంట... మీ ఇంట్ల దీపమెలుగుకేం జదువుతాడాడు?" అన్నాడు కొండల్‌రెడ్డి.

తన కొడుకు దొర కొడుకుతో కలిసి చదువుకోవడం కంటే తనకేం కావాలి? దొర కొడుకు కొడ్తాడేమోనన్న భయమున్నా ఆ బాబు అలాంటివాడు కాదన్న ధైర్యముంది చిలుకయ్యకు.

"సరే దొర... వాడెక్కడ చదువుకుంటేంబాయె... పొద్దుగూకెదాక మీ ఇంట్లనే చదువుకుంటడు... రాత్రయితె పురుగు బుసుంటది గద... పొద్దుగూకినంక మా ఇంటికత్తడు'' అన్నాడు...

"రాత్రయితె మా పాలేరుతోని తోలిస్తతియ్యి''

తలూపి సంతోషంతో వెళ్ళిపోయాడు చిలుకయ్య.... తన కొడుకు దొర దృష్టిలో పడ్డందుకతనికెంతో ఆనందంగా ఉంది... 'ఎంతైనా చదువు చదువే... దానికున్న విలువ దానికుంటది' అనుకున్నాడు ఎడ్లతోలుకొని పొలందిక్కుపోతూ.

ఆరోజు ఆదివారం అవడంవల్ల సాంబయ్యక్కడే ఉన్నాడు... కిషన్‌రెడ్డితో ఇంట్లోకెళ్ళా డు సాంబయ్య.

లోపల కంకబరిగెలతో చేసిన పెద్దపెద్ద గుమ్ములున్నాయి... ఇంకో గదినిండా గోడలకు రకరకాల ఫొటోలు... దొర, దొరసాని, వాళ్ళ కూతుర్లు కిషన్‌రెడ్డి ఫొటోలతోపాటు బంధువుల, వాళ్ళ తాతల ఫొటోలున్నాయి... సాంబయ్య పాఠ్యపుస్తకాల్లోనే చూసిన గాంధీ, నెహ్రూ, సుభాష్ చంద్రబోసుల ఫొటోలు, కాంగ్రెస్ నాయకుల ఫొటోలు చూశా

డు... ఆ ఇల్లు లోపలెప్పుడూ చూడని సాంబయ్యకు మామూలుగానే ఉన్నా మరోలోకంలా కన్పించింది.

"వీడు చిలుకయ్య కొడుకు గదా!" అంది కిషన్‌రెడ్డి తల్లి మణమ్మ.

"అవునే అమ్మ... రోజు మనింట్ల చదువుకొమ్మని బాపు జెప్పిండు'' అన్నాడు కిషన్‌రెడ్డి.

చెరి పిడికెడు నువ్వులు, బెల్లం ముక్క వాళ్ళ చేతుల్లో పెట్టింది మణమ్మ... వాట్ని జేబులో పోసుకొని తింటూ ఇంటివెనుకున్న బాదంచెట్టుకిందాడుకుంటున్నారు.

కప్పతల్లి... కప్పతల్లి... కడుపునిండే...

దొంతాలు... దొంతాలు... దొడ్డినిండే...

అరుపులు, డప్పుల చప్పుడు బజాట్లోంచి వినబడ్డాయి.

"పోదాం పా... మనం గూడ కప్పతల్లాడుదాం" అన్నాడు సాంబయ్య.

"మా బాపుకు తెలిత్తె కొడుతడు''

"ఏం గాదు... వానల్రాకుంటె రావల్నని కప్పతల్లాడుతరు... వాన దేవుని పాటలు పాడిత్తరు... విరాటపర్వం కథ జెప్పిత్తరు... గివ్వన్ని నీకు తెలువయా? మీ బాపేమనడు''

"మా అమ్మనడిగొత్త' అని లోపలికెళ్ళాడు కిషన్‌రెడ్డి...

"ఎవ్వలెజెప్పింద్రురా... గా కప్పతల్లాట ఆడుతరని... గవ్వన్ని గా అలుగా ముండకొడుకులాడుకునేటియి...? గా పోరని సోపతి జేత్తె గవ్వే బుద్ధులత్తయి'' అని తిట్టింది.

సాంబయ్యొక్కడే కప్పతల్లాటకు బయటకెళ్ళాడు... రోకలిబండకు బట్టపేగులో కట్టిన కప్పను బంధించి అటొకరు ఇటొకరు మోస్తూ పాటలు పాడుతూ తిరుగుతున్నారు. ఎవరింటిముందాగుతే వాళ్ళు కుండతో నీళ్ళు తెచ్చి కప్పపైనుండి పోస్తున్నారు... కప్పను బాగా తడిపితే వానలొస్తాయని పల్లెల్లో నమ్మకం... పెద్దవాళ్ళతో పాటు పిల్లలూ పాటలు పాడుతూ తిరుగుతున్నారు.

మోటలకు పోయినోల్లు మొత్తుకుంటచ్చిరి.

నాగండ్లకు పోయినోల్లు నవ్వుకుంటచ్చిరి

గుంటకులకు పోయినోల్లు గుద్దుకుంటచ్చిరి.

వానచ్చల్లో....

పాడుతూ అరుస్తూ ఊరంతా తిరుగుతున్నారు.

సాంబయ్య కప్పకింద వంగి నీళ్ళు మీద పడేలా నిల్చుంటున్నాడు. ఆతన్తో పాటు పిల్లలు.

కప్పతల్లాడే వాళ్లంతా ఇంటింటిలో పోసిన నీళ్ళతో తడిసి ముద్దయ్యారు. ఊరంతా తిరిగి చెరువులో కప్పనొదిలి వచ్చేసరికి మధ్యాహ్నమైంది.

సాంబయ్య బాగా తడవడంవల్ల వణుకుతున్నాడు...

"పొద్దుగాల దొరింటికి పొయ్యి గిప్పుడత్తన్నావు తడిసి... గిప్పట్దాక బువ్వ లేకుంటెట్ల?" అని మందలించింది రాజమ్మ. బట్టలు మార్చుకొమ్మని పొడిబట్టలిచ్చింది.

అన్నం తినిపించింది.

"చెల్లెటుపోయిందే అవ్వ...?"

"మీ నాయిన్నవ్వ ఎటో తీసుకపోయింది..."

"అవ్వా! అవ్వా...!" అన్నాడు తినడమైన తర్వాత సాంబయ్య.

"ఏంగావాలె బిడ్డ?"

"మనింట్ల గూడ చా జెయ్యే... ఒక్కనాడు గాదు... రోజు చెయ్యి''

కొడుకు మాటలు విని నోరు తెరిచింది రాజమ్మ.

"గీ బుద్ధెందుకు పుట్టింది నీకు?"

"కిషన్‌రెడ్డింట్ల జేసుకుంటరు... మంచిగుంటది''




"గా చా దాగుతె కడుపు నిండుతదా? కాలునిండుతదా? ఉడుకుడు కంబలి, లేకుంటే గంజి చెంచెడంత దాగుతె కడుపు నిండె... గా కసికెడంత చాయలేం పాడైంది బిడ్డ?"

"అద్దుపో... నాకు చానే గావాలే"

మోటుకట్టం జేసుకునెటోల్లింట్ల గడు కంబలి, చల్లపెరుగు, గంజి, బువ్వ గిసోంటి యుంటయి... చా పలారాలంటే కలువయి... అవి నీడపట్టుకుండెటోల్లకు"

"ఎవుసం జేత్తె చా దాగద్దా? బాపచ్చినంక చాపత్త తెమ్మంట... నా కన్న పైసలియ్యి... కొనుక్కత్త'

"సరే తియ్యి... మీ బాపు చెయ్యిమంటె మా చేత్త' అని బావిదగ్గరికెల్లింది రాజమ్మ.



కిషన్‌రెడ్డితో స్నేహమైన తర్వాత తనకు దొరికిన సమయంలో ఎక్కువకాలం అతనితోనే గడుపుతున్నాడు సాంబయ్య. కిషన్‌రెడ్డి ఎప్పుడో ఒకసారి సాంబయ్య ఇంటికి వస్తున్నా సాంబయ్యే ఎక్కువగా వాళ్లింటికి పోతున్నాడు. అక్కడే చదువుకుంటున్నాడు. కలిసి హోంవర్కు చేసుకుంటున్నారు. కిషన్‌రెడ్డి అక్కలు కూడా సాంబయ్యను మంచిగానే చూసుకుంటున్నారు.

సాంబయ్యకంతవరకూ తనలాంటి కుటుంబాలవాళ్ల స్థితిగతులు, సంస్కృతి, సాంప్రదాయాలు మాత్రమే తెలుసు. ఇప్పుడు ఆర్థికంగానూ, అధికారికంగానూ బాగున్నవాళ్ల కుటుంబాల గూర్చి తెలుసుకునేందుకు అవకాశం కలిగింది. దొరలు దొరలు అని తండ్రి, నానమ్మ చెప్పే విషయాల గూర్చి ప్రత్యక్షంగా చూసే అవకాశం కలిగింది. కిషన్‌రెడ్డితో కలిసి సాంబయ్య పట్వారింటికి, వెంగళరావింటికి, రాజారావింటికి కూడా పోయేవాడు. అందువల్ల మరిన్ని విషయాలాతనికి అవగాహనకొస్తున్నాయి.

కొండల్‌రెడ్డి ఇంటికిగాని, వెంగళరావు ఇంటికిగాని, పట్వారి ఇంటికిగాని ఊరివాళ్లొచ్చేవారు. ఊరి సమస్యలగూర్చి చెప్పేవారు. పంచాయతీలయ్యేవి. అన్నీ చూసే అవకాశం కల్గింది సాంబయ్యకు. ఓసారి కిషన్‌రెడ్డి, భీంరావుతో కలిసి వెంగళరావింటిముందు ఆడుకుంటున్నాడు సాంబయ్య.

పెదమడేలు బాలయ్యొచ్చి దొరకు నమస్కారం చేశాడు.

"దొరా! బక్కమ్మ పొల్లగాన్ని భూమ్మీన పడేసిపాయె... కొంరడేమొ దేశాలు పట్టుకొని పాయె. పొల్లగాడు దిక్కులేనోడాయె. వానికేమన్న ఆధారం జూపకపోతిరి..." అన్నాడు దీనంగా.

"ఆధారమేందిరా చూపేది? గట్లనే బతుకతడు"

"ఏం బతుకతడు దొర... ఇంటికోనాడు బువ్వ వెడుతన్నం"

"పెట్టలేరైపాయె... పాపానికి పుట్టినోడు... పాపానికే బతుకతడు. ఎవ్వలేం జేత్తరానికి?"

"పంచాయితాపీసుల ఊడ్సుటానికన్న పెట్టలేరు. మీరు జెప్పుతె కొండల్‌రెడ్డి దొర మా ఇంటడు'' అన్నాడు బాలయ్య.

"గీ పోరడేం జేత్తడు చెప్పు? చాకలి కర్రెమల్లగాడు చెపరాశి పని చెయ్యనేవట్టె. వాడైతె అన్ని పనులు జేసె. కారొబారితోని పోయి ఇంటిపన్నులు వసూలు జేసె''

"నేను సర్కారు మనిషినని ఎనుకట నైజమోని జవాను లెక్క సేత్తండు దొర కర్రెమల్లు. పన్నులియ్యకుంటె తలె, చెంబు ఏది దొరుకుతది తీసుకత్తండు''

"గట్ల జెయ్యకుంటె ఇంట్లార్ర మరి'' అన్నాడు వెంగళరావు.

ఇంతలో అయ్యవార్ల కులశేఖరయ్య వదురుకుంటూ వచ్చాడక్కడికి.

"దొరలూ! అమ్ముకోండ్రి. అన్నమ్ముకోండ్రి.. నువ్వన్ను, సర్పంచు మన చెర్ల నీళ్లు పొరుగూరోల్ల కమ్ముకుంటండ్రు. వాటి తోని బంగులాలు గట్టుండ్రి'' అంటూ ఏమేమో వదురుతున్నాడు.

అతడు బాగా తాగున్నాడు. అతన్ని మెడలుబట్టి గెంటించాడు వెంగళరావు. బాలయ్య కూడా వెళ్లిపోయాడు.

అప్పుడప్పుడే సమాజాన్ని కొంత కొంత అవగాహన చేసుకుంటున్న వయసులోకొస్తున్న సాంబయ్యకు దొరలంటేంటో ఇపుడిప్పుడే తెలుస్తోంది. కాని కిషన్‌రెడ్డిలో భీంరావులోలా దౌర్జన్యపూరిత మనస్తత్వం లేకపోవడం గమనించాడు.

మరోరోజు సాయంత్రం కిషన్‌రెడ్డితో కలిసి చదువుకుంటున్నాడు సాంబయ్య. కొండల్‌రెడ్డి పడక కుర్చీలో కూర్చొని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. గొంగళ్లు కోలాటాలేసుకొని కట్టెలు చేతుల్లో పట్టుకొని నలుగురు గొల్లలొచ్చారక్కడికి.

"దొరా గింతన్యాయమైతెట్ల...?" అన్నాడు గంగయ్య.

"ఏమైందిరా?" ఏమీ తెలియనట్టన్నాడు కొండల్‌రెడ్డి.

"గా ల్యాగలబోరు భూమి... గొర్రెమ్యాక గొడ్డుగోద తిరిగే భూమాయె. గా పరంపోగు భూమిని మీరాగవట్టుకున్నరటగద! నీయక్క! మీకు భూములు కరువున్నయా దొర?" అన్నాడు గట్టయ్య.

గట్టయ్య దిక్కు కోపంగా చూశాడు కొండల్‌రెడ్డి.

"దొరా! మీరే గిట్ల జేత్తే మా గొల్లోల్ల బతుకంత ఆగమాగమైతది. ఊరుపక్క పరంపోగు భూములు హరిజనులకు ఇండ్లకనిరి. తలో ఎకురం గా తెనుగోల్లకు భూమిలేదని తీసుకున్రి. మీ అసొంటోల్లు, పటేండ్లు గూడ భూములాగవట్టుకుంటె ఇగ మా గొర్రె మ్యాకేడ దిరుగాలె? గా గుట్టలు గూడిడిసి పెట్టకుంటెట్ల?" అన్నాడు ఐలయ్య.

"నారాయణరెడ్డి దొర భూమి తీసుకుంటేంలేదు. ఇంకా ఎందరు పరంపోగులను తీసుకున్నా తప్పులేదు. ఊరికెన్నో చేసిన వాన్ని నేను తీసుకుంటేనే తప్పొచ్చిందా? నా ఎడ్లు మేయడానికి చెలుకకు పనికొస్తుందని ఉంచుకున్నానేంది?"

కొండల్‌రెడ్డి చెప్పిన పేర్లాతని ప్రత్యర్థులవి.

"పురాగ భూమి లేనోల్లు భూమినుంచుకున్నరంటె ఓ లెక్క. మీరుగూడ గిట్ల జేతెట్ల? ఊరికి కావల్సినోల్లు. మీ కావటికాడు గుట్టకు గొర్లను రానిత్తలేడు'' అన్నాడు గంగయ్య.

అమాయకులైన గొల్లలు తననే ప్రశ్నించటం కోపంగా ఉంది కొండల్‌రెడ్డికి. అయినా భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని "సున్నం రాసిన వరకిడిసిపెట్టి మేపుకోండ్రి. మీరివ్వాళ్ల యాదవ సంఘం పెట్టినామని మురుస్తున్నరు'' అన్నాడు.

"సంఘంబెట్టి మేమేం జేత్తిమి దొర? మా కులంల చిన్నచిన్న పొల్లగాండ్లకే లగ్గాల్జేసిరి పిల్లను తల్లి చంకలెత్తుకొనే తలువాలుపోసె. మేమందరికెట్టి గొర్లియ్యన్నాయె. మమ్ములనందరు గొల్లెక్కిరి, ఇల్లెక్కిరని పేర్నాలవెట్టిరి. నీయక్క! మా మోటుబట్టగట్టుడు చూసి ఎగ్గెలవెట్టిరి. మా ఇండ్లల్ల ఇంటినిండ దేవుతలేనాయె. గిసొంటియన్ని పోవన్నని ఒగ్గుకథలు చెప్పుకుంట తెలివికి రమ్మని చెప్పుతండ్రు. గంతేకాని సంఘానికున్న గీ




భూమీకేం సంబంధముంది దొర? గొర్లు తిరుగుటానికి జేగ లేకుంటైతందని మేమడుగుతున్నం" అన్నాడు గట్టయ్య.

గొర్రెలలాంటి అమాయకులైన వాళ్లను బ్బించి పంపించాలనుకున్నాడు కొండల్‌రెడ్డి.

"సరెగని గోకులాష్టమిపండుగ బాగ జేసుకున్నరా?" అన్నాడు.

"గంగాదేవి మా కులదేవతాయె. శ్రీకృష్ణుడు మా కులదైవమాయె. గోకులాష్టమి మాకు మాదండి పండుగ. మిమ్ముల్నడుగుతె బాగ చెయ్యిమంటిరి. మీరానాడు లేరు. గోపాల కాల్వాలు తీసినం. ఎంకటసామయ్యగారు కిష్టమూర్తేసమేసిండు. ఉట్లుగట్టి మస్తు జేసినం. కత్తెర్ల భూమన్నింట్ల పులిహోర తిన్నం"

"సరెగని గంగయ్యా? నేనా భూమికి పదిహేనేళ్లనుంచి తాసీలు కడ్తున్న. మొన్ననే హద్దులవెంట సున్నం రాసి కావలోన్నుంచిన. మీరందరంటె ఆ భూమిని మా విడిచిపెడుత. మీ అందరికి కావల్సినోన్ని. నీతోనే తగాదెందుకు? ఇంకెన్నో పరంపోగు భూములాగవట్టుకున్న దొరలున్నరుగద. వాటి సంగతి గూడ చూద్దాం. ఇప్పుడు మీకెళ్లతలేదా ఏంది? తర్వాత సూత్త పోండ్రి'' అని వాళ్లను పంపించాడు.

వెంగళరావు ప్రవర్తనకూ, కొండల్‌రెడ్డి ప్రవర్తనకూ మధ్యగల తేడాను గమనించాడు సాంబయ్య. కొండల్‌రెడ్డి సాంబయ్యనెంతో దగ్గరివాడన్నట్లుగా చూసేవాడు. సాంబయ్యిప్పుడు కొండల్‌రెడ్డి ఇంట్లోవాడిలాగే ఇంట్లో స్వతంత్రంగా తిరుగుతున్నాడు. కిషన్‌రెడ్డితో అన్నిచోట్లకూ పోతున్నాడు. కొండల్‌రెడ్డి భార్య ఇంట్లో లేని సమయంలో కొందరాడవాళ్లు గొంగడి ముసుగు లేసుకొని దొంగతనంగా అతని గదికి పోవడం రెండుమూడు సార్లు చూశాడు సాంబయ్య. వాళ్లెందుకలా చేస్తున్నారో ఆ పసివాడికర్థమయ్యేది కాదు.

ఈ రెండేళ్లుగా తనకు కలిగిన అనుభవాలను మననం చేసుకుంటూ పుస్తకాలు తీసుకొని బంగ్లాపైకి పోయాడు సాంబయ్య. కిషన్‌రెడ్డి, అతని ఇద్దరక్కలు, కాపు రాఘవయ్య పైన కూర్చొని చదువుకుంటున్నారు. రాఘవయ్య కిషన్‌రెడ్డి చిన్నక్క క్లాసు.

"ఏంది సాంబయ్య లేటైంది'' అన్నాడు కిషన్‌రెడ్డి.

"బడినుండి వచ్చినంక బర్రెకు గడ్డి కోసుక రమ్మన్నది మా అవ్వ. నేను పోనంటే తిట్టి పంపింది''

"రోజూ మీ చెల్లే పోతదిగదా పనికి?"

"దానికియ్యాల్ల జెరమచ్చింది. గడ్డి కోసు కచ్చేవారకు పొద్దుగూకె. అన్నం తినచ్చిన"

కొద్దిసేపు చదువులో నిమగ్నమయ్యారు వాళ్లు. సాంబయ్యతో అప్పుడప్పుడు పరాచికాలాడతారు కిషన్‌రెడ్డి అక్కలు.

ఈ రోజతన్ని ఏడ్పించాలన్పించింది చిన్నక్కకు.

"పెండ్లెప్పుడు చేసుకుంటవు సాంబయ్యా?" అంది.

పెళ్లంటే బాజాభజంత్రీలు, పల్లకిలో ఊరేగడం, చుట్టాలు రావడం, బొక్క కూర తినడం, కల్లు, గుడాలు ఇవే అని తెలిసినా ఇప్పుడిప్పుడే కొంత కొంత అర్థమవుతోంది సాంబయ్యకు.

"నేం జదివేది ఏడో తరగతేనాయె. లగ్గం జేసుకోవన్నా? మా అవ్వ చేసుకొమ్మని మా అంటంది కని నేను చేసుకోను''

"ఎందుకు చేసుకోవు? రాఘవయ్య చేసుకోలేదా?" అంది పెద్దక్క.

"అయినె నా కంటె పెద్దోడు గదా!"

"నీకంటె మూడేండ్లు పెద్ద. అయినెకు నాలుగేండ్ల కిందనే పెండ్లాయె''

"ఐతాయె.. నేం జేసుకోను''

వాళ్ల దృష్టి రాఘవయ్యపైకి మర్లింది.

"సరెగని రాఘవయ్యా! పెండ్లి జేసు

కుంటివి! దావతెప్పుడిస్తవు?" అంది చిన్న క్క..

రాఘవయ్య నవ్వి ఊర్కున్నాడు..

సాంబయ్య ఎన్నోసార్లు తాత వరుసలు న్నోల్లు మనుమలతో 'లగ్గమైతె ఐపాయె. కాళ్లగోల్ల దావతెప్పుడిస్తవు?' అనడం విన్నా డు. కాళ్లగోల్లంటేందో సాంబయ్యకు తెలియ దు. కానాసమయంలో ఆ మాటలు జ్ఞాపకం వచ్చాయి.

"పెండ్లయితేంది? అప్పుడంటె చిన్నోడా యె రాగన్న! కాళ్లగోల్లప్పుడు మంచి దావతి త్తడు తియ్యి'' అన్నాడు సాంబయ్య.

ఆ మాటలు విని కిషన్‌రెడ్డి అక్కలిద్దరూ పడీపడీ నవ్వసాగారు. రాఘవయ్య ముఖం మాడ్చుకొని కూర్చున్నాడు. వాళ్లెందుకలా నవ్వుతున్నారో సాంబయ్యకు కాని, కిషన్‌రెడ్డి కి కాని అర్థం కావడంలేదు.

"కాళ్లగోల్లు... కాళ్లగోల్లు.. కాళ్లగోల్లంటేంది సాంబయ్యా?" నవ్వుతూనే అంది చిన్నక్క.

సాంబయ్య ముఖం చిన్నబోయింది. తను అన్నదాంట్లో తప్పేముందో ఆతనికి తెలియడంలేదు.

"రాఘవయ్య నడుగు కాళ్లగోళ్లెప్పుడు తీసుకుంటాడో" నవ్వాపుకుంటూ అంది చిన్నక్క.

అదేంటో అర్థం కాకున్నా అందులో నవ్వే విషయమేదో ఉందని మాత్రమర్థం చేసుకు న్నాడు సాంబయ్య.

సాంబయ్య వాళ్లకులంలో కాళ్లగోళ్లు తీసు కునే వాళ్లు పిలిస్తే రెండుమూడుసార్లు తండ్రితో పొరుగూర్లకు పోయాడు సాంబ య్య. భార్యాభర్తలిద్దర్నీ పీటలపై కూర్చోబెట్టి మంగలి కాళ్లగోర్లు తీస్తాడు. ఆ తర్వాత వాళ్లు స్నానం చేస్తారు. అటు తర్వాత కొత్త బట్టలే సుకుంటారు. అందరికీ భోజనాలు పెడ్తారు. ఇందులో నవ్వే విషయమేముందో సాంబ





య్యకు తోచడంలేదు. ఏమైనా తల్లి నడిగి తెలుసుకోవాలనుకున్నాడు సాంబయ్య.

'అంతవరకు నిర్మలంగా ఉన్న ఆకాశంలో మబ్బులు కమ్ముకొచ్చాయి. చూస్తూ ఉండగా నే వెన్నెలపోయి చిమ్మచీకటి కాసాగింది. చర్‌చర్ మంటూ మెరుపులు ఉరుములు ప్రారంభమయ్యాయి.

"వానొచ్చేట్టుంది. కింది రూంలోకెళ్దాం" అంది పెద్దక్క. వాళ్లు లేచి మెట్లు దిగుతుండ గానే టపటపా చినుకులు పడసాగాయి. ఇంట్లో కెళ్లేసరికి కుండపోతగా వర్షం పడు తూనే ఉంది. ఉరుములు, మెరుపులతో మన్నుమిన్ను ఏకమైనట్టు ప్రళయం ముంచు కొచ్చిందా అన్నట్టుగా వర్షం కురుస్తోంది.

"నేనింటికి పోవాలె. మా అవ్వ ఎదురు చూస్తది''

"ఇంతవర్షంలో ఎట్లపోతవు? వర్షం వెలి సింతర్వాత పాలేరుతోని పంపిస్తాను'' అన్నా డు కిషన్‌రెడ్డి.

"వానరాకడ పానం పోకడ తెలువదంటా రందుకే' అన్నాడు రాఘవయ్య.

"అవును.. ఎంత వెన్నెలుండె... చూ స్తుండగానే ఇంత వర్షం" అంది పెద్దక్క.

"చెరువు నిండుతదనుకుంట"

"సగానికెక్కువ నీల్లున్నయి.. నిండొ చ్చు''

వాళ్లు మాట్లాడుకుంటూనే ఉన్నారు. ఆ వర్షాన్ని చూస్తుంటే సాంబయ్యకు భయమే స్తోంది. తొందరగా ఇంటికెళితే మంచిగుండు ననిపిస్తోంది. వర్షం కురుస్తూనే ఉంది.

తనను కాళ్లగోళ్లన్న సాంబయ్య నుడికించా లని రాఘవయ్య "సాంబయ్యకు ఈ ఎండకా లంల పెండ్లి జేత్తరట. వాళ్ల బాపు జెప్పిండు. వాళ్ల మేనమామ బిడ్డున్నదట" అన్నాడు.

ఎందుకో తెలియదుగాని మేనమామ బిడ్డంటే అసహ్యం సాంబయ్యకు.

"నువ్వే మల్ల జేసుకోపో' కోపంగా అన్నా డు సాంబయ్య. కిషన్‌రెడ్డి వేయించిన జొన్న

అటుకులు తీసుకొచ్చాడు. తలా కొన్ని తీసుకున్నారు.

కిషన్‌రెడ్డితో పరిచయం కాకముందే వాళ్ల పెద్దక్క పెళ్లయింది. ఆ పెళ్లిని దూరం నుంచి చూశాడు సాంబయ్య. పెద్ద పందిరి, పన్నెండు మంది భాజాలవాళ్లు. వూరివాళ్లంతా వచ్చి పని చేయడం ఇరవైకిపైగా గొర్లను కోయడం. ఇల్లంతా రంగు కాగితాలతో అలంకరణ... అలాగే వెంగళరావింట్లో నూ చూశాడు. పెళ్లంటే అది అనుకున్నాడు.

ఎక్కడో పిడుగు పడ్డధ్వని చెట్లన్నీ తూలినట్టూగుతున్నాయి. ఇంకో గంట విపరీతంగా కురిసిన వర్షం ఒకేసారి వెలిసింది. కొద్ది నిమిషాల్లో ఏమీ ఎరుగనట్టు ఆకాశమంతా నిర్మలంగా తయారైంది. భూమ్యాకాశాలకు వారధిలా ఇంద్రధనుస్సు ఏడు రంగులతో ఏర్పడింది తెల్లవారి. వర్షం కురిసిన నీళ్లు బొయ్‌మంటూ బజార్లలో పారుతున్నాయి.

గొంగళి ముసుగేసుకొని కొడుక్కోసమొచ్చాడు చిలుకయ్య. పుస్తకాలు తీసుకొని తండ్రి చేయి పట్టుకొని జాగ్రత్తగా అడుగులేస్తూ ఇల్లు చేరుకున్నాడు సాంబయ్య.

వానకు ఇల్లంతా ఉరిసి గందరగోళంగా ఉంది. ఎక్కడ అడుగు పెట్టినా తడే. ఇంటి నిండా గిన్నెలు, చెంబులు, తప్పెలలు సర్దింది రాజమ్మ. సాంబయ్యచెల్లెలు నిద్రపోతోంది.

"ఆయుటి పూనంగ ఇల్లు సదిరియ్యిమంటె సదిరియ్యకపోతివి... ఎట్లున్నదో చూడు బాగోతం! ఈ వానకాల మెట్లెల్లాలె?" గొణుగుతూ అంది రాజమ్మ.

"సావన్నాయె... యాల్లకు సదిరెటోడు దొరుకకపాయె... వానలు పడ్డంకనేమొ తీరకపాయె'' అన్నాడు చిలుకయ్య.

"ఎట్లనో ఎల్లదీసుకుందాం తియ్యి!" భర్తతో అని "ఏం వాన బిడ్డ! దొంగోడచ్చినట్టే అచ్చె... నువ్వెక్కడున్నవని గుటుకూ గుటుకు మనవట్టె'' కొడుకును దగ్గరకు తీసుకుంటూ అంది రాజమ్మ.

సాంబయ్యను చిన్నక్క నవ్వే వెంటాడుతోంది. ఆ పదానికర్థం తల్లి నడగాలనుంది. కొద్ది క్షణాలాగి... "అవ్వా! కాళ్లగోళ్లు (శోభనం) అంటేందే?" అన్నాడు. ఆ మాట విని ముక్కుమీద వేలేసుకుంది రాజమ్మ.

★ ★ ★

"నరహరీ భజనా నోటనరా! నోటనరా నోటనరా నోటనకున్నా వినరా!

గోలీలాడ్దామా బాలకులారా! సద్గురునీ జోలీ గోలీలాడ్దామా బాలకులారా!"

శ్రావణమాసంలో గ్రహబాధలవీ ఎక్కువగా ఉంటాయనీ ప్రతిరోజూ కొండల్‌రెడ్డింట్లో భజనలు చేస్తుంటారు. మిగతా కాలంలో శనివారాల్లో చేస్తుంటారు. శివరాత్రి రోజైతే ఉదయం నుండి మొదల్కొని తెల్లవారే వరకు భజనలే. ఇలాంటి సమయంలో కీర్తన లొచ్చేవారిని కొన్ని గ్రూపులుగా విభజించి మూడు నాలుగు గంటలకో గ్రూపు చొప్పున భజన చేయడానికేర్పాటు జరిగింది. ఈ భజనల యొక్క ఫలితాలేంటో కొండల్‌రెడ్డికి బాగా తెలుసు. ప్రజలు మాత్రం తన ఇంట్లోనే ఇలాంటి ఏర్పాట్లు చేసిన కొండల్‌రెడ్డినెంతో మెచ్చుకునేవారు.

ఆ ఊళ్లోకి రామసింహకవి అనే వ్యక్తి వచ్చేవాడు. ఆతడు రాసినవన్నీ కీర్తనలే. అందులో కేవలం భక్తే కాకుండా సమాజంలోని దుష్ట సంస్కృతిపై తీవ్రమైన నిరసన కొట్టవచ్చినట్టు కనపడేది. మూఢనమ్మకాల నిరసనా ఉండేది. అతనికా ఊళ్లో చాలామంది శిష్యులుండేవారు. చదువొచ్చిన వారైనా కాకున్నా వాళ్లు ఆ కీర్తనలను భజన సమయాల్లో చదివేవారు.

చిలుకయ్యకు కూడా కొన్ని కీర్తనలొచ్చేవి. అప్పుడప్పుడాతడు భజనలు చేయడానికి పోయేవాడు. తండ్రితో పాటు సాంబయ్య కూడా పోయేవాడు. కీర్తనకు కీర్తనకు

మధ్యన చిన్న పిల్లలను పద్యాలు చదవమనేవారు. సాంబయ్య తన పాఠ్యపుస్తకంలో ఉన్న అన్ని పద్యాలనూ బట్టీ పట్టేవాడు. అందువల్ల కీర్తన అయిపోగానే పద్యం తట్టుకోకుండా చదివేవాడు. అలా మందిముందు నిర్భయంగా పద్యాలు చదవడంవల్ల ఆతనిలో కొంతకొంత సిగ్గుదూరం కావడం మొదలైంది. దానికి తోడు డిబేటింగ్ సొసైటీల్లోనూ పాల్గొనేవాడు.

సాంబయ్య వేమన పద్యాలను తన పాఠ్యపుస్తకాల్లోనివి బట్టీపెట్టాడు. ఆ పద్యాలంటే ఆతనికెంతో ఇష్టం. అయితే ఆ ఊళ్లోకి వేమన వంశం వాళ్లమంటూ గురువులమని చెప్పుకుంటూ గుర్రంపై వచ్చేవారు. వేమన గురువు వచ్చినపుడు ఊళ్లో ఎంతో సందడుండేది. ఆతన్ని చూడటానికి ఊరివాళ్లంతా పోయేవారు. గుర్రంపై డప్పుల చప్పుడుతో ఊరేగించేవారు. కాళ్లు మొక్కుతూ కానుకలు సమర్పించేవాళ్లు ప్రజలు. వేమన యోగిగానే ప్రచారంలో ఉండేవాడు.. వేశ్యతో మోసపోయిన వేమన పద్యాలల్లుతూ నగ్నంగా దేశమంతా తిరగేవాడన్న కథ ప్రచారంలో ఉండేది. అయితే వేమన వంశీయులమంటూ అడుక్కోవడమేంటో సాంబయ్య కర్థమయ్యేదికాదు.

అలాగే ఊళ్ళో పోతులూరి వీరబ్రహ్మంగారి కథలు కూడా ప్రచారంలో ఉండేవి. కాలజ్ఞానం గూర్చి చిలుకయ్య, ఆనందయ్య చెప్పగా విన్నాడు సాంబయ్య... ఎంపలి చెట్లకు నిచ్చెనలేసేవారు పుడ్తారని, మనదేశాన్ని ముండ రాజ్యమేలుతుందని అవి తప్పకుండా జరుగుతాయని ఊళ్ళో ప్రచారంలో ఉండేది... అలాగే పోచమ్మ, మైసమ్మల పేర్లమీద జంతుబలులు, దసరా రోజు యాటను గొట్టడం లాంటివి చూస్తుంటే సాంబయ్య భయపడేవాడు. మందెచ్చులవాళ్ళు గొర్రెలమంద చుట్టూ తిరుగుతూ గొర్రెను పండ్లతో గావు పట్టడంలాంటి దృశ్యాలు సాంబయ్యకు వణుకు పుట్టించేవి.

వెంకటస్వామి అయ్యగారు తాను కాశీ భక్తుడనని చెప్పేవాడు. తనకు ఊరిబయటున్న రామప్పదేవాలయంలోంచి ఓంకార నాదం వినబడుతుందనీ, దాన్ని బంధిస్తే ఊరు సుభిక్షంగా ఉంటుందని చెప్పేవాడు. అప్పుడిక ఊరుకు ఏ పీడా ఉండదని చెప్పేవాడు.

ఆ విషయం గూర్చే ఓసారి తండ్రినడిగాడు సాంబయ్య. "ఆ అయ్యగారు ఉన్న బడిపంతులు నౌకరి పోగొట్టుకున్నడు. గిట్లనే ఏవేవో చెప్తుతడు. సంతానం లేనోల్లకు సంతానమయెటట్టు జేత్తనని ఆడోల్లను మోసంజేసి తన్నులు తిన్నడు'' అన్నాడు చిలుకయ్య.

తనకు స్వర్ణం చేసే విద్య కూడా వచ్చని పిల్లలతో ఏవేవో చెప్పేవాడు వెంకటస్వామి. బంగారం చేయడం వచ్చింతర్వాత వెంకటస్వామి అంత పేదరికంలో ఎందుకున్నాడో సాంబయ్యకర్థమయ్యేది కాదు. ఆ విషయాన్నే అడిగాడు. తన కుటుంబానికి శాపముందని, అంతే కాకుండా తనకు వచ్చిన విద్యలు తన కుటుంబం కోసమే ఉపయోగిస్తే అవి పని చేయవని తప్పించుకున్నాడు వెంకటస్వామి.

అప్పుడప్పుడే ఎదుగుతున్న వయసులో లోకం పోకడ గూర్చి కొంత కొంత అర్థంచేసుకుంటున్న సాంబయ్యకు ఇలాంటివన్నీ గందరగోళంగా కనిపించేవి.

అలాంటి సమయంలోనే మల్లేశం అనే ఉపాధ్యాయుడా ఊరికి కొత్తగా వచ్చాడు. సాంబయ్య తరగతివాళ్ళకు తెలుగు చెప్పేవాడతను... అతను పాఠం చాలా గొప్పగా చెప్పేవాడు. ముఖ్యంగా మూఢాచారాల విషయం వచ్చినపుడు ఆవేశపూరితంగా చెప్పేవాడు... వీరేశలింగం పంతులు గూర్చి ఎన్నో విషయాలు చెప్పాడు. బాల్యవివాహాల నిరసనకై వితంతు వివాహాల కోసమై వీరేశ




లింగం తన జీవితాన్నే అంకితం చేశాడని చెప్పాడు. చెడు ముహూర్తాలంటూ, చెడు రోజులంటూ ఏవీ ఉండవని వీరేశలింగం నమ్మేవాడని, అందుకోసం ఏదైతే చెడు ముహూర్తమని చెప్పారో ఆ సమయంలోనే ప్రయాణం చేసి చూపించేవాడని బోధించాడు. సాంప్రదాయవాదుల్నుంచి ఎన్ని ఇబ్బందులెదురైనా తన ఇంటినే కేంద్రంగా చేసుకొని వితంతు వివాహాలకోసం తన జీవితాన్నే ధారపోసిన మహనీయుడాయన అని చెప్పాడు. అలాగే రాజారామ్‌మోహన్‌రాయ్ గూర్చి, గురజాడలాంటి కవులగూర్చి చెప్పాడు మల్లేశం... మల్లేశం బోధనల ప్రభావం సాంబయ్యపై ఎంతో ఉంది. రామ్‌మోహన్‌రాయ్, వీరేశలింగం, గురజాడలపై పూజ్యభావమేర్పడింది.

మల్లేశం బోధనలవల్ల సాంబయ్యలో హేతువాద బీజాలూ నాటుకున్నాయి. ప్రతిదానీ్న హేతువుతోనే నమ్మాలని, చార్వాక

ల్లాంటి ప్రప్రథమ హేతువాదులను సాంప్రదాయవాదులెలా నాశనం చేసారో వివరించాడు. సమయం దొరికినప్పుడు ఆ సారుతో వాదించడం సాంబయ్య కలవాటయిపోయింది.

ఓరోజు బలరాం సారు చరిత్ర పాఠం చెబుతున్నాడు. "పృధ్వీరాజు మహాగొప్పవీరుడు... శత్రువులు గజగజా వణికేవారు... అతడు గొప్ప దేశభక్తుడు... పరాక్రమవంతుడు... అతని పేరు వింటే పిట్టలు కూడా నీళ్ళుతాగేవి కావు''

మల్లేశం చెప్పిన హేతువాదాన్ని జీర్ణించుకున్న సాంబయ్య పాఠం వింటూ కిసుక్కున నవ్వాడు.

చరిత్ర సారు పాఠమాపాడు.

సాంబయ్యను నిల్చోబెట్టాడు...

"ఎందుకు నవ్వావు...? పిచ్చోడివా...?" అన్నాడు.

"సార్... పృధ్వీరాజు గొప్పరాజే... పరాక్రమవంతుడే... ఈ విషయం మనుషులకు తెలుసు... మరి పక్షులకేం తెలుసు సార్? అవ్వెందుకు నీళ్ళు దాగయి?"

ఇలాంటి ప్రశ్నను సాంబయ్యనుంచి ఊహించలేదు బలరాం... అతనిపై కోపానికొచ్చాడు... తండ్రితో చెప్పాడు.

"పిచ్చిపిచ్చి ప్రశ్నలడిగి సారును పరేశాన్ సేత్తున్నవట... సార్లను గట్లనేనా అడిగేది?" అని కొడుకును తిట్టాడు చిలుకయ్య.

మల్లేశంతో చెబితే అది అతిశయోక్తని ప్రతిదానికీ హేతువాదాన్ని ప్రయోగించవద్దని చెప్పాడు.

చంద్రగ్రహణం ఏర్పడటానికి గల కారణాలను ఇద్దరు ఉపాధ్యాయులు చెరోవిధంగా చెబితే ఏది నమ్మాలో అర్థంకాక తెల్లమొహం వేసేవాడు సాంబయ్య.

శర్మగారు హిందీ పండిట్... అతడు కులాలు, మతాలు, తరతమ భేదాలు అన్నీ దైవనిర్మితాలని, మనకు జన్మలు మన పూర్వజన్మ కర్మలను బట్టి వస్తాయని చెప్పేవాడు. అతడు బాల్య వివాహాలను కూడా సమర్థించేవాడు. ఒకరికొకరు పొంతనలేకుండా చెబుతుంటే సాంబయ్యలో రకరకాల సంఘర్షణ కలిగేది. అంటరానితనం తప్పని మల్లేశం చెబితే అంటరానితనం ఉండకూడదని గాంధీ తప్పుచేసాడని శర్మ చెప్పేవాడు.

ఓరోజు పాఠం చెబుతూ మధ్యలో ఇలా చెప్పసాగాడు శర్మ.

"బ్రాహ్మణులు బ్రహ్మముఖంలోంచి పుట్టారు. భుజాల్లోంచి క్షత్రియులు పుట్టారు. వైశ్యులు ఉదరంలోంచి పుట్టారు. పాదాల్లోంచి శూద్రులంతా పుట్టారు. వీటినే నాలుగు వర్ణాలుగా విభజించడం జరిగింది. ప్రస్తుతకాలంలో ఈ వర్ణాలనిలా చెప్పవచ్చు.

బ్రాహ్మణులు బుద్ధిజీవులు... అంటే బుద్ధినుపయోగించి బతికే వారు... క్షత్రియులు ఆయుధజీవులు... ఆయుధాలను ధరించి దేశరక్షణ భారాన్ని, పరిపాలనా భారాన్ని మోసేవారు. వైశ్యులు వ్యాపారజీవులు... వ్యాపారాన్ని వృత్తిగా చేసుకొని బతికేవారు... శూద్రులు శ్రమజీవులు... పంటలు పండిస్తూ, ఇతర పనులు చేస్తూ బతికేవారు... కులాలన్నీ భగవంతునితో ఏర్పాటు చేయబడ్డవే''

"కులాలు మనుషులే కల్పించారని మా తెలుగు సారు చెప్పిండు'' సాంబయ్యాడిగాడు ఉండబట్టలేక.

సాంబయ్యను గద్దరించాడు శర్మ.

"చాతుర్వర్ణం మయా సృష్ట్యా గుణకర్మ విభాగం' అని భగవద్గీతలో శ్రీకృష్ణుడే స్వయంగా చెప్పాడు.

"అంటే ఏంటిసార్?" కిషన్‌రెడ్డి అడిగాడు. వివరించి చెప్పాడు శర్మ.

"పనులనుబట్టి కులాలన్నరు కదా!" ఏదో అడగబోయాడు సాంబయ్య. గద్దరించి నోరు




మూయించాడు శర్మ.

శర్మతో తిట్లు దినీ రకరకాలుగా ఆలోచిస్తూ ఇంటికెళ్ళాడు సాంబయ్య. ఇంటినిండా ఎవరెవరో మనుషులున్నారు. వాళ్ళ ముఖాలు సాంబయ్య ఇంతవరకూ చూడలేదు. పుస్తకాలు దిగుట్లో పెట్టి వంటింట్లో ఉన్న తల్లి దగ్గరికెళ్ళాడు.

"ఏందే అవ్వ...! వీళ్ళంతెవ్వలు...?" అడిగాడు.

"చెల్లెం జూసుటానికచ్చిండ్రు బిడ్డ...!"

"చెల్లెంజూసుడెందుకే? చెల్లె దగ్గరే ముంది?" ఆ మాటలు విని నవ్వింది రాజమ్మ.

"చూసుడంటె వట్టిగ చూసుడుగాదు. నీకంటె నాలుగేండ్లు చిన్నది చెల్లె... దానికి పదేండ్లచ్చె... ఇగ లగ్గంజెయ్యద్దా? గందుకే వచ్చిండ్రు''

చెల్లెకు పెళ్ళి చూపులని అర్థమైంది సాంబయ్యకు. అంత చిన్నపిల్లకు పెళ్ళెందుకో మాత్రం అర్థంకాలేదు. మల్లేశం సారు చెప్పిన రామ్‌మోహన్‌రాయ్, వీరేశలింగం, గురజాడలాంటి వాళ్ళెంతో మంది జ్ఞాపకం వచ్చారు సాంబయ్యకు... తాను చూస్తున్నదానికీ, చదువుతున్న దానికీ మధ్యగల అంతరాలను గమనిస్తున్నాడు సాంబయ్య.

తల్లి వచ్చిన వాళ్ళకోసం ఏవేవో తయారు చేస్తోంది. ఇంట్లో పెట్టిన కల్లుకుండల్లోంచి గుప్‌మని వాసనేస్తోంది. మాగిన చిన్న కుండ లాంటి దాంట్లో గుడాలు తుకతుకా ఉడుకుతున్నాయి.

"అవ్వా! అవ్వా! చెల్లెకింత చిన్నతనంలోనే పెండ్లెందుకే? మా సారు చిన్నపుడు పెళ్ళి చేయొద్దని చెప్పిండు''

"సార్లకేంది బిడ్డ! తీరిపారున్నరు... మా చెప్పుతరు... దొర్సాన్ల ఇండ్లల్లనైతె పెద్దమనిషాయెదాకుంచుతరు... ఆగుతె మల్ల మనకు పిలగాడు దొరుకుడే కష్టమైతది..."

సాంబయ్యకివన్నీ గందరగోళంగా అనిపిస్తున్నాయి. పక్కకున్న కుర్మవాళ్ళ పల్లెలో మరింత చిన్నపిల్లలకు పెళ్ళిళ్ళు చేయడం చూసాడు సాంబయ్య... ఐదారేండ్లైనా లేనివాళ్ళు మెడలో తాళితో, ఒళ్ళెగట్టుకొని కనపడ్డారు సాంబయ్యకు.

"అవ్వా! చెల్లెకిప్పుడు పెండ్లి చేయకుంటేంబాయె?" అన్నాడు.

"మరి నీకు చెయ్యమంటవా?" నవ్వింది రాజమ్మ.

"నాకు నౌకరాయెదాక పెండ్లేవద్దుపో''

"సరెగని నీతోనేంది? అరుగుమీద కూచోపో... వాళ్లతోని మాట్లాడుపో''

"చెల్లేదే మరి?"

"చిప్పొల్ల చింతచెట్టుకింద ఆడుకుంటంది''

"చెల్లెకు చెప్పుత" అని వంటింట్లోంచి బయటకెళ్లాడు.

"చిలుకయ్యా! ఈ పిలగాడు నీకొడుకా?" ఒకతనన్నాడు.

"నా కొడుకే! ఎనిమిది చదువుతండు. పేరు సాంబయ్య''

"ఇటా బిడ్డ'' అనగానే సాంబయ్య పోయి దగ్గర నిల్చున్నాడు.

"ఒక్క పద్యం చదువు''

చదవడానికి వెనుక ముందాడాడు సాంబయ్య. తండ్రి చదువమనగానే 'తొండము నేకదంతమున్' చదివాడు. ఆ తర్వాత 'తల్లీ నిన్ను తలంచి' పద్యం చదివాడు. తాత్పర్యం చెప్పమంటే చెప్పాడు.

"కొడుకు చదువులో ఉషారే ఉన్నడు. మంచిగ చదివిపించు చిలకయ్యా''

"ఒక్కడేనాయె.. మా చదివిస్త''

"ఇంకో పద్యం చదువు'' అన్నాడు వాళ్లలో ఒకతను.

"అడిగెదనని కడువడి జను
నడిగినదను మగుడనుడుగడనినెడనుడు

గున్
వెడవెడ చిడుముడి తడబడ''... చదివాడు...

"అంటే ఏమిటి?"

"నాకు తెలువది... గొట్టుపద్యమిది'' అంటూ చెల్లె దగ్గరకు పరుగెత్తాడు సాంబయ్య.

"పొల్లగాని మాటగూడ మారింది. మోటుగ మాట్లాడుతలేడు'' అన్నాడు చిలుకయ్యకు కాబోయే వియ్యంకుడు.

"చదువుకున్నోల్ల మాట వేరుండదా? ఎనిమిదో తరగతాయె... మన తీరుగనే మాట్లాడుమంటవా ఏంది?" వాళ్లు మాట్లాడుకుంటున్నారు.

చింత చెట్టుకింద తొక్కుడు బిళ్లాడుతున్న చెల్లె, దగ్గరికిపోయి,

"నీకు పెండ్లట తెలుసా?"

"నాకేం గాదు నీకే! సారు చింతబరిగెల లగ్గం జేత్తడు!"

"నాకు మా ఎరికే.. కొత్త జల్లె గట్టిత్తరు. బాసింగాలు కడ్తరు. మంచిగ పల్లాకిల కూచుండచ్చు''

"నన్ను నీతోని కూచుండనిస్తవా?"

"మా కూచోనిస్త తియ్యి'' అందామె.

వచ్చినవాళ్లు పిలుస్తున్నారనగానే చెల్లె సుశీలం దీసుకొని ఇంటికెళ్లాడు సాంబయ్య''

వాళ్లామెను చూసి,

"నల్ల రూపునున్నా మంచిగనే ఉంది'' అన్నారు. ఆ తర్వాత కల్లు దాగుతూ పెట్టుబోతల గుర్చి మాట్లాడుకుంటున్నారు.

"రెండు వేల రూపాయలిచ్చి ఓ ఆవుల్యాగను కొట్టు. నా కొడుక్కు అరతులం బటువు పెట్టాలె'' అన్నాడు చిలుకయ్య వియ్యంకుడు.

"గంతగనం వరదక్షిణ నా దగ్గరేడెల్లుతది?"

"గీ కాలంల రొండువేలో లెక్కనా?"

"ఉన్నోనికి లెక్కేంగాదు కని నాకు లెక్కే... నాకైతే నూటపదార్లిత్తె సంబురపడ్డ''

"ఎప్పటి సంగతప్పుడేలే''

అక్కడ కూర్చొని గుడాలు బుక్కుతున్న సాంబయ్యకు తెల్లకల్లు వాసన చిర్రుమంటోంది. రెండేళ్ల క్రితం వరకు సాంబయ్య అప్పుడప్పుడు తండ్రి పక్కన కూర్చోబెట్టుకొని తాగిపిస్తే రెండుమూడు గ్లాసుల కల్లు దాగేవాడు. అయితే ఓ రోజు సైన్సు మాస్టారు పాఠం చెబుతూ మద్యపానం, పొగతాగడంవల్ల కలిగే నష్టాలను హృదయానికి హత్తుకునేట్టు చెప్పాడు. ఆ పాఠం సాంబయ్యపై గాఢంగా ముద్రవేసింది. అప్పట్నుంచి కల్లు ముట్టుకోవడం లేదు. ఎవరెంత బలవంతం చేసినా తాగడం లేదు.

"సాంబయ్యకో గిలాస పొయ్యుండ్రి''

"వాడు బందుజేసి చాన్రోజులాయె. అయినా చదువుకున్న పిల్లగాండ్లకు కల్లెందుకు?"

"ఒక్క చెట్టుది నికారస్ కల్లైతే మంచిదే. సారా పాడేకని తెల్లగల్లు మంచిదే''

"ఏది మంచిదిగాదు తియ్యి. కల్లు తాగుతె నాలికెదొడ్డైతది. లవంగాలు, యాలకుల్దింటె నాలుకె మంచిగ మర్లుతది''

"ఓ పిలగాడు అన్ని బందుజేసి చదివి పొడుగు జేత్తడు తియ్యి''

"ఆడు తాగుతేంది? తాగకుంటేంది? సరె గని మీరేం బెడుతరో చెప్పుండ్రి'' అన్నాడు వియ్యంకుడు.

"వెయ్యి రూపాయల కంటెక్కువ నా నుంచి గాదు. మీరు పిల్లకిబంగారం బెట్టాలె?"

"వెయ్యి రూపాయలు పెడితె గా బంగారమస్తదిగంతే. ఇగ కట్నమేమిచ్చినట్టు? పదిహేను వందలన్న జేసుకో. నిన్ను పెద్ద మనిషింజేసిండటకద సరుపంచి. పెద్ద మనిషివని వత్తె గిట్ల జెయ్యవడ్తివి?"

"ఆం... పెద్ద మనిషైతె ఏమచ్చె? అట్ల




పేరుకే... అంతజేసే దాల్లేనాయె'' అన్నాడు చిలుకయ్య.

"నీకొడుకు పది జదువుతండు. గా పైసల న్నియ్యకుంటెట్ల?"

పదిహేను వందల కట్నానికొప్పుకోవడం జరిగింది.

విందు ముగిసింది. రాత్రి భోజనం కూడా జేసి పడుకొని తెల్లవారి వెళ్లిపోయారు వాళ్లు.

ఆ తర్వాత వరపూజ, లక్ష్మీపూజయింది. మాఘమాసంలో పెళ్లి పెట్టుకున్నారు. ఉన్న దాంట్లో వైభవంగానే జరిగింది పెళ్లి. మాటలు తెగాయి. పెళ్లి తంతు మూడు రోజులైంది. తాగడం, మాంసం ముక్కలు తక్కువపడ్డాయని కుల తప్పులని చిన్నగా గొడవ పడటం తప్పితే ప్రశాంతంగానే ముగిసింది. సుశీలను అత్తవారింటికి సాగనంపే రోజది. బాండు మేళంతో పల్లకిలో ఊరి చివరి వరకు సాగనంపారు. తర్వాత ఆమెను అత్తమామల చేతుల్లో పెడ్తూ చిలుకయ్య, రాజమ్మ, కొంరమ్మ అంతా గోడు గోడున ఏడ్వడం మొదలు పెట్టారు.

భూమక్క పాడిన అప్పగింతల పాట అందరికీ కళ్లనీళ్లు తెప్పించింది. వాళ్లందరు ఎందుకేడుస్తున్నారో సాంబయ్య కర్థం కాలేదు.

చిలుకయ్యతో సుశీలను బావ చేతుల్లో పెట్టించారు.

అందరేడుస్తుంటే సుశీల అత్తంది,

"ఎందుకేడుస్తరు వదినె. అది నా బిడ్డ సొంటిదేనాయె. మీరందరుండగ నాకేం పర్వ..."

ఆ మాటలకంతా నవ్వారు.

వాతావరణం తేలికైంది.

"ఎడ్డిమొకం దాన... నాకేం పర్వగాదే. కోడలుకేం పర్వ అనాలె' అన్నాడు సుశీల మామ.

సవారు బండ్లు దుమ్ములేపుకుంటూ సుశీల అత్తవారి దిక్కు పరుగులు తీసాయి.

ఆ తర్వాత పదహారవ రోజున పదారు పండుగ (నల్లపూసలు గుచ్చే కార్యక్రమం) జరిగింది. ఈ ఇరవై రోజులున్నుండి సాంబయ్య తండ్రితో, బంధువులతో అటూ ఇటూ తిరుక్కుంటూనే ఉన్నాడు. ఇంటినిండా సందడుంటే చదువుకోవడమెలా సాధ్యమవుతుంది? వెనుక బడిపోయిన పాఠాలను చదువుకోవాలని సాంబయ్య అర్థరాత్రి వరకు చదువుకుంటున్నాడు.



తల్లిందెత్తా... పిల్లందెత్తా... మల్లవొయ్యి మ్యానత్తందెత్తా... తల్లిందెత్తా. పిల్లందెత్తా... మల్లవొయ్యి మ్యానత్తందెత్తా!"

రెండవ వాక్యాన్ని ఒత్తి పలుకుతూ కూత పడ్తున్నాడు సాంబయ్య.

ఏప్రిల్ నెల... ఎండలు విపరీతంగా ఉన్నాయి. ఏప్రిల్ నెలలోనే ఇంత ఎండలుంటే మేలో ఎంతఘోరంగా ఉంటుందోనని జనాలు భయపడ్తున్నారు. అప్పుడప్పుడే పొలం కోతలు మొదలయ్యాయి.

కల్లందగ్గర చెట్టు నీడకు చిర్రగోనాడుతున్నారు పిల్లలు. కిషన్‌రెడ్డి సాంబయ్యతోపాటు ఇంకో ఇద్దరు పిల్లలున్నారు. ఇంకో రెండు రోజుల్లోనే వార్షిక పరీక్షలున్నాయి.

తానాడనన్నా వినకుండా పిల్లలొచ్చి చిర్రగోనె మొదలుపెట్టినందుకు సాంబయ్యకు కోపంగా ఉంది. ఆ పిల్లలపై కంటె సాంబ

య్యకు తండ్రిమీద చాలా కోపముంది. తనకు పరీక్షలున్నాయని చదువుకుంటా నంటే కల్లం దగ్గర కావలుండమన్నాడు చిలుకయ్య.

"నేను చదువుకోవాలె... పరీక్షలున్నయి''

"కల్లంకాడ కూచొని చదువుకో"

"అక్కడెట్ల చదువుకోవస్తది?"

"చెట్టునీడకు కూచుండి చదువు కోరాదా? నువ్వక్కడ చేసేదేంది? వరికుప్పకు కావ లుండుడేనాయె. దొరలోలె కూచుండి తింటా మంటె కలువది. అట్ల జేసెటోల్ల ఎవుసాలు ఒక్కొక్కటే మూలకు వడ్తన్నయి. ఎవుసా న్ని చేయించుకునే తెలివన్నా గావాలె! ఆకార పోల్ల భూములు ఎక్కడికచ్చినయి? రాజిరెడ్డి కారోబారి తనం జేసుకుంట బతుకవట్టె''

"నాకు పరీక్షలున్నయంటె ఇవ్వన్ని చె ప్పుతావేంది?"

"నువ్వు చదువుల ఉషారే. అక్కడ నీడకు కూచొని మంచిగ చదువుకో... నేను వరిజార గొడుత. వరికుప్పకు గొడ్డుగోద రాకుంట జూడు''

ఇక కల్లం దగ్గరకు రాక తప్పలేదు సాంబ య్యకు. అక్కడ కూచొని చదువుకుంటుంటే పిల్లలొచ్చి ఆట మొదలుబెట్టారు.

వాళ్లతోపాటు ఆడుతున్నా సాంబయ్య దృ ష్టంతా చదువుమీదే ఉంది. రెణ్ణెల్ల క్రితం పాఠశాల తనిఖీ కోసమొచ్చిన డి.ఇ.ఓ ఐజాక్ సారు జ్ఞాపకం వచ్చాడు సాంబ య్యకు. ఆతడు చాలా సరదా ఐన మనిషి. ఎంతో ఆదర్శవంతుడు. ఎవరికీ చెప్పకుండా పాఠశాలల తనిఖీకెళ్లేవాడు. అంతంత మా త్రంగానే ఉన్న ప్రభుత్వ పాఠశాలలను కొంతైనా బాగు చెయ్యాలని తాపత్రయపడేవా డు. ఆ రోజు సాంబయ్య గదిలో కొచ్చాడు. అందరూ లేచి నిల్చున్నారు. అన్ని సబ్జెక్టుల లోనూ ప్రశ్నలడిగాడు. ఎవరూ చెప్పని కొ న్ని ప్రశ్నలకు సాంబయ్య సమాధానం చె ప్పాడు. సాంబయ్య నెంతో అభినందించా డు. కరీంనగర్‌కు వచ్చినప్పుడు తన దగ్గ రకు రమ్మని కూడా చెప్పాడు. చివరగా అప్పిచ్చువాడు పద్యం చదవమన్నాడు. చదివాడు సాంబయ్య.

"బాకీ ఎవరిస్తారు?" అడిగాడు.

తన తండ్రి షావుకారి దగ్గర అప్పుతెచ్చుకో వడం చూశాడు సాంబయ్య. అదే మాట చెప్పాడు.

"మరి కొమటోల్లను వైద్యులంటారా?"

"లేదుసార్... షావుకార్లంటరు..."

"మరి అప్పిచ్చేవాడు వైద్యుడెలా అవుతా డు?"

నోరు తెరిచాడు సాంబయ్య.

ఆతడు పిల్లలను నవ్వించాడు. కవ్వించా డు. పాఠశాల సమయమయిపోయిన తర్వాత అక్కడే ఓ సమావేశమేర్పాటు చేశా డు. ఉపాధ్యాయులకెన్నో సూచనలిచ్చాడు. విద్యా ప్రమాణాలను పెంచవలసిన ఆవశ్యక తను గూర్చి చెప్పాడు. విద్యార్థులకు నీతు లు చెప్పాడు. చివరగా కుందేలు, తాబేలు కథ నద్భుతంగా చెప్పాడు.

"ఓ తాబేలుకు, కుందేలుకు పరుగు పందెంలో పోటీ పడింది. రెండు మైళ్ల దూరం పరుగెత్తాలి. ఎవరు గెలుస్తారో చె ప్పండి?"

"కుందేలు బాగా పరుగెత్తుతుందికదా సార్! అదే గెలుస్తుంది'' చెప్పారు పిల్లలు.

"మామూలుగానైతే అలాగే జరగాలి. కాని అలా జరగలేదు.. తాబేలే గెలిచింది. కారణమేమై ఉంటుంది?" అడిగాడు ఐజాక్.

'కుందేలు కాలుకు ముల్లుగుచ్చుకొ నుంటుంది''

"ఆ సమయంలో దానారోగ్యం బాగా లేదేమో!"

"ఉరికేప్పుడు కుందేలుకు బండదాకి కిందపడిందేమో!"

పిల్లలు ఎవరికి తోచిన కారణాలు వాళ్లు





చెప్పారు. నవ్వాడు ఐజాక్.

"మీరన్నట్టు జరిగే అవకాశముంది. కాని క్కడ జరిగిందది కాదు'' అన్నాడు.

"మరేమైంది సార్?" ఉత్సుకతతో ప్రశ్నించారు.

"కుందేలు బాగా పరుగెత్తుతుందికదా! తాబేలేమో నేలపై మెల్లమెల్లగా నడుస్తుంది. తాబేలుతో నాకేంటి పోటీ? అనుకుంది కుందేలు. తాబేలు ముప్పాతిక దూరం పోయింతర్వాత బయలుదేరినా తానే గెలుస్తానుకుంది కుందేలు. కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని బయలుదేరుతాననుకుంది.. చెట్టు నీడ కొరిగింది. దానికి గాఢనిద్రపట్టింది. తాబేలు మెల్లమెల్లగా నడుస్తూ గమ్యం చేరుకునేదాకా కుందేలు నిద్రపోతూనే ఉంది. లేచి చూసేసరికంతా ఐపోయింది''

"భలే... భలే' అన్నారు పిల్లలంతా.

"దీనివల్ల మనకేం తెలుస్తుంది'' అడిగాడు.

"పరుగెత్తేటప్పుడు నిద్రపోవద్దు'' ఆ మాటలకు నవ్వాడు ఐజాక్.

మనమీద మనకు అతి ఎక్కువ నమ్మకం ఉండడం మంచిదికాదు. ఎంత ఉషారున్న విద్యార్థి ఐనా ఓవర్ కాన్ఫిడెన్స్ వల్ల నష్టపోయే అవకాశముంది. మీరంతా విద్యార్థులు కాబట్టి ఎప్పటికీ చదువుతూనే ఉండాలి. పరీక్షలొచ్చింతర్వాతనే చూద్దామంటే బాగుండదు. ఏవరేజ్ విద్యార్థయినా హార్డ్‌వర్క్ చేస్తే మంచి మార్కులు తెచ్చుకునే అవకాశముంది''

సాంబయ్యపై ఆ మాటల ప్రభావమెంతో ఉంది. అందుకే సాంబయ్య చుట్టాల ఇంటికెళ్లినా వెంట పుస్తకాలు తీసుకెళ్తాడు. తనకు వచ్చిందని నమ్మకమున్నా ఇంకా చదువుతాడు.

మిత్రుల బలవంతంపై చిర్రగోనాడుతున్నా ఆతని మనసంతా చదువుమీదే ఉంది.

ఎండలో ఆడుతుండటంవల్ల ఆ పిల్లలకు చెమటలొస్తున్నాయి. కొద్దిసేపు ఒకటి రెండాట ఆడి ఆ తర్వాత బద్దాట ఆడుతున్నారు. 'కాల్‌దెబ్బా, చిటపోటారం, ముక్కెనతోల్, నడ్డీగుర్రం, పెద్దనబేడీ, కన్నేరాం, పొల్లగాడు' అంటూ గోనెతో కొలుస్తున్నాడు సాంబయ్య మిత్రుడు.

"రామచంద్రం సారస్తుండు వచ్చె వచ్చె'' అన్నాడు దూరంనుంచి వస్తున్న సారును చూసి.

మిగతా ఇద్దరు పిల్లలు ఆటవదిలి పరుగెత్తుకు పోయారు. ఆ సారంటే పిల్లలందరికీ హడల్. సారుకు పిల్లలంటే ప్రేమ. పిల్లల చదువులంటే అభిమానం. పాఠశాలలేని సమయంలోనూ పిల్లల చదువుగూర్చి జాగ్రత్తలు తీసుకుంటాడు. తాను వ్యవసాయపనులకు పోతున్నా పిల్లలపైనే దృష్టి. పిల్లలను ఇండ్లలోకెళ్లి చెక్ చేస్తుంటాడు. తల్లిదండ్రులకు చెబుతాడు. అందుకే ఆతడొస్తున్నాడంటే ఆటలువదిలి పారిపోతారు పిల్లలు.

రామచంద్రం సారక్కడికి వచ్చేసరికి కిషన్‌రెడ్డి, సాంబయ్యే ఉన్నారు. కిషన్‌రెడ్డిని రెండు దెబ్బలేసాడు సారు. సాంబయ్య చెవులు మేలేసాడు.

"మీరుగూడా చిర్రగోనెలాడుతున్నర్ర. రెండు రోజుల్లో పరీక్షలుంచుకొని చిర్రగోనాడుతారా! మీ తల్లిదండ్రులు మీరు చదువుకొని పైకొస్తారనుకుంటే మీరు చేసే పనులివా?. మీకేమైనా బుద్ధుందా?" అని ఇద్దర్నీ కొట్టి చిర్రగోనె దూరంగా విసిరిపారేసాడు.

"సార్! మా బాపు నన్ను కల్లం దగ్గరికి పొమ్మన్నాడు. నేనేం జెయ్యాలి?' అన్నాడు సాంబయ్య.

"వ్యవసాయమున్నవాళ్లకు పనిచేయందెలా నడుస్తుంది? కల్లం దగ్గర మాత్రం చదువు కోరాదా? ఇప్పుడేం బంతిలేదుగదా!" అన్నాడు.

తలవంచుకున్నాడు సాంబయ్య.

ఆ సారంటే విపరీతమైన అభిమానం

సాంబయ్యకు. కిషన్‌రెడ్డిని, సాంబయ్యను తనతో తీసుకెళ్లి చెరువులో ఈత నేర్పించాడు సారు. వాళ్లకు రాని లెక్కలు ఓపిగ్గా చెబుతాడు. సాంబయ్యలాంటి వాళ్లపై ప్రత్యేకశ్రద్ధ తీసుకుంటాడు.

సారు వెళ్లిపోయాడు. కిషన్‌రెడ్డి ఇంట్లో చదువుకుంటానని వెళ్లిపోయాడు. సాంబయ్య సైన్సు ప్రశ్నలు చదువుతూ జవాబులు జ్ఞాపకం చేసుకుంటున్నాడు.

కొద్దిసేపట్లో భూమానందమొచ్చాడక్కడికి. ఆతన్నందరూ జుట్టు భూమానందమంటారు. ఆతనికిప్పుడు పదిహేనేళ్లున్నా ఇంకా జుట్టుంది. ఏదో దేవుని దగ్గర తీయాలని అలాగే ఉంచారు. ఆ జుట్టు కనబడకుండా ఉండడానికి వెంట్రుకల్లోకి పెట్టి దూసుకుంటున్నాడు భూమానందం. అయినా అతని మిత్రులు తలపై చేయిపెట్టి జుట్టు పైకొచ్చేట్టు లాగుతారు. ఆతని కాలుకు వెండిబేడి, చెవుకు కొనుకపోగున్నాయి.

పిల్లలు పై పేర్లతో పిల్చుకోవడం మామూలే. కోతి పనులు చేసే రాజేశంను కోతి రాజేశుడని పిలుస్తారు. రెండు మూడేళ్లుగా పిల్లలు కొందరు ఉపాధ్యాయులకు కూడా పైపేర్లు పెట్టి పిలుచుకుంటున్నారు. భూమానందం చేతిలో చేపల గాలముంది.

"సాంబయ్యా! ఒర్రెకు పోదాం నడువ్" అన్నాడు భూమానందం.

"ఈ ఎండల ఒర్రెకెందుకు? నేను రాను"

"ఎండయితేంది? చెలిమెనీళ్లు అమృతమోలుంటయి. దూపగాదేంగాదు పా"

"అక్కడికి పోయేం జేద్దాం?"

"ఎండకాలంగదా! ఒర్రెలెండిపోతున్నయి. చేపలు మస్తుదొరుకుతయి. ఎర్రల గాలం నా దగ్గరుంది. నువ్వు ఎర్రలు తవ్వుకుంటియ్యి నేను చేపలు వడుత... చెరిసగం చేపలు"





సాంబయ్య ఇదివరకు ఏ రెండుమూడు సార్లో తప్ప చేపలు పట్టపోలేదు. ఆతనికి పోవాలనే ఉంది. కాని ఓ దిక్కు తండ్రి అప్పగించిన వరి బాధ్యత, మరో దిక్కు రెండ్రోజుల దూరంలో ఉన్న పరీక్షలు.

"మా బాపు నన్నిక్కడుండుమన్నడు తను వరి తెచ్చేవరకు. లేకుంటె నన్ను గొడుతడు. మా నాయిన్నవ్వ ఉన్నా ఇక్కడ కూచుండబెట్టెటోన్ని. కానామె నిరుడే చచ్చిపాయె"

"ఏం గాదు తియ్యి! గీ వరి కుప్పకు దొంగలు వడుతారా? వడ్లరాశంటె అదివేరు. వరి కుప్పలు వెట్టి రోజులకు రోజుంచెటోల్లు లేరా? గా కల్లపయినెకు చూడుమని చెప్పిపోదాం. గంత నమ్మకుంటెట్ల? వంగుతె మాయం జేసెటోల్లు మా ఉంటరు గని మనూల్లేం లేరు"

"నేన్రాను.. ఇప్పుడే రామచంద్రంసారు వచ్చిపోయిండు. ఎల్లుండే పరీక్షలున్నయి. మా బాపుకు తెలిస్తె కొడుతడు. నువ్వు గూడ చదువుకోక చేపలకు పోవుడేంది? పరీక్షలైనంక పోరాదా?"

"చదువు ముండమొయ్య! ఎంత జదివినా నాకు మనుసున వట్టది... చదివి నేనేమన్న తాసీల్దార్న యేదుందా? ఏదో ఇంకో యాడాదైతె పదకొండయిపోతది. పదకొండు ఎట్లైన పాసుగాను. ఏదన్న పనిజేసుకుంటె బతుకనా?"

"పదకొండు పాసైతే నౌకరైతదని వెంకటయ్యసారు మా బాపుకు జెప్పిండట. మా బాపు ఊకె గదే మాటంటడు. అప్పటివరకు పద్దెనిమిదేండ్లుండన్నని నాకో సంవత్సరం ఎక్కువ రాయించిండట మా బాపు"

"నౌకరాయెవరకు సూత్తాంగని నువ్వొస్తవా రావా?"

"నేను జదువుకుంట నువ్వు పో" అన్నాడు సాంబయ్య.

"ఇగ చదివి పొడుగు జెయ్యి... విలువిద్యలెన్ని నేర్చిన కుల విద్యకు సాటిరావు

గువ్వల చెన్నా అన్నారు. నాకు బంగారం పని వస్తది గోర్లు కొంచెం పెంచుకుంటె మాకేం డోకాలేదు''

గాలొచ్చి భూమానందం జుట్టు పైకి లేచింది.

"సరెగని జుట్టునింకెన్ని రోజులుంచుకుంటవు? కత్తిరించుకో పోయినవా?"

"అది ఇల్లంతకుంట దేవుని మొక్కు. అక్కడికి పోవుడైతలేదు. గా జేతరెమో బాగ పనులున్న కాలంల వస్తది. ఎప్పుడు పోదామన్నా తిరది... ఇయ్యేడు నేనొక్కన్నన్న పోయి వస్త'' అని పోబోయాడు భూమానందు.

"మడుగూలు... మడుగూలు... కారప్పూసలు... కారప్పూసలు... బజ్జీలు... బజ్జీలు..." కేకేస్తూ తినుబండారాల బుట్టతో వచ్చింది హొటల్ పోచయ్య భార్య మల్లమ్మ.

"మడుగూలు కొన్కుందామా? కమ్మ గుంటయి'' అన్నాడు భూమానందం నిల్చొని.

"సాంబయ్యా! కారినపూసలియ్యన్నా కమ్మగుంటయి'' అంధామె సాంబయ్యతో

ఊళ్లో ఏ కులాలవారైనా వరుసలు పెట్టుకొని పిల్చుకోవడం మామూలే. మల్లమ్మ సాంబయ్యకు వదిన వరుసవుతుంది. ఓసారి నాలుగేళ్లక్రితం సాంబయ్య వడ్లు తీసుకెళ్లి ఆమెకిచ్చాడు.

"ఏం గావాలె పిలగా'' అనడిగిందామె.

"కారిన పూసలియ్యమంది మా అవ్వ'' అన్నాడు సాంబయ్య.

ఆమె నవ్వింది.

అప్పట్నుంచామె అతన్ని అదే మాటంటూ పరాచికమాడుతుంటుంది.

సాంబయ్యేం మాట్లాడక సిగ్గుపడుతూ నిల్చున్నాడు.

"సిగ్గెందుకు పడ్తవుగని కారిన పూసలియ్యన్నా?" మళ్లీ అందామె.

"ఇయ్యి... ఇయ్యి..." అన్నాడు భూమానందం.

"అత్త సొమ్ముకు అల్లుడు దానం జేసినట్టు ఇక్కడ కల్లం లేదేంలేదు. ఇయ్యియ్యిమంటన్నవు. పైసలిత్తవా?" అంది మల్లమ్మ.

"కల్లంలో వడ్లు లేవేంలేవు. ఇంక బంతే కట్టకపోతివి. కారప్పూసద్దు ఏమద్దు'' అన్నాడు సాంబయ్య.

"తిననైతె తినలేవు పిలగ. వడ్లు కల్లం లేచినంక కొంచవోత"

"బుక్కు బుక్కు లెక్కగడుత నన్నడట నీలాంటోడే... మా బాపు కొడుతడు... ఉద్దెర కద్దు'' అన్నాడు సాంబయ్య.

"అబ్బో పిలగాడు సామెతలు గూడ మాట్లాడుతండు. సోరోడైతండు'' అంటూ పోబోయింది మల్లమ్మ.

"నువ్వన్నిటికి భయపడ్తవేంది సాంబయ్య. నడిమినుంచో కట్టదీసి వడ్లు నలిచి కారప్పూస కొనుక్కుందాం"

భూమానందం మాటలు విని ఆగింది మల్లమ్మ.

"మంచిగనే ఉన్నవు భూమానందం? గసోంటి లంగుపాయాలే చెప్పుతన్నవా? సాంబయ్యా! ఈనె మాటలినకు'' అని అక్కణ్నుంచి వెళ్లిపోయింది మల్లమ్మ. ఇక లాభం లేదని భూమానందం కూడా వెళ్ళిపోయాడు.

'అన్ని ఇలాంటి కోతి పనులే చేస్తాడు. తండ్రితోని తన్నులు తింటాడు... చదువుల్నెమొ శుంఠ' భూమానందం గూర్చి అనుకుంటూ కల్లంలోకొచ్చిన దొంగ గొడ్డును తరిమేశాడు సాంబయ్య. నీడపట్టుకు కూర్చొని చదువుకుంటున్నాడు.

చీకటి పడుతోంది. చివరి బండి తీసుకొచ్చి కల్లంలో విడిచాడు చిలుకయ్య. సాంబయ్యను బండెక్కమన్నాడు.

సాంబయ్య ఒక్కొక్క కట్ట వరికుప్పపైనేస్తుంటే చిలుకయ్య వరుసగా పేరుస్తున్నాడు. పనయిపోయింతర్వాత అలసటతో చిలుకయ్య బండ్లో కూర్చున్నాడు. తండ్రిపక్కనే సాంబయ్య కూర్చున్నాడు.

డొడ్డాంక డొం... డొడ్డాంక డొం... డొంకుడొమా డొం... పేరయ్య ఊరు చాటింపు చేస్తూ వస్తున్నాడు. కల్లం దగ్గరి బజాట్లోకొచ్చి నిల్చొని 'డొం... డొం...' అని రెండు దెబ్బలు కొట్టి

'విన్నోల్లెవలో...? విననోల్లెవలో...? వచ్చే ఆదివారంనాడు తాసీలు గట్టన్నట. వానాకాలం తాసీలు కట్టనోల్లు గూడ కట్టన్నట తాసీలు కచ్చేరునుంచి మనుషులత్తండ్రట. తాసీలు కట్టకుంటె ఏదుంటె అది కొంచవోత రంట హెూ...

ఇంకోటి గూడున్నది... ఎల్లెంబి (లాండ్ మార్ట్ గేజ్ బాంక్) బాంకోల్లు గూడ వత్తండ్రట... బాకి తీసుకున్నోల్లు చానమంది




కిస్తి గట్టలేదట. ఈ తాప గట్టకుంటె భూమిన ర్రాసు జేత్తరటహెూ'

'డొడ్డొంక డొం...' డప్పు కొడుతూ వెళ్లిపో యాడు పీరయ్య. ఆ మాటలు విని చిలుక య్య వణికిపోతున్నట్టు గమనించాడు సాంబ య్య.

"ఏమైందే బాపు? భయపడ్తున్నట్టు న్నవు?" అన్నాడు సాంబయ్య.

"ఏం జెయ్యాలె బిడ్డ! ఊరు దాటి త్తండ్రంటె మా అసొంటి రైతులకు భయంగా కుంటేమైతది? ఊళ్లె షావుకారిని ఆపచ్చు... చూసిన మొకమాయె ఎనుకో ముందో మా ఆగుతడు. గీ గవర్నమెంటోల్లు వసూల్ల కచ్చింద్రంటె అసలే ఆగరు. గా పంచాయితా పీసుల చెపరాశి పన్జేసే చాకలి కర్రెమల్లు నేను సర్కారు మనిషినని ఎంత లొల్లిలొల్లి జేత్తడో నీకు తెలువదా? ఇగ బాంకోల్ల సంగతి చెప్పవశమేనా? జేపు ఖర్చులు, వాళ్ల ఖర్చు లు, యాల్లకు గట్టకుంటె వడ్డికి వడ్డి వసూజ్జే త్తరు. ఇగ గివ్వి ఎట్ల గట్టుడో?" అన్నాడు చిలుకయ్య.

"గవర్నమెంటువాళ్లే ఇలా చేస్తరా బాపు?"

"అయ్యో బిడ్డ... నీకేమెరుక? నాగటి మీది ఎద్దునిడుసుకపోయిన సంగతులు న్నయి. ఒర్రంగ భూమినర్రాసు పాడింర్రెన్నో సార్లు. రైతుకు బాకి జేసుడేమొ తప్పకపా యె. విత్తనాలు కొనుడుకాన్నుంచి కలుపుకు, మందు బస్తాలకు, పూడికలు తీసుటానికి అన్నొటికి బాకీలేనాయె. షావుకార్ల దగ్గర మిత్తెక్కువని సర్కారు బాకీలకు వోతె అంద రికి తినిపిచ్చేవారకు గంతే బలుత్తంది. అందుకోసం రైతు గతి ఎక్కడేసిన గొంగడ క్కడన్నట్టే ఉంటంది. నువ్వన్న మంచిగ చదువకోని నౌకరిగానివైతె కష్టాలు తప్పు తయి. అయినా నౌకరిగానివైతె మమ్ములనేడ గాన్తవు?" అన్నాడు చిలుకయ్య.

"అట్లెందుకంటవు బాపు? నాకుద్యోగమై తె మీరు వ్యవసాయం చేయవలసిన పనిలే దు. మిమ్ములను కాలుకదలకుండ సాదుత"

"సాదినా సాదకున్నా నువ్వు మంచిగ బతుకుతె అంతేచాలు''

"బాపూ! స్వతంత్రం తర్వాత మునుపటి తీరుగ ఉండదన్ని. మరి బాకీల కిందికి ఇలా చేయడం బాగుందా?"

"ఏమోర సాంబన్న. అందరనుకుంటె నేను గూడ గట్లనే అనుకున్న. ఎడమచెయ్యి కుడి చెయ్యన్నట్లున్నదో లేదోకని నాకైతె ఏం గనపడుతలేదు. ఆర్నెల్లకిందనే వెంగళరావు కొడుకు శ్యాంరావు సవారెడ్ల బండికింద తురుకోల్ల ముసలోడు పడి చనిపోతె ఏమైంది? గీ బాంకుల సంగతి గంతే' నిరాశగా అన్నాడు.

తాను పాఠ్యపుస్తకాల్లో చదివిన స్వతంత్ర గాంధీ, నెహ్రూ, పటేలు, సుభాష్ చంద్రబోసు లాంటివాళ్ల చరిత్రలు స్వతంత్రదినం రోజు బడిదగ్గర ఉపన్యాసాల్లాంటివన్నీ సాంబ య్య జ్ఞాపకాల్లో కదిలాయి. సాంబయ్యకి దంతా అయోమయంగా కనబడుతుంది.

"మూడు సార్లొట్లేత్తిమి. నెహ్రూ పాయె... లాల్ బహదూర్ శాస్త్రచ్చె. అయెనెపాయె... మొన్నమొన్ననే ఇందిరమ్మొక్కె... ఆమె గరీ బోల్లను లేకుంట జేత్తనంటందిటగద.... ఇగేం జేత్తదో సూడాలె! చానమందియి ఉన్న భూములే అమ్ముడు వోతన్నయి. పెద్ద పెద్దె వుసాలు మూలవడ్తన్నయి. కొందరు కొంద రు ఊళ్లిడిసి పోతంద్రు. బొగ్గుబాయిల పనికి పోవుడుగూడ మొదలైంది. మార్తం నర్స య్య బాకీలోల్ల బాధ పడలేక పెద్దపల్లికి పోయి బండిగొట్టుకుంట బతుకవట్టె. గాజు లోల్ల సంగతి గట్లనే ఆయె. మీ అవ్వమీద నాలుగు తులాల బంగారముండె. చెల్లె లగ్గ మప్పుడు రొండు తులాలమ్మవలసచ్చె''

డప్పు చాటింపు కలిగిస్తున్న అలజడి చిలుకయ్యతో ఎన్నో మాటలు మాట్లా డించింది. దూరంగా డప్పు చాటింపు ధ్వని వినబడుతూనే వుంది.



"నేను ముత్తెమంత సేపట్ల అన్నం తిన త్త. నువ్విక్కన్నే కూచో' అని లేచి ఇంటికెళ్లా డు చిలుకయ్య.

తండ్రి మాటల గూర్చే ఆలోచిస్తూ తండ్రి వచ్చేవరకు కూర్చున్నాడు సాంబయ్య.

★ ★ ★

అరుగుమీద గోడకున్న దిగుట్లో కిరోసిన్ దీపం వెలుగుతోంది. వెలుతురెక్కువగా ఉండడానికి వత్తి పొడుగ్గా ఉంచడంవల్ల నల్లని మసి కుప్పలుగా పేరుకుంటోంది. తేపకోసారి ముద్దలు ముద్దలుగా రాలిపడు తోంది. అక్కడ కిరోసిన్ వాసనేస్తోంది. దిగు డు దగ్గరున్న మంచంలో కూర్చొని చదువు కుంటున్నాడు సాంబయ్య. ఆ వెలుతుర్లో చదవడానికిబ్బంది పడుతూ పుస్తకాన్ని కళ్ల దగ్గర పెట్టుకొని చదువుతున్నాడు. తొమ్మిది గంటలు దాటింది. సాంబయ్య మంచం పక్కనున్న నులక మంచంలో చిలుకయ్య పడుకొనున్నాడు. తండ్రినేదో అడగడానికి జంకుతున్నాడు సాంబయ్య.

చిన్న కునుకు తీసి మెలకువ వచ్చిన చిలుకయ్య కొడుకింకా చదువుతూనే వుండటం చూశాడు.

"బందు జేసి నిద్రపో... బాగ రాత్రైంది'' అన్నాడు.

"సైన్సు గొట్టుంది. రేపు సారు ప్రశ్నలడు గుతడు''

"నువ్వు చదివేపే తొమ్మిదోది. తెల్లందాక చదువుతెట్ల. బాగ జదువుతె పిస లేత్తదంట రు. నిద్ర సరిపోవన్నా వద్దా? చప్పుడుజేక నిద్రపో' అన్నాడు చిలుకయ్య.

"పిస లేవదేంలేవది. రోజుకు ఏడెనిమిది గంటల నిద్ర సరిపోతదని మా సారు చె ప్పిండు''

"మంచోడే ఉన్నడు మీ సారు. చిన్న ఎక్క (దీపం) ముంగట కూసొని ఊకె జదువుతె కండ్లు పాడయితయి బిడ్డ... పండుకో'

"మరో కందేల కొనుమంటె కొనకపో తివి''

"ఆం... ఇగ మనకు' కందీల లత్తయ్ తియ్యి'' అని అటు తిరిగి పడుకున్నాడు చిలుకయ్య.

తండ్రి నడగటానికి భయపడుతున్నాడు సాంబయ్య. దీపం వెలుతురుండటంవల్ల చిలుకయ్యకు నిద్ర పట్టడంలేదు. సాంబయ్య కెప్పుడూ చదువు ధ్యాసేనని అదేపనిగా చదవడంవల్ల ఆరోగ్యం పాడైపోతుందని చిలుకయ్య భయం. మంచంలో లేచి కూర్చు న్నాడు చిలుకయ్య. పంచెతో దీపాన్నార్పేశా డు.

"చదివినకాడికి చాలుకని పడుకో' అన్నా డు.

"నేను చదువుకుంటంటె దీపం మలుపు తవా బాపు? రేపు నేను సారుతోని మాటలు వడన్నా?"

"మాటలేం పడవుకని నీకెప్పుడదే మనా దైతెట్ల?"

"బడికి పోయొచ్చిన తర్వాత ఏదో పని జెప్పుతరు. రాత్రన్న చదువుకోకంటెట్ల బాపు?"

"చదువుకోవాలెకని తెల్లారిందాకదే పనా? నువ్వు చదువుల ఉషారే ఉన్నవని సార్లు చెప్పుతండ్రు... పడుకో' అని మంచంలో కొరిగాడు చిలుకయ్య.

"ఇగో పిల్లగాండ్లను ఆల్లముంగట్నే మె చ్చుకోవద్దట... మెచ్చుకుంటె ఆయుషు తగ్గుతదట. భారవో ఎవ్వలోనట. ఆ కత వాళ్ల సారు చెప్పిండని మన సాంబన్నే చెప్పిండు'' అప్పుడే మెలకువ వచ్చిన రాజ మ్మంది సాంబయ్యకటు పక్క నులక మంచంలో పడుకొని.

"అవు... నిజమే. సరెగని పడుకోండ్రి'' అని షోలాపూర్దుప్పటి కప్పుకున్నాడు చిలు




కయ్య.

"బాపూ! బాపూ!" వెల్లకిలా మంచంలో పడుకొని మెల్లగా అన్నాడు సాంబయ్య.

"ఏంది బిడ్డా ఏం గావాలె?" ముఖంపై నుంచి ఛద్దరు తీసన్నాడు చిలుకయ్య.

"బాపూ! నేను గూడ కరీంనగర్ పోత"

ఆ మాటలు విని ఆశ్చర్యపోయాడు చిలుకయ్య.

"కరీంనగరమెందుకు బిడ్డ?" అంది రాజమ్మ.

"అందరు పోతండ్రు. మా బడిపిల్లలే ఇరువైమంది పోతుండ్రు"

"అదే... ఎందుకంటున్న?" అన్నాడు చిలుకయ్య.

"కరీంనగర్‌కు ఇందిరాగాంధి వస్తుంది. ఆమె మన ప్రధాన మంత్రిగదా! ఆమెను చూడవోతం"

"ఆమెంజూత్తేమత్తది? అయినా అంతదూరమెట్ల పోతరు? ఊల్లెకు బస్సుగూడ లేకపాయె"

"మన జిల్లాకు ప్రధానమంత్రి వస్తె చూడద్దా? ఆమె మనకెట్ల కనవడుతది? ఇదువరకు నెహ్రూ, లాల్‌బహదూర్ శాస్త్రి ఎవ్వలు మన జిల్లాకు రాలేదట. మా సారు చెప్పిండు. మన జిల్లాకు ప్రధానమంత్రి రావడం ఇదే మొదటిసారట. లక్షలకొద్ది మంది వస్తరట"

"అంత తొక్కుట్ల పోవుడెందుకు? చిన్న పిల్లలుండుడు కష్టం. అంత కాట గలుత్తరు" అంది రాజమ్మ.

"అవ్వా! నీకు తెలువదానె! నేనింకా చిన్నపిల్లగాన్నా? కరీంనగర్ ఏమంత దూరముంది? ముప్పై కిలోమీటర్లట. చొప్పదండి దాటాక నడిసిపోయి బస్సెక్కుతం. అట్లగాదంటె మొత్తం మందిమి ఎలబోతారంమీది నుంచి నడిచిపోతం. ఓ రోజు ముందు బైలెల్లుతె ఐపాయె"

"అంతదూరం నడిచిపోవుడేం పడావు చేసుటానికి?"

"ప్రధానమంత్రి ఎట్లుంటదో చూస్తం. ఆమె ఏం మాట్లాడుతదో వింటం. ఆమె ఇంత దగ్గరికచ్చినప్పుడు చూడకుంటె ఎప్పుడు జూత్తం చెప్పు?"

"పొల్లగాండ్లంత పొయ్యి ఎక్కడ తింటరు? ఎక్కడుంటరు? ఇదంతేం కత? మిమ్ముల ను పొమ్మని ఎవ్వలెజెప్పిండ్రు?"

"ఎవ్వలెజెప్పుతేందే బాపు? ఇదేమన్న చెడిపోయే పనా? రాత్రివరకు పోయి మనూరయ్యగారు హనుమండ్ల గుళ్లె పూజారిగద! ఆ గుల్లె పడుకుంటం. తెల్లారామెను చూసి రాతిరివరకింటికస్తం! పోయేటప్పుడు చద్ది కొంచవోతం. డబుల్ రొట్టె హొటల్ల కొనుక్కతింటె ఐ పోతది. నన్ను పోనియ్యి బాపూ!"

"అబ్బో బాగనే ఉపాయాలున్నయి. అన్నిటికన్ని ఆలోచించి పెట్టిండ్రు. మంచోడే దొరికిండు మీకెవ్వలో చెప్పుటానికి"

"వద్దు బిడ్డ ఆ పుట్లకొద్ది మందిల, ఆ తొక్కుట్ల ఏమైతదో తెలువది" అంది రాజమ్మ.

"అవ్వా! నాకేంగాదు. నేనొక్కన్నే పోతన్ననా ఏంది? ఒక్క ఐదు రూపాయలియ్యండ్రి. ఏమన్న కొనుక్కతింట. రొండుసార్లు నడిచేపోతం... వస్తం"

"ఐదు రూపాయలంటె ఇరవైమంది కయిలోల్లత్తరు. పెసరుచేను కలుపైపోతది"

"ఏదడిగినా అట్లనే అంటరు. అంతమంది పోతంటె నన్ను పంపిత్తేంబాయె. ఒక్క పైసియ్యకుండ్రి నేం బొయ్యస్త" నిష్ఠూరంగా అన్నాడు సాంబయ్య.

తల్లిదండ్రులెన్ని చెప్పినా పోవడానికే పట్టుబడ్తున్నాడు సాంబయ్య.

"పెద్దవాళ్లు చెప్పే మాటలు వినాలట. మా సారు చెప్పిండు. నెహ్రూ జేల్లుండి బిడ్డకుత్తరాలు రాసెటోడట. ఆ ఉత్తరాలతోనే

ఆమె బాగ తెలివికచ్చిందట. ఇప్పుడామె ప్రధాన మంత్రాయె. దేశాన్నే ఏలవట్టె. ఆమెం జూడద్దా?"

"అన్ని కాలజ్ఞానంల చెప్పినట్టే ఐత న్నయి''

"ఎట్లయితన్నయోకాని నేనైతే పోత... నేను చెర్లకు పోయి బట్టలుతుక్కున్న... నాకొక్క పయింటన్న పట్టియ్యకపోతివి. పండుగలప్పుడు గూడ నెక్కరే కుట్టిత్తిరి. ఎటన్న పోతె తొడుక్కుంటానికి ఒక్క పయింటన్న లేకపాయె''

"చిన్న పిల్లగాండ్లకు గా పొడుగు లాగులెందుకని పట్టియ్యలేదు. పదో తరగతిల మా పట్టిత్త తియ్యి రెండు పాయింట్లు. అవ్వేటికి కొద్ది పైసలయితయా?"

"ఐతేమానాయెకని నేనైతే పోత బాపు''

కొడుకును తాము వెంట లేకుండా అంత దూరం పంపడానికి మనసొప్పడంలేదు వాళ్లకు. కాని ఏదీ కావాలని పట్టుబట్టని కొడుకు ప్రధాన మంత్రిని చూడటానికి పట్టుబడుతున్నాడు. పంపించకుంటే నొచ్చుకునేట్టున్నాడు. అంతమందిలో వీళ్లను పట్టించుకునేవాళ్లెవరు? అయినా సాంబయ్య పట్టుబడుతున్నాడు కాబట్టి పంపాలనుకున్నాడు.

"సరే... నాల్గు రూపాయలిస్త. మీరెట్లన న్న పోండ్రి. ఎట్లనన్న రాండ్రి. చొప్పదండి నుంచి కరీంనగర్‌కు బస్సుకిరాయి అరువై పైసలేనాయె'' అన్నాడు చిలుకయ్య.

తండ్రి ఒప్పుకున్నందుకు సాంబయ్యకెంతో ఆనందంగా ఉంది. రెండు రోజుల్లో తాను దేశాన్నేలుతున్న ప్రధానమంత్రిని చూడబోతున్నందుకాతనికి చెప్పలేనంత సంతోషంగా ఉంది. బ్రిటిష్‌వాళ్ల గూర్చి స్వాతంత్ర్య పోరాటం గూర్చి, పోరాటంలో పాల్గొన్న నాయకుల గూర్చి పాఠ్యగ్రంథాల్లో చదివిన సాంబయ్యకు నాయకులంటే సదభిప్రాయమే ఉంది.

ముసుగుదన్ని ప్రశాంతంగా నిద్రపోయాడు సాంబయ్య.

రెండురోజులు గడిచిపోయాయి. తెల్లవారితే ఇందిరాగాంధి కరీంనగర్‌కు వచ్చేరోజు. కొంతమంది పిల్లలు తెల్లవారి బస్సులో రావడానికి నిర్ణయించుకున్నారు. సాంబయ్య ఇంకొంతమంది ఆరోజు మధ్యాహ్నమే కాలినడకన వెళ్లడానికి నిర్ణయించుకున్నారు. డబ్బాగిన్నెల్లో అన్నం పెట్టుకొని దాన్ని చేతి సంచిలో వేసుకొని పదిమంది పిల్లలు ముప్పై కిలోమీటర్ల దూరాన్ని కాలినడకన పోవడానికి బయలుదేరారు. అందులో కరీంనగర్ లోనే పి.యు.సి. చదువుకుంటున్న ఇద్దరు పిల్లలున్నారు.

ప్రధానమంత్రిని చూడబోతున్నందుకు ఆనందపడుతూ ఆమె రాకను గూర్చి ఎన్నో విధాలుగా ఊహిస్తున్నారు వాళ్లు. కబుర్లు చెప్పుకుంటూ ఉత్సాహంగా నడుస్తున్న ఆ పిల్లలు ఊర్లకూర్లే దాటి పోతున్నారు. పచ్చని పంట పొలాలు, చేల్లు, చిన్నచిన్న కాలువలు దాటుతూ పోతూనే వున్నారు వాళ్లు. చదువుకుంటున్నా వ్యవసాయప్పనులు చేయడమలవాటున్న ఆ పిల్లలకు ఆ నడక లెక్కలోకే రావడంలేదు. కాళ్లు నొస్తున్నా దుమ్ముధూళితో పాదాలు నిండిపోతున్నా వాళ్లు గమ్యం చేరడానికి నడుస్తూనే వున్నారు.

కరీంనగర్‌కు సమీపంలో ఉన్న ఎలబోతారం గ్రామంలో వాళ్లకు మూడేళ్లక్రితంవరకు చదువు చెప్పిన ఉపాధ్యాయుడున్నాడు. ఊరును సమీపిస్తుంటే అతను జ్ఞాపకం వచ్చాడు సాంబయ్యకు.

"సార్‌ను కలిసి పోదామా?" అన్నాడు మిత్రులతో.

"సాయంత్రమవుతోంది. సారును కలిసి మాట్లాడుకుంటుంటే చీకటవుతుంది. రాత్రయితే నడుసుడు కష్టం... వద్దు'' అన్నాడు కిష్టారెడ్డి.

కిష్టారెడ్డి తండ్రి పేద రైతు. ఒకే నాగలి కట్టి అతి కష్టంగా పొట్ట పోసుకుంటున్నాడు. కిష్టారెడ్డి ఆ చిన్న వయసులోనే ఎన్నో




తాకులు తిన్నాడు. కొన్నిరోజులు ఊరొదిలి ఎక్కడెక్కడో తిరిగొచ్చాడు. హెూటల్లో సర్వర్‌గా పనిచేశాడు. డ్రామా కంపెనీల వెంట తిరిగాడు.

"వచ్చేటప్పుడు కూడా నడ్సుడేనా?"

"బస్సులొచ్చినా ఏడెనిమిది కిలో మీటర్లు నడుసుడేనాయె... అదేం సుఖం? అయినా మనదగ్గర డబ్బులేడున్నయి?"

వాళ్ళు కరీంగనర్ చేరుకునేసరికి చీకటైంది... తన ఊరి పిల్లలను చూసిన పూజారి ముఖం ఆనందంతో వెలిగింది.

"ఇంత మందొకేసారొచ్చారు. ఇందిరమ్మను చూసుటానికేనా?" అన్నాడు.

అవునన్నారు వాళ్ళు...

బావిదగ్గరికెళ్ళి కాళ్ళు చేతులు ముఖం కడుక్కున్నారు. మనిషికింత కొబ్బరి ముక్క, ప్రసాదం పెట్టాడు పూజారి... గుడి ముందున్న ఖాళీ స్థలంలో రెండు చాపలు పరిచాడు. పి.యు.సి. చదివే పిల్లలు వెళ్ళిపోయారు. మిగతావాళ్ళు వెంటతెచ్చుకున్న అన్నంలోంచి కొంత తిని చాపలపైన పడుకున్నారు.

ఉదయం లేచి కాలకృత్యాలవీ తీర్చుకున్నారు. పదిగంటలకు ప్రధానమంత్రి వచ్చేసమయం... ప్రొద్దునే అయ్యగారు పిల్లలందరికీ టీ ఇచ్చాడు. వెంట తెచ్చుకున్న అన్నంలోంచి మిగిలింది తొమ్మిది గంటలకు తిన్నారు. అక్కడికి దగ్గర్లోనే ఉన్న పోలీసు గ్రౌండుకు బయలుదేరారు. టౌన్ నిండా పోలీసు బందోబస్తుంది. రోడ్లవెంట పోలీసులు తిరుగుతున్నారు. జీపుల్లోనూ తిరుగుతున్నారు. పిల్లలంతా అక్కడికి చేరుకునేసరికే పోలీసుగ్రౌండ్ సగం వరకు నిండుంది. సాంబయ్య మిత్రులతో ఓ చోట కూర్చున్నాడు. తండోపతండాలుగా జనం గ్రౌండుకు చేరుకుంటూనే ఉన్నారు. జనాన్నదుపులో పెట్టలేక పోలీసులు సతమతమవుతున్నారు. మరో గంటలో గ్రౌండునిండా జనం ఎక్కడ చూసినా జనమే... రోడ్లవెంట జనం... గ్రౌండుకు దగ్గరున్న బిల్డింగుల పై జనం భూమీనినట్టుగా జనం... ఇసుకవేస్తే కిందరాలనంత దగ్గరదగ్గరా జనం క్రిక్కిరిసున్నారు. అంతమంది జనాన్ని చూస్తున్న సాంబయ్యకు భయం భయంగానూ, ఆనందంగానూ ఉంది. అతడెప్పుడూ అంత జనాన్ని చూడలేదు.

ఎంతో అట్టహాసంగా అలంకరింపబడున్న వేదికపైకి ఎవరెవరో వచ్చి ఏదేదో మాట్లాడుతున్నారు. పోలీసులందర్ని పరీక్షగా చూస్తున్నారు.

"మన ప్రియతమ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిగారు, మన విద్యాశాఖమాత్యులు శ్రీ పి.వి. నరసింహారావుగారు... కొద్ది నిమిషాల్లో మన కరీంనగర్‌కు వస్తున్నారు.

మన పట్టణానికి ప్రధానమంత్రి రావడం ఇదే ప్రథమం... ఇరవై ఏళ్ళ స్వాతంత్రం తర్వాత వస్తున్న మొదటి ప్రధాని... తేపతేపకూ మైకులో చెబుతున్నారు. అయినా రావాల్సిన వాళ్ళెంతకూ రావడం లేదు.

''ఇప్పుడెలక్షన్లున్నయి. అందుకే వస్తుందామె''

జనం మీద కొంచెం ప్రేమా వీళ్ళకు?" రకరకాలుగా అనుకుంటున్నారు జనం...

జనం ఎదురు చూస్తూనే ఉన్నారు. ఎండ శరీరాలను కాల్చేస్తోంది... తలలు మాడిపోతున్నాయి. ఒంటిగంటయింది.

"తొందరగ వస్తే బాగుండు'' అనుకుంటున్నారు సాంబయ్య, అతని మిత్రులు...

ఇంతలో బుర్‌బుర్‌మంటూ జీపులు... చప్పుళ్లు... కార్ల చప్పుళ్లు. హారన్ మోతలు... జనమంతా కుతూహలంగా చూస్తున్నారు.

'ప్రజలకు విజ్ఞప్తి... మన ప్రధానమంత్రిగారు వచ్చేస్తున్నారు. మీరంతా అల్లరిచేయకుండా ఉండాలి' మైకులోంచి ప్రకటన.

ఇందిరాగాంధీ, పి.వి.తోపాటు మరికొంద రు నాయకులు ఒకరి తర్వాత ఒకరు స్టేజిపై కొచ్చారు. హర్షాతి రేకంతో జనమంతా చప్ప ట్లు కొట్టారు. అందర్నీ నిశ్శబ్దంగా ఉంచడాని కి వాలంటీర్లు, పోలీసులు ప్రయత్నిస్తున్నా రు. సాంబయ్య, అతని మిత్రులు స్టేజిపైనున్న ప్రధానమంత్రి దిక్కు తలపైకెత్తి చూస్తున్నారు. బాబ్డ్ హెయిర్‌తో, చీర రవిక ధరించున్న ఇందిరాగాంధిగారు సాంబయ్యకు తాను చూసిన దొరసానిలాగా కనబడినా ఆమె ముఖంలో ఏదో తేజస్సున్నట్టు గమనించాడు.

ఒకరి తర్వాత ఒకరు మాట్లాడుతున్నారు. కాని జనమంతా ప్రధాని ప్రసంగం కోసమే ఎదురుచూస్తున్నారు. కొద్దిసేపైన తర్వాత ప్రధాని ప్రసంగిస్తారని ప్రకటించారు.

ఆమె లేవగానే కరతాళ ధ్వనులు...

హిందీలో ప్రసంగం ప్రారంభించిందామె. అదెంతో ఆకర్షణీయంగా ఉంది. జనాలను మంత్రముగ్ధుల్ని చేసేవిధంగా ఉంది.

ఇందిరాగాంధిగారి ఉపన్యాసంలోని ఒక్కో వాక్యాన్ని తెలుగులోకి అనువాదం చేసి చెబుతున్నారు పి.వి.గారు. ఆ అనువాదంవల్ల ఉపన్యాసమంతా అర్థమవుతోందందరికీ; పి.వి.గారు అనువాదం మాటలు ఊళ్ళలో కరణం పంతులు మాట్లాడుతున్నట్టుగా, అది తమకెంతో పరిచయమైందన్నట్టుగా అనిపిస్తోంది సాంబయ్యకు.

దేశ స్వాతంత్ర్యంకోసం గాంధీ, నెహ్రూ లాంటి మహనీయులెందరో త్యాగాలు చేశా రు. స్వాతంత్ర పోరాటంలో కాంగ్రెస్ పాత్ర ప్రముఖమైంది. ఈ పార్టీకి ఎన్నో ఏళ్ళ చరిత్ర ఉంది. కాంగ్రెస్ పాలనలో దేశమెంతో ముందుకెళ్తుంది... దేశానికి ముప్పు వాటిల్ల జేయడానికి ఎన్నో దుష్టశక్తులు ప్రయత్నిస్తున్నాయి. ఆ శక్తుల గూర్చి మనమంతా అప్రమత్తులమై ఉండాలి. సరిహద్దుల దగ్గర మన సైనికులెంతో జాగరూకతతో ఉన్నారు. దేశంలోని పేదరికాన్ని నిర్మూలించడానికి మా దగ్గరెన్నో పథకాలున్నాయి. పేదరిక నిర్మూలనే మా ధ్యేయం. మా ప్రణాళిక... గరీబీ హఠావో... గరీబీ హఠావో... జైహింద్.

గంటకు పైగా సాగిన ఆమె ఉపన్యాసం ప్రజలందర్నీ ఎంతో ఆకర్షించింది.

ఒకటిరెండు నిమిషాల వరకూ చప్పట్లు మోగుతూనే ఉన్నాయి. వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్‌ను గెలిపించాలని విజ్ఞప్తి చేసిందామె.

తర్వాత ఒకరిద్దరు మాట్లాడారు. వోట్ ఆఫ్ థ్యాంక్స్ చెప్పి సభ ముగిసినట్టు ప్రకటించారు.

జనాలంతా లేచి ఒకర్ని తోసుకుంటూ ఒకరు రోడ్లకిరువైపులా చేరారు. కొందరు బంగ్లాల పైకెక్కారు. ముందు కొన్ని కార్లు పోయాయి. టాప్ లేని కార్లో ఇందిరాగాంధి చేతులు జోడించి చిరునవ్వు నవ్వుతూ కూర్చొనుంది. ఆమెను దగ్గరగా చూడటానికి ప్రజలంతా ఉవ్విళ్ళూరుతున్నారు. రోడ్డుమీదికి రావడానికి ప్రయత్నిస్తున్నారు. జనాన్ని అదుపులో పెట్టడానికి పోలీసులు విశ్వప్రయత్నం చేస్తున్నారు.

రోడ్డు ప్రక్కన నిల్చొని వెళ్ళిపోతున్న ప్రధానమంత్రిని కళ్ళారా చూశారు సాంబయ్య, అతని మిత్రులు... ఆ దృశ్యాన్ని మనసులో పదిలపరుచుకున్నాడు సాంబయ్య. మరికొద్దిసేపైనతర్వాత రోడ్డుపైన జనం పలుచబడసాగారు. అప్పటికే పొద్దు గూట్లో పడబోతోంది. వాళ్ళందరికీ ఆకలి దంచేస్తోంది. జిల్లా పరిషత్ భవనానికెదురుగా ఉన్న గుడిసె హోటల్లోకి అందర్నీ తీసుకెళ్ళాడు కిష్టారెడ్డి.

రూపాయికి పప్పుతో ప్లేటు భోజనం... ఒక్కొక్కరికి చిన్నచిన్న ప్లేట్లలో అన్నం, పావులా ఉన్న కటోరలో నీళ్ళలా ఉన్న పప్పు తీసుకొచ్చి ఒక్కొక్కరి ముందుంచాడు సర్వర్.. భోజనం ముగించారా పిల్లలంతా...




కడుపు కొంచెం చల్లబడినట్టయింది.

ఇప్పుడెలాగూ ఊరికెళ్ళలేరు. పొద్దున్నే పోవాలి. ఏం చేద్దామిప్పుడని ఆలోచించారు వాళ్ళు.

"భారత్ టాకీసులో 'లేత మనసులు' సినిమా ఆడుతోంది. చూద్దాం పదండి'' అన్నాడు కిష్టారెడ్డి.

పిల్లలంతా సరేనన్నారు.

"సినిమా చూస్తే బస్సుకు డబ్బులుండవు'' ఒకతనన్నాడు...

"ఎట్లైన నడిచి పోవుడేనాయె. సినిమా చూసి గుళ్ళో పడుకొని పొద్దున లేచి నడిచి పోదాం" అన్నాడు క్రిష్ణారెడ్డి

అంతా కలిసి భారత్ టాకీసుకెళ్ళారు.

మూడవ తరగతి టికెట్ కౌంటర్ దగ్గర 'క్యూ' రోడ్డు దాటుంది. అందులోనూ ఒకర్నొకరు తోసుకుంటున్నారు. టిక్కట్లు దొరకడం దాదాపుగా అసాధ్యమని వాళ్ళంతా నీరుగారి

పోయారు. వెనక్కి వెళ్ళిపోదామన్నారు.

'నేను టిక్కట్లు తీసుకుంట" అన్నాడు కిష్టారెడ్డి.

అంత జనంలో ఎలా సాధ్యమో వాళ్ళకర్థంకాలేదు. అందరి దగ్గర్నుండి తలో బారానా (డెబ్బైఐదు పైసలు) వసూలుచేశాడు. షర్టు విడిచి సాంబయ్యకిచ్చాడు. లైన్లో ఉన్న ఓ పెద్దమనిషి కాళ్లకింద దూరాడు. కాళ్లమధ్య సందు చేసుకుంటూ కొంతదూరం పోయాడు. పైకి లేచాడు. ఒకతని జబ్బలు పట్టుకుని పైకెక్కాడు. వాళ్ళ భుజాలమీదనే నడుస్తూ కౌంటర్ దగ్గరికెళ్ళాడు. ఊచల్లోంచి చెయ్యి లోపలకు పెట్టాడు. టిక్కెట్లు తీసుకొని బయటపడ్డాడు. అతని బనీను చినిగింది. వెంట్రుకలు చిందర వందరయ్యాయి. నిక్కరు నలిగిపోయింది.

కిష్టారెడ్డి సాహసాన్ని చూడటం ఆ పిల్లలకు కొత్తయినా అలాంటి పనులు అతనికి కొత్తకాదు.

వాళ్ళు లేతమనసులు, సినిమా చూశారు...

సాంబయ్యకు, ఇతర పిల్లలకు ఆ సినిమా ఎంతో నచ్చింది.

పిల్లల నటన మరీ నచ్చింది.

ఇంటర్‌వెల్‌లో మిరపకాయ బజ్జీలు కొనుక్కుతిన్నారు. సోడా తాగారు.

రాత్రి గుడికెళ్ళి పడుకున్నారు. ఉదయం మిగిలిన డబ్బుతో అరటిపళ్ళు కొని టీ తాగి బయలుదేరారు.

అంతకుముందురోజు నడక, గ్రౌండ్‌లో నలిగిపోవడం, సినిమా చూస్తూ అలిసిపోవడంవల్ల వాళ్లు మొదటిరోజులా నడవడంలేదు. కిష్టారెడ్డి వాళ్ళను ఉత్సాహ పరుస్తున్నాడు.

ఎలబోతారం చేరేసరికే వాళ్ళకాకలేస్తోంది.





ముకుందరెడ్డి సారింటికెళ్లారు వాళ్ళు.

అందర్నీ పేరుపేరున పలుకరించాడు సారు... వాళ్ళ తండ్రుల గూర్చి అడిగాడు.

"అన్నం తినిపోండ్రి..." అని అన్నం కూర వండించాడు. అన్నంతిని బయలుదేరారు వాళ్లు. వాళ్ళింటికి చేరేసరికి సాయంత్రమైంది. మధ్యమధ్యలో వాళ్లు చేతికి దొరికిన పల్లీలు, జామపళ్లు తిన్నారు.

సాంబయ్య క్షేత్రప్రయాణం గొప్ప అనుభవంగా, జీవితంలో ముద్రగా మిగిలిపోయింది.



గణతంత్ర దినోత్సవాన్ని ఆ ఊళ్లో ఎంతో సంబరంగా చేసుకుంటారు. ఊరివాళ్ళందరూ ఆ ఉత్సవంలో పాల్గొంటారు. కొండల్‌రెడ్డి ఊరి సర్పంచ్‌గా పదవీబాధ్యతలు తీసుకున్నప్పట్నుంచీ ఊరివాళ్లందరూ పాల్గొనడం మొదలైంది. ఆ దినంయొక్క ప్రాముఖ్యత ఊరివాళ్ళందరికీ తెలియకున్నా 'చెబ్బీస్ జన్వరి ఇయ్యాల్ల' అంటూ ఉత్సాహంగా జరుపుకుంటారు. అది వ్యవసాయపనులవీ ఎక్కువగా ఉండేకాలమే అయినా చాలా మంది ఆరోజు వ్యవసాయప్పనులకు పోరు... ఊరంతా సందడే ఆరోజు.

తెల్లవారితే 26 జనవరి... తనకు ఊహ తెలిసినప్పట్నుంచి కూడా ఆరోజునెంతో పండుగగా నిజానికి పండుగ కంటెక్కువగా చేసుకోవడం చూస్తున్నాడు సాంబయ్య. అలాగే దసరా పండుగకు ముందు సాంబయ్య

చిన్నతనంలో గడలు పట్టేవారు. రెండేళ్ళకి తంవరకు దాదాపు ప్రతి సంవత్సరమూ గడలు పట్టుకొని తిరిగేవారు.

"అయ్యవారికి చాలు ఐదు వరహాలు... పిల్లవాండ్లకు చాలు పప్పుబెల్లాలు'' అని పాడుతూ ఇంటింటికీ పిల్లలు, ఉపాధ్యాయులు తిరిగేవారు. పిల్లల తండ్రులు తమకు తోచింది ఇచ్చేవారు. దాంతో సంతోషపడేవారు ఉపాధ్యాయులు. పిల్లలకు నువ్వులు, బెల్లం, పల్లికాయ, పచ్చికంకులు ఇంట్లో ఏవుంటే అవే ఇచ్చేవారు. సాంబయ్యకు తోటిపిల్లలతో తనకు చదువుచెప్పిన గురువులతో కలిసి అలా తిరగడం ఎంతో సరదాగా ఉండేది. ఇప్పుడెందుకు 'గడలు' పడుతలేరని సాంబయ్య వెంకటయ్యసారునడిగాడు.

"ప్రభుత్వ పాఠశాలలు లేకముందు కాలంలోంచి వస్తున్న ఆచారమిది. అప్పుడు ఉపాధ్యాయులకు ప్రభుత్వ జీతాలుండేవి కావు. అప్పుడు గడలు పట్టుకొని పోతే తమకు తోచింది ఇచ్చేవారు. ఇప్పుడు ప్రభుత్వంనుంచి జీతాలు తీసుకుంటున్నారుగదా పంతుల్లు? ఎందుకివ్వాలె అనే ఆలోచన వచ్చింది. ఋషులకాలం నాటిదనుకుంటా ఈ సాంప్రదాయం" చెప్పాడు వెంకటయ్య.

ఆ మాటలు అర్థమయ్యి కానట్టున్నాయి సాంబయ్యకు. అలాగే బతుకమ్మాట స్త్రీలంతా ఆడుకుంటుంటే పిల్లలు కోతిపనులు చేసేవారు. కంకబొంగు గొట్టాలలో మలిచిన పేపరు పెట్టి తుపాకీని కొట్టినట్టుగా కొట్టేవారు. స్త్రీలు తిట్టేవారు. ఒక్కోసారి జాకెట్లు పెగిలిపోయేంత గట్టిగా తగిలేవి. అలా చాలా సార్లు గొడవైంది. కొద్దిరోజుల్నుంచి అదీ బందయింది.

తెల్లవారి జరగబోయే గణతంత్రదినపు ఉత్సవాల గూర్చి ఆలోచిస్తున్న సాంబయ్య పాత విషయాలనెన్నిటినో జ్ఞాపకం చేసుకున్నాడు. ఇంకొద్ది సంవత్సరాలైతే ఇది కూడా దసరా 'గడల' పండుగలాగే అవుతుందేమోననుకున్నాడు సాంబయ్య.

ఎముకలు కొరికే చలి ఊరిని వణికిస్తోంది. ఎంత వణికించే చలిలోనైనా కోడికూతతోనే లేచి తమ తమ పనుల్లో నిమగ్నమయ్యే పల్లీయులనా చలి ఏం చేయలేదేమో... ఆరోజు కొంచెం పొద్దెక్కిన్నుంచి జరుగబోయే సంబరాలను చూడటానికి రోజుకంటె ముందే మేల్కొన్నదూరు. పనులు కొన్ని ముగించుకొని రావడానికి పల్లె అప్పుడే సన్నద్ధమైంది.

కొంచెం పొద్దెక్కేసరికే విద్యార్థులంతా పాఠశాల వద్దకు చేరుకున్నారు. అక్కడ ప్రధానోపాధ్యాయులు జెండానెత్తాడు. ఇద్దరు ఇద్దరు లైనుగా విద్యార్థులంతా ఊళ్ళో ఊరేగింపుకు బయలుదేరారు. అక్కడక్కడ నడుస్తూ ఉపాధ్యాయులు వాళ్ళను అల్లరి చేయకుండా చూస్తున్నారు.

స్వతంత్ర భారత్‌కీ జై
మహాత్మాగాంధీకీ... జై
ఇందిరాగాంధీకీ జై
జైబోలో స్వతంత్ర భారత్‌కీ...

నినాదాలతో దారంతా దద్దరిల్లుతోంది పిల్లలొచ్చింతర్వాతే పంచాయతీ ఆఫీసు దగ్గర జెండానెత్తారు. సర్పంచ్ మాట్లాడాడు. పాఠశాలవరకు ఊరేగింపుగా వెళ్ళారు. అక్కడ కొబ్బరికాయ ఫలహారం తీసుకొన్న తర్వాత ఉపాధ్యాయులు, విద్యార్థులంతా ఊళ్ళోకొచ్చారు. ఆ ఊళ్ళో ప్రతిఏడూ ఆరోజున ఆటలు పాటలు అన్నీ ఊళ్ళోనే జరుపుతారు. సర్పంచ్ ఇంటిపక్కనున్న అట ఎకరం స్థలంలోనూ, కచ్చేరుముందున్న ఖాళీస్థలంలోనూ విద్యార్థులను, ఊరివారినీ ఆటలవీ ఆడిస్తారు. మరోదిక్కు విద్యార్థులతో పాటు ఊరివాళ్లలో ఉత్సాహమున్నవాళ్లు పగటి వేషాలేస్తూ వినోదాన్ని కలిగిస్తారు. బహుమతుల డబ్బు పంచాయతీనుంచిస్తారు.

వెంకటయ్యసారే వాళ్ళందరికీ మాటలు రాసిచ్చి నటించడం కూడా ప్రాక్టీస్ చేయిం:

తాడు.

విద్యార్థులకు, ఊరివాళ్లకు ఆటల పోటీలు నడుస్తున్నాయి. "మందులూ... మందులే... మందులూ మైరామజోగి... మాయల మచ్చాల మందులూ'' మందులవాడి వేషం వేసుకొని గొల్లగంగయ్య తన బృందాన్ని వెంటవేసుకొని అందరికీ వినోదాన్ని కలిగిస్తున్నాడు.

'మరుగు మందు... మంచికి మందు... పెండ్లాం వినకుంటె మందు. మొగడు వినకున్నా మందు... దగ్గుకు మందు... దమ్ముకు మందు అన్ని రోగాలకు మందు... భలే భలేమందు...' కాళ్ళకు గజ్జెలు కట్టుకొని ఎగురుతూ పాడుతున్నాడు గంగయ్య.

'అక్కో... అక్కో... అక్కా... నీ తమ్మున్నొచ్చిన్నక్కా! నీకు చీరెలు తెచ్చిన్నే అక్కా... నీతోడబుట్టినోన్నక్కా! నీకు నగలూ తెచ్చానక్కా... నాకెందుకు దూరమైతివక్కా...' ఇంకోచోట బిచ్చపుపోరడి వేషం వేసి కాపు నర్సిరెడ్డి ఛాతీమీద చరుచుకుంటూ పాట పాడుతున్నాడు. ఆ పాటలో సోదరులు, సోదరీమణులు పెళ్ళయిన తర్వాత దూరం కావద్దని ప్రబోధిస్తున్నాడు.

మరోచోట బావాజీ వేషంలో మంగలి సాయిలు అందరి సంగతులూ చెబుతున్నాడు. ద్వైతాద్వైతాలు బోధిస్తూ అందర్నీ వినోదపరుస్తున్నాడు.

నుదుట నామాలు దిద్దుకొని పంచాంగం చేతిలో పట్టుకొని బ్రాహ్మణుడి వేషంలో లింగయ్య అందరి జాతకాలు చెబుతానంటూ చిచూ చేలో అశ్విని... భరణి అంటూ అస్తవ్యస్తంగా నోటికొచ్చినవి చెబుతూ అందర్నీ నవ్విస్తున్నాడు, కవ్విస్తున్నాడు.

శివయ్య వేసిన బసవన్న వేషం అందర్నీ ఆకట్టుకుంది. నుదుట విభూతి పూసుకొని, భుజానికి జోలెవేసుకొని పచ్చివేపాకు కసాపిసా నములుతున్నాడు శివయ్య. ఎవరెన్ని విధాలుగా మాట్లాడించాలని ప్రయత్నించినా మాట్లాడటంలేదు. పిల్లలు ఎంత రెచ్చగొట్టినా, ఎన్ని చిలిపి చేష్టలు చేసినా బసవన్నలా తలూపుతున్నాడే తప్ప మాట్లాడటంలేదు.

'కమ్మరి బక్కయ్య కాల్లూ... వడ్ల ఈరయ్యా చేతులూ... కత్తెర్ల భూమయ్య కడుపూ... గొల్లొల్ల శివయ్యా గొంతూ' అంటూ ఆతని ముందెంత ఎగిరినా తాగిన చుట్టను మల్ల తాగెరా అరె సాంబయ్యా... మాటమాటకూ జగడం చేసిర బర్లహనుమయ్యా! అంటూ హాస్యమాడినా అతనిలో చలనం లేదు. ఆ బసవన్న వేషమే శివయ్యకు బతకడానికి మార్గమయింది.

రాజిరెడ్డి తుపాకీ రాముడి వేషం అందర్నీ కడుపుబ్బ నవ్విస్తోంది. చిరిగిన పాంటు ఒక కాలు కిందికీ ఇంకో కాలు పైకీ మలిచి పెట్టుకొని, చినిగిపోయిన కోటేసుకొని, తలపై మాసికలు పడ్డ టోపీతో జబ్బకు సంచీతో, చేతిలో గొట్టం తుపాకీతో చూస్తేనే నవ్వొచ్చేట్టున్నదా వేషం. గత ఐదారేళ్లుగా ఆ వేషం వేస్తుండటంవల్ల ఆతన్ని తుపాకీ రాజిరెడ్డనే పిలుస్తున్నారు. ఆతని వెంట పిల్లలు పరుగెత్తుతున్నారు..

'వచ్చే వచ్చే... పాయే పాయే.. మోటర్ మీద మోటర్. బండిమీద బండి.. సైకిల్ మీద సైకిల్... సైకిల్మీద మనిషి మనిషీమీద బండి... దానిమీద నేను... నామీద మోటర్' అంటూ అస్తవ్యస్తంగా మాట్లాడుతూ అందర్నీ కవ్విస్తున్నాడు, నవ్విస్తున్నాడు.

నేనిప్పుడే విమానం దిగచ్చిన... ప్రధాన మంత్రి ఉండమన్నా ఉండలే. హైద్రాబాద్ల ముఖ్యమంత్రి ఉండమన్నా ఉండలే. అసలాల్లను లీడర్లను చేసిందెవ్వరు? నేనే మీరంత చిన్నవోతరని గిక్కడికచ్చిన.

నాకు లగ్గమెంత జోరుగైందనుకున్నరు... లగ్గమంటె లగ్గమా? ఢిల్లీనుంచి గల్లీదాక అందరచ్చిండ్రు. గింతమందికి వంటెట్ల జేసుడని చెర్లబియ్యం బోసి తూములమంట బెట్టిచ్చిన. ఇద్దరికొక్క మెతుకు చొప్పున





బొత్తపలుగు పెట్టిచ్చిన. కోమట్లకు బా మండ్లకు కోడిమాంసం బెట్టిచ్చిన... రెడ్లు, వెలుమలకు చింతపులుసుతోనన్నం బెట్టి చ్చిన.

'నాకేం పర్వమరి లేక తిప్పలకని' అంటూ రాజకీయాల్లోని కుళ్లును, దోపిడీని, సమాజంలోని అవకతవకలను తనమాటల ద్వారా వెళ్ళగక్కుతున్నాడు తుపాకీరాముడి వేషంలో రాజరెడ్డి. ఆతడు సృష్టించే హాస్యం చార్లీచాప్లిన్‌ను గుర్తుకు తెచ్చేట్టుగా ఉంది.

ఆటలతో, సాంస్కృతిక కార్యక్రమాలతో ఆరోజు ఊరంతా సందడే... అంతటా పండగ సంబరంలాంటిదే.

రాత్రి మరికొన్ని కార్యక్రమాలు చేసి బహు మతుల ప్రదానం చేసారు. ఈసారి రాత్రి కార్యక్రమాల్లో సాంబయ్య పిట్టలదొర వేషం అన్ని వేషాలనూ మించిపోయింది. రాజిరె డ్డిని మించి నటించాడు సాంబయ్య. అందరి మన్ననలనూ పొందాడు. కొత్తకొత్త హాస్యపు మాటలను జోడించి హాస్యం పండించాడు. కడుపుబ్బ నవ్వించాడు.

"సాంబయ్య ఎడ్డోడనకున్నం... చాలుగా దే''

"తుపాకి రాముడి వేషం బాగా జేసిండు''

"నోట్లె నాలుకే లేనట్టుంటడు.... గంత బాగెట్ల జేసిండు?"

"ఎంతైన చదువుకున్నోడు చదువుకున్నోడే''

తెల్లవారి సాంబయ్య గూర్చి రకరకాలు గా మాట్లాడుకున్నారు. తెల్లవారే అలెగ్జాండర్, పురుషోత్తముడి మధ్య యుద్ధమంటూ ఆడు కొని కిషన్‌రెడ్డి పురుషోత్తముడి పాత్రలో అలె గ్జాండర్ పాత్రధారి శంకరస్వామి మీదికి బండవిసిరాడు. ఆ బండ శంకరస్వామి చేతి బొటనవేలికి తాకి రక్తం కారింది. అతని తండ్రితో తిట్లుతిన్నారు పిల్లలు. ఇదంతా సాంబయ్య చాణక్యుడి పాత్రనంటూ పాఠశా లకు వెళ్ళేప్పుడు చేయించాడు. చరిత్రలో అలెగ్జాండర్ గెలిచినా పురుషోత్తమున్ని గెలి పించడమే సాంబయ్యకిష్టం. అదే అతనికా నందం.

శంకరస్వామి తండ్రితో తిట్లుతిన్న సాంబ య్యకు గణతంత్రదినోత్సవాల సంబరం లే కుండా అయింది.

అయితే సాంబయ్యలో స్వతంత్రభావా లు, స్వంత నిర్ణయాలు చేయడంలాంటివి అప్పుడప్పుడే చోటుచేసుకుంటున్నాయి.

* * *

ఆరోజు ఉపాధ్యాయ దినోత్సవం... ఉపా ధ్యాయుడిగా ఉండి భారత రాష్ట్రపతి స్థాయికె దిగిన మేధావి, తత్వవేత్త డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి జన్మదినాన్ని ఉపాధ్యాయ దినోత్సవంగా జరుపుకోవడం జరుగు తోంది. ఆ పాఠశాలలో ఆ దినాన్నే 'సెల్ఫ్‌గ వర్నమెంట్ డే' జరుపుకుంటున్నారు. ఆరోజు విద్యార్థులే ఉపాధ్యాయులుగా పాఠా లు చెప్పాలి. ఉపాధ్యాయుల విధులను నిర్వ హించాలి. హెచ్.ఎస్.సి. విద్యార్థులు బోర్డు పరీక్షకెళ్ళాలి కాబట్టి వాళ్ళను వదిలి మిగతా తరగతులకు సెల్ఫ్‌గవర్నమెంట్ డే చే యడం జరుగుతుంది. పదవ తరగతి చదు వుతున్న సాంబయ్యను హెడ్మాస్టర్ చేసారు. తమకు విద్యాబోధన చేస్తున్న ఉపాధ్యాయు లుగా ఆరోజు నటించడం, అందులో తానే ప్రధానోపాధ్యాయుడిగా ప్రవర్తించడం సాంబ య్యకెంతో థ్రిల్‌గా ఉంది. ఆనందంగానూ ఉంది. ఉన్నదాట్లోంచి మంచి పాంటు తొడు క్కొని పావుగంటముందే బడికొచ్చాడు సాంబయ్య.

అతన్తోపాటు ఆతని మిత్రులు ఆరోజు ఉపాధ్యాయులుగా చేయబోయేవాళ్ళూ ఉన్నారు. వాళ్ళంతా ఎంతో ఉత్సాహంగా సంతోషంగా ఉన్నారు. అయితే వాళ్ళు ఉపా ధ్యాయుల గదిలోకి రాగానే రాజిరెడ్డి సారు నిలబెట్టారు. కత్తెర్ల శంకరయ్యతో -

"బర్రె పాలిస్తున్నాదిర కత్తెర్లోడ?" అన్నా



డు.

"ఇస్తలేదు సార్..."

"గోకలు గుడ్లుపెడ్తున్నాయిర కత్తెర్లోడ?"

"పెడ్త లేవు సార్"

"తోట్ల కూరగాయలు కాస్తన్నాయిర కత్తెర్లోడ?"

"కాస్తలేవు సార్"

"మాకివ్వాల్సివస్తదని అన్నీ లెవ్వంటడు దొంగవెధవ?" అని తిట్టాడు సారు.

ఇతర రోజుల సంగతి ఏమైనా ఆరోజు ఆ సారలా ప్రవర్తించడం సాంబయ్యతోపాటు మిగతా పిల్లలకూ నచ్చలేదు... పిల్లలెంతో ఉత్సాహంగా స్వయంపాలనా దినోత్సవ ప్రాముఖ్యాన్ని భావిస్తుంటే ఆరోజు కోసమైనా ఉపాధ్యాయుడైన శంకరయ్యనలా అనడం వాళ్ళకు బాధాకరంగా ఉంది. ఆ సారు పాఠశాలలోనూ బూతులు తిడతాడు. ఓసారి బుక ధర్మయ్య ప్రశ్నలకు జవాబు చెప్పకుంటే.

"గాడిదకొడుక! ఎందుకురా బడికస్తున్నవు...? మీ అవ్వయ్య కడుపున చెడబుట్టినవు... బుక అమ్ముకొని బతకుపో... లేకుంటె రొండు దున్నపోతుల కొనక్కోని చెరువెనక నాగలి దున్నుకో... నీకెందుకురా చదువు?" అని తిట్టాడు.

విపరీతంగా కొట్టడం, కులాల పేర్లు పెట్టి తిట్టడం, బూతులు మాట్లాడటం నచ్చక సారును బదిలీ చేయించమని పిల్లలతో దరఖాస్తు పెట్టించాడు మల్లేశం సారు... కాని వాళ్ళ ప్రయత్నం ఫలించలేదు. హెడ్మాస్టర్ చెప్పినా వినిపించుకోడు.

సాంబయ్య కవన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఎంతో ఉత్సాహంగా వచ్చిన సాంబయ్యకా సంఘటనతో సగం ఉత్సాహం పోయింది... ఏదైమైనా ఆ సారును ఈరోజు అడుగుదామనే నిర్ణయించుకున్నాడు.

"సార్! ఈరోజు సెల్ఫ్‌గవర్నమెంట్‌డే... ఈరోజైనా తిట్టకుంటేంబోతుంది సార్!" అన్నాడు.

"అయితేందిర? ఈరోజు మీరు పంతుళ్ళ మనుకుంటండ్రా? పంతులు నౌకర్లు జేసి మేం బంగ్లాలు గట్టినం. ఇక మీరువెలగబెడుతరు తియ్యి... బతుకలేనోడు బడిపంతులు... వీళ్ళు పంతుల్లట... ఈరోజు తిట్టద్దట..." వ్యంగ్యంగా అన్నాడు ఉపాధ్యాయుడు.

ఆ మాటలతో సాంబయ్య మనసు చివుక్కుమన్నది... అయితే ఆతని మాటల్లో ఆ పసివాళ్ళకర్థంగాని నైరాశ్యముంది.

ఆ సారు స్వయంపాలనాదినోత్సవాన్ని కాని, మరే ముఖ్యమైనదినాన్ని కాని ఎప్పుడూ సీరియస్‌గా తీసుకోలేదు. అయితే ఆ దినాన్ని అలాంటి దినాలను సీరియస్‌గా తీసుకునే ఉపాధ్యాయులూ కొందరున్నారు... వాళ్ళలో ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులు గారొకరు.

"ఏమోయ్! హెడ్మాస్టర్ సాంబయ్య! ఆ సారలాగే మాట్లాడుతాడు కాని నువ్వొచ్చి నీ సీట్లో కూర్చో. మీ సార్లు లేటొస్తే లేటుమార్కు పెట్టడం మరిచిపోవద్దు'' నవ్వుతూ అన్నాడు నరహరి సారు.

"పెడతాను సార్" అని తన సీట్లో కూర్చున్నాడు. సాంబయ్య తోటి విద్యార్థి ఉపాధ్యాయులు అతనికెదురుగా కూర్చున్నారు. ప్రార్థన కూడా వీళ్ళే చేయించారు. ప్రార్థన అయిపోగానే విద్యార్థులంతా ఎవరి గదుల్లోకి వారెళ్ళిపోయారు. సాంబయ్య తన తోటి ఉపాధ్యాయులను తరగతి గదుల్లోకి పంపాడు. అన్ని గదులలో పాఠాలు జరుగుతున్నాయేమో చూసి వచ్చాడు. సాంబయ్యకు తాను ప్రధానోపాధ్యాయుడిగా ప్రవర్తిస్తుండటం గొప్పగా అనిపిస్తోంది. మళ్ళీ ఓ రౌండుకెళ్ళాడు. తమతో చదువుకున్నవాళ్ళే అయిన పిల్లలు ఉపాధ్యాయులుగా పాఠాలు చెబుతుంటే కొందరు విద్యార్థులు ఆట పట్టి




స్తున్నారు. కొందరేమో తెలివిగా ప్రవర్తించి వాళ్ళకు జవాబులు చెబుతున్నారు. మరి కొందరు బెంబేలు పోతున్నారు. నరహరిసారు గది దగ్గరకనిపిస్తే పిల్లలు ఏ మెరుగన ట్టూరుక్కుంటున్నారు. తన తోటివాళ్ళ వానర మనస్తత్వాన్ని చూసి సాంబయ్య నవ్వుకుంటు న్నాడు. పిల్లలు దేవాంతకులే అనుకున్నాడు సాంబయ్య. ఒక్కొక్క పీరియడూపూర్తవుతు న్నాయి. సాంబయ్య రెండు పీరియడ్లలో పదవతరగతికి ఇంగ్లీషు, లెక్కలు చెప్పివ చ్చాడు.

మధ్యాహ్నం రెండవ పీరియడ్ నడు స్తోంది. సాంబయ్య కా పీరియడ్ లీజర్... తొమ్మిదవ తరగతివాడైన అంజయ్య తన తరగతికే ఇంగ్లీషు వ్యాకరణం బోధించడాని కి వెళ్ళాడు. అతన్ని రోజూ పిల్లలు ఆటపట్టి స్తూనే ఉంటారు. అడవికి అందుగు చెట్టు మెత్తన, ఊరికి కోమటయినె మెత్తనన్నట్టు అంజయ్యను ఏవేవో మాటలని ఏడ్పిస్తారు. ఆ రోజు వాళ్ళకు మరింత మంచి అవకాశం దొరికింది. ఏవేవో అడిగి పిల్లలంతా అంజ య్యనేడ్పిస్తున్నారు.

"థట్ జంగ్లీ కూచో' అని తాను విన్న పాత సారు డైలాగులు వాడినా వాళ్ళు వినడం లేదు. ఆ ఒక్కరోజు కోసం ఈ నకిలీ ఉపాధ్యాయుడి మాటలు వాళ్ళు వినదలుచు కోలేదు. సమయస్ఫూర్తిగా ప్రవర్తించి వాళ్ళ ను కూర్చోబెట్టడం అంజయ్యకు సాధ్యం కావడం లేదు. తనిఖీకోసమని అటుదిక్కు పోయిన సాంబయ్య గదిలో జరుగుతున్న అల్లరిని చూసాడు. ఎంతసేపైనా వాళ్ళు వినకుంటే ఇక లాభం లేదని గదిలో కెళ్ళా డు.

"ఏమైంది? ఎందుకింత అల్లరవుతోంది?" అందర్నీ చూస్తూ అడిగాడు సాంబయ్య.

"అంజయ్య సార్ మాకు ఇంగ్లీషు చెప్పు తండు... మేమడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పన్నా వద్దా సార్?" అన్నాడో విద్యార్థి...

"జవాబులు చెప్పేది సారా? విద్యార్థు లా?" అన్నాడు సాంబయ్య.

"మాకు రాని వాటికి చెప్పద్దా?"

చెప్పుతలేడా మరి?"

"చెప్పినంక మేమెందుకడుగుతం?"

"సరే... అడుగుండ్రి... నేను చెబుతా'' అన్నాడు సాంబయ్య.

"సార్.. పులుసును ఇంగ్లీషులో ఏమంటా రు?" అడిగాడో విద్యార్థి...

కొద్ది క్షణాలాలోచించినట్లు చేశాడు సాంబయ్య.

"మీకైతే పులుసును ఇంగ్లీషులో ఏమంటారో తెలియదు కదా!"

"తెలువది సార్..."

'అయితే రాసుకోండ్రి'' అన్నాడు సాంబ య్య.

అందరూ నోటుబుక్కులు తీసారు.

"పుల్సూస్'' అని 'పి.యు.ఎ ల్.ఎస్.యు.ఎస్ అని విడదీసి చెప్పాడు సాంబయ్య.

విద్యార్థులంతా నవ్వారు.

"కాదు సార్... కాదు'' అన్నారు.

"నేను చెబుతున్నాను. అదే... రాసు కోండ్రి'' అన్నాడు...

"మరి వడ్లుపోసుకునే గుమ్ముల నే మందురు సార్?"

"'గుమ్స్' నోట్ చేసుకోండ్రి'' అన్నాడు.

వాళ్ళంతా 'హాహాహా' అని హాయిగా నవ్వారు.

మనసారా నవ్వారు.

"అంజయ్య సారు గిట్ల చెప్పుతే ఐ పోవుగద" అన్నారు.

"ఇంకేమన్నా అడుగుతారా?" అన్నాడు సాంబయ్య.

"ఇంకేం లెవ్వు సార్' అన్నారు ముక్త కంఠంతో.

తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు సాంబ

య్య. అంజయ్యకు తరగతి నప్పగించి తన గదిలో కొచ్చాడు.

ఏడో పీరియడ్‌లో మరో తరగతిలో జరిగిన అల్లరిని సమయస్ఫూర్తితో మాన్పించాడు.

ఆ రోజెంతో బాగా గడిచింది. ప్రధానోపాధ్యాయుడిగా సాంబయ్య బాగా చేశాడని ఉపాధ్యాయుల మన్ననలు పొందాడు. హెడ్మాస్టర్ అతన్ని ప్రత్యేకంగా అభినందించాడు. సాంబయ్య జీవితంలో అదో గొప్ప అనుభవంగా మిగిలిపోయింది. సాయంత్రం విద్యార్థుల, ఉపాధ్యాయుల సమావేశమేర్పాటు చేశాడు నరహరి సారు. ఆ సమావేశంలో అతడిచ్చిన ఉపన్యాసం సాంబయ్యపై ఎంతో ప్రభావాన్ని చూపింది.

ప్రియమైన విద్యార్థులారా!

సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి జన్మదినాన్ని ఉపాధ్యాయదినోత్సవంగా జరుపుకోవడం మన ఉపాధ్యాయవర్గానికే గర్వకారణం... విద్యార్థులను తీర్చిదిద్దడంలో, భావిపౌరులుగా మలచడంలో ఉపాధ్యాయుల పాత్ర ఎంతైనా ఉంటుంది. ఒక ఉపాధ్యాయుడు చెడ్డవాడైతే ఒకతరం చెడిపోతుంది. అందుకే ఏదేశంలోనైనా ఉపాధ్యాయుడి పాత్ర గురుతరమైందే.

కాని బతకలేనివాడే బడిపంతులని, బతుకనేర్చినవాడే బడిపంతులని మన ఉపాధ్యాయుల గూర్చి రకరకాల మాటలు వాడుకలో ఉన్నాయి. ఒకప్పుడు గురు శిష్య సంబంధాలు ఎంతో ఉన్నతంగా ఉండేవి. వాటికి క్రమక్రమంగా బీటలువారడం మొదలైంది. పొట్టకూటికే ఉద్యోగమన్నట్టు ఉపాధ్యాయుడు జీతం తీసుకొని చదువుచెప్పుతున్నాడని విద్యార్థులు భావించడంవల్ల ఈ పరిస్థితేర్పడుతుంది. ఏదేమైనా వీళ్ళిద్దరిమధ్య ఉండే సంబంధం కేవలం జీతం రాళ్లకే పరిమితమని భావించడం సరైంది కాదు. అయితే ఉపాధ్యాయులూ ఆర్థికంగా ఎన్నో ఇబ్బందులనెదుర్కొంటున్నారు. అట్లని పిల్లల భవిష్యత్తులతో ఆడుకునే హక్కు ఎవరికీ లేదు.

నేటి విద్యార్థులే రేపటి భారత పౌరులు... మీలోంచి రేపు ఎవ్వరేమవుతారో చెప్పలేం... ఎవ్వరేమైనా దేశాన్ని దృష్టిలో ఉంచుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఈరోజు జరిగిన స్వయంపాలనా దినోత్సవం ద్వారా మీకు ఉపాధ్యాయుల సాధక బాధకాలు కొంతైనా అవగాహనయి ఉంటాయనుకుంటాను. ఇలాంటివి ఇద్దరిమధ్య సత్సంబంధాలను నెలకొల్పుతే మంచిదే... ఉపాధ్యాయులు కాని, విద్యార్థులు కాని తమలోని చెడును దూరం చేసుకొని వీలైనంత మంచి మార్గంలో నడుద్దామని ఈరోజు ప్రతిజ్ఞ తీసుకుందాం!"

ప్రధానోపాధ్యాయుడి ఉపన్యాసం విని కరతాళ ధ్వనులు చేశారు విద్యార్థులు. ఆరోజు తానెన్నో విషయాలు నేర్చుకున్నాననుకున్నాడు సాంబయ్య.



కీలక నామ సంవత్సరం... ఆ ప్రాంతంలో ఘోరమైన కరువొచ్చింది. ఆ కరువును ధాత కరువుతో పోలుస్తున్నారు వృద్ధులు... గత పదిహేనేళ్లుగా ఆ ఊరికి ప్రాణాధారంలాంటిదైన చెరువెప్పుడూ ఎండిపోలేదు. కానా సంవత్సరం ఎండి ఎరగప్పైంది. చాలాకాలంగా చెరువెండిపోక పోవడం వల్ల పెద్దపెద్ద చేపలు దొరికాయి. ఎండాకాలంలో ఊర్నిండా చేపల వాసనే... తినేవి తిని కొన్ని వరుగల కోసం ఎండ బోసుకున్నారు. గంగపుత్రులు, తెనుగు వాళ్ళ వాడలకెళితే ఎంతో దూరంనుంచే చేపల కంపొస్తోంది. శాకాహారులైతే అటువెడితే ముక్కులకడ్డంగా బట్టలు పెట్టుకొని పోతున్నారు.

చెర్లో ఉన్న సారవంతమైన పాటిమట్టిని రైతులు తమ చేల్లోకి జారగొట్టుకుంటున్నారు.






ఎండాకాలమంతా వాళ్ళకీవిధంగా చేతి నిండా పని దొరికింది. పొలాలు, చేలు పాటిమట్టితో నాడిపోతున్నాయి.

రోహిణి ఎండ రోళ్ళుబద్దలయ్యేట్టు విపరీతంగా ఉంది. రోహిణికార్తెలో ఆ ఊళ్ళో ప్రతి సంవత్సరం రోహిణి నార్లు పోస్తారు. చెరువుకు దగ్గరున్న పొలాల్లో నారు పోసి కాలమైన తర్వాత నాట్లేస్తారు. ఈ సారి చెరువు పూర్తిగా ఎండిపోవడంవల్ల నార్లుపోయడానికి నీళ్ళులేవు. కొద్దిమంది పొలాల్లో చిన్నచిన్న బావులు తవ్వి ఏతాలు పెట్టారు. ఏతం నీళ్ళకు నార్లుపోసుకున్నారు.

మృగశిర వచ్చింది. ఆకాశం దిక్కు చూస్తా రూరివాళ్ళంతా ఎక్కడా మేఘాలు వచ్చిన జాడలు లేవు. మబ్బులైనా రాకుండానే ఆ కార్తె వెళ్ళిపోయింది. ఆరుద్రకార్తె వచ్చింది. ఒక్క చినుకు కూడా రాలలేదు. పొలాలన్నీ నెర్రెలు బాసున్నాయి. గొడ్డుగోదకు గడ్డిలేదు. చొప్పలేదు. ఏ మేతాలేదు. ఎప్పుడూ పశు

వుల మేత కొనుక్కోని ఆ ఊరి రైతులు దూర ప్రాంతాల్నుంచి 'కంట్లాం' చొప్పను, వరిగ డ్డిని ప్రియమైన ధరకు కొనుక్కుంటున్నారు. అయినా కొన్ని పశువులు మేతలేక చచ్చిపో యాయి.

గొర్రెల కాపరులు తమ గొర్రెలను బతి కించుకోవడానికై అడవి ప్రాంతమైన మంథని దిక్కు మన్నెం పోయారు. అక్కడే మూడు నెల్లున్నారు. అంతదూరం ప్ర యాణం చేయడంవల్ల మార్గమధ్యంలోనే సగానికి పైగా గొర్లు చనిపోయాయి.

పునర్వసు నక్షత్రం వచ్చింది. రెండు వర్షాలు పడ్డాయి. ప్రకృతి పులకించింది. బీడువారున్న నేల కొంత పచ్చబడింది. పశువులకు పచ్చగడ్డి పారలతో తవ్వుకొచ్చే స్తున్నారు. రైతుకు కొంత ఆశపుట్టింది. ఇకనై నా వర్షాలు పడేతాయేమోననుకున్నారు. ఆ నమ్మకంలో పెసల్లు అలికారు. మొక్కజొ న్న, పల్లీలు కూడా వేశారు. కానీ, ఆ రెండు వర్షాలతోనే వర్షాకాలం దాదాపుగా అయిపో యినట్లైంది. మొక్కలు మాడిపోయాయి. అవి భూమిపాలే అయ్యాయి. పుష్యమిగడిచి నా చెర్లోకి ఒక్క చుక్కనీరు కూడా రాలేదు. ఆ తర్వాత ఒకటిరెండు వర్షాలు పడ్డా అవి ఏవిధంగానూ ఉపయోగపడలేదు. గుట్టలు, భూములు కొంత పచ్చబడటం తప్ప ఒరి గిందేమీలేదు.

ఇక ఏతాలతో, మోటలతో సాగుచేసుకోక తప్పలేదు. చెరువు కింది పొలాల్లో చిన్నబా వులు తవ్వి ఏతాలు పెట్టారందరు.

చిలుకయ్యకీ పరిస్థితి చూస్తుంటే ఆందోళ నకరంగా ఉంది. ఇలాంటి ఘోర వర్షాభావం ఈమధ్య చాలాకాలంగా చూడలేదు చిలుక య్య. కనీసం పెద్ద దినుసైన వడ్లైనా పండించుకోవాలని రెండుచోట్ల ఏతం పెట్టా డు చిలుకయ్య. ఒక్కచోట చిలుకయ్య ఏతంపోస్తే రెండోచోట సాంబయ్యకు పోయక తప్పడంలేదు.

సాంబయ్య ఇప్పుడు బోర్డు పరీక్షకు కూర్చోవాలి. ఆతడిప్పుడు హెచ్.ఎస్.సి. చదువుతున్నాడు. బాగా చదువుకోవాలని ఆతని ఆరాటం. కాని ఈ కరువుకాలంలో వ్యవసాయప్పనులు చేయక తప్పడంలేదు. ఇంటి పరిస్థితిని చూస్తున్న సాంబయ్య తండ్రి అప్పగించిన పనిని చేయడానికే నిర్ణ యించుకున్నాడు. తెల్లవారి చుక్క పొడవక ముందే లేచి తండ్రితో పాటు పొలం దగ్గరికె ళ్తున్నాడు. ఏతం పోస్తున్నాడు. అయితే ఎంతసేపు ఏతం పోసినా ఒక్కమడైనా తడ వడం కష్టమవుతుంది. అటు చివరికి నీళ్లు పోయేసరికి మొదట పారిన పొలం ఎండు తుంది. దీన్ని తడుపుతే అది ఎండుతుంది. సాంబయ్య చేతులకు కాయలు కాస్తున్నాయి. చదువుకునే కొడుకును చూస్తుంటే చిలుక య్యకు బాధగా ఉంది. జాలిగా ఉంది. కాని పనిచెప్పక తప్పడంలేదు. కనీసం ఒక్క పూట తిండికైనా పండించుకోవాలని చిలుక య్య తపన.

సాంబయ్య బారెడు పొద్దెక్కేవరకు, ఏతం పోస్తాడు. ఇంటికెళ్లి గబగబా పనులు ముగించుకొని బడికెళ్తాడు. బడినుంచి వచ్చింతర్వాత మళ్ళీ ఏతం పోయడానికి పోవాలి. ఏమైనా సమయం దొరుకుతే చదు వుకోవాలి. వ్యవసాయ కుటుంబాల్లో చదువు కుంటున్నా పనిచేయడం తప్పకున్నా ఈ సంవత్సరం కష్టపడినట్టుగా సాంబయ్య ఎప్పుడూ కష్టపడలేదు. వ్యవసాయదారుడి బతుకుల్లోని విషాదం, వాళ్ళ కష్టాలు ఆ సంవత్సరం సంపూర్ణంగా అవగాహన కొ చ్చాయి సాంబయ్యకు. ఏటికేతం బెట్టి వె య్యిపుట్లు పండించినా ఎన్నడూ మెతుకెరు గని బతుకులంటే ఇవేననుకున్నాడు సాంబ య్య. సాంబయ్య తండ్రి ఎన్నోసార్లు దగ్గర కూచోబెట్టుకొని చెప్పిన విషయాలను జ్ఞా పకం చేసుకుంటున్నాడు..

ఆ ఊళ్లో మిగతా వస్తువుల సంగతెలా




ఉన్నా బియ్యం కొనుక్కునేవాళ్లు చాలా తక్కువ. ఆ సంవత్సరం ఎవరెంత ఏతంబోసి పంట పండించినా రెండు నా గండ్ల వ్యవసాయమున్న రైతు కూడా బియ్యం కొనుక్కోవాల్సి వచ్చింది. అదీ చవకబియ్యం. తాను పండించిన పంటను తినడానికి అలవాటుపడిన రైతుకు చవకధర దుకాణాల్లో బియ్యం కొనుక్కొని తినడం గొడ్డలిపెట్టులాంటిదే.

సాంబయ్య వాళ్లింట్లో చాలాకాలంగా ఒక్కపూట మొక్కజొన్న గడుకన్నం మరో పూట వరన్నం తినే అలవాటుంది. అయితే ఆ సంవత్సరం చాలాసార్లు రెండుపూటలా గడుకన్నం తినక తప్పడంలేదు. శారీరక శ్రమ పెద్దగా లేనప్పుడు గడుకన్నం తింటే జీర్ణమయ్యేది కాదు. కానిప్పుడు గడుకన్నం సాంబయ్యకు చాలా సులభంగా జీర్ణమవు తోంది.

వానాకాలంలోనూ ఎండిపోతున్న చెరువు ను చూస్తూ కళ్లనీళ్లు తీసుకుంటున్నారు ఊరి వాళ్లు. అది వాళ్లెప్పుడూ ఊహించని విషయం.

"పాపం పెరిగిపోయింది. అందుకే ఈ కరువు'' — అంటూ

రకరకాలుగా చెప్పుకుంటున్నారు కరువు గూర్చి.

సాంబయ్య, చిలుకయ్య ఎంత ఏతం పోసి పండించినా వానాకాలం పంట 25 కుంటల భూమిలో పదిగిద్దెల వడ్లు కూడా పండలేదు. ఒక్కరి రోజుకూలీ లెక్కగట్టినా అంతకంటెక్కువే అవుతుంది.

రెండోపంటకు మళ్ళీ ఏతంబెట్టి దున్నడా నికి సన్నాహాలు చేస్తున్నాడు చిలుకయ్య. వేసవిపంట పొలం పారించడం మరింత కష్టమవుతుందని బాధపడ్తున్నారు సాంబ య్య, చిలుకయ్యలు. ఓ దిక్కు పరీక్షలకొరకు చదువు... మరోదిక్కు ఏతంపోసే పనితో సతమతమవుతున్నాడు సాంబయ్య.

ఈమధ్య 'జైతెలంగాణ' ఉద్యమం ప్రా రంభమైంది. మొదట్లో పట్టణాలకే పరిమిత మైన ఉద్యమం క్రమక్రమంగా గ్రామాల్లోకీ వ్యాపించింది. పాఠశాలలు మూసివేయాలని అల్లరి ప్రారంభమైంది. ఇందులో లాయర్లు, ఇంజనీర్లు, రాజకీయనాయకులు, డాక్టర్లు అంతా పాల్గొంటున్నారు. పట్టణాల్లో విద్యా ర్థుల పాత్రే ప్రధానంగా ఉంది. విద్యార్థులను రెచ్చగొడుతున్నారు నాయకులు.

'చాలాకాలంగా తెలంగాణాకు అన్యాయం జరుగుతోంది. మొదట్నుంచీ అభివృద్ధి చెందిన ప్రాంతం కోస్తా.... వీళ్ళే రాజకీయాధికారం చేతుల్లో పెట్టుకొని వాళ్ల ప్రాంతాన్ని అభివృద్ధి చేసుకుంటున్నారు.. మనకు రావాల్సిన నిధులను అటు మర్లించు కుంటున్నారు. ఉద్యోగాల్లోనూ మనకన్యాయ మే జరుగుతోంది. కోస్తానుంచి ఎంతోమంది వచ్చి మన దగ్గర ఉద్యోగాలు చేస్తున్నారు. అందువల్ల మనవాళ్ల కుద్యోగాలు దొరకడంలే దు. ఈ ప్రాంతం కానివాళ్లను ఇక్కణ్ణుంచి తరిమివేయాలి. అది ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడినప్పుడే సాధ్యమవుతుంది.

జైతెలంగాణ... జైజై తెలంగాణ...

తెలంగాణా జిందాబాద్... బ్రహ్మానందరె డ్డి డౌన్ డౌన్! ఇలా

తెలంగాణా ప్రాంతమంతటా ఉద్యమం నిప్పు రాజుకుంది. ఇందులో ముఖ్యంగా విద్యార్థులే ప్రధానపాత్ర వహిస్తున్నారు.

బస్సులకు నిప్పంటించడం... రైళ్లనా పడం, వీధిదీపాలు పగులగొట్టడం జరుగు తోంది. ఇప్పుడు ప్రతి ఊరికీ ఒకటి రెండైనా వార్తాపత్రికలు వస్తుండటంవల్ల ఎక్కడేం జరుగుతోందో తెలుస్తున్నాయి. ప్రతిరోజూ సాయంత్రాల్లో పంచాయతీ రేడియో దగ్గర జనం గూమిగూడి వార్తలు వింటున్నారు.

విద్యార్థులెవరూ పాఠశాలలకు పోవ డంలేదు. ఏ ఊళ్లోనైనా బడి నడుస్తున్నట్టు

తెలిస్తే ఆ బడి విద్యార్థి యూనియన్‌కు ప్రెసెడెంట్, సెక్రటరీలకు గాజులు, కుంకుమ, పాతచెప్పులు పంపిస్తున్నారు.

తెలంగాణ సాధించనిదే విశ్రమించేది లేదని రక్తతిలకం దిద్దుకుంటున్నారు. విద్యార్థుల్లో ఆవేశపూరితమైన చర్చలు ప్రారంభమైనాయి.

ఈరోజు కరీంనగర్‌లో మీటింగ్...
మరోరోజు ఖమ్మంలో మీటింగ్...
ఇంకోరోజు మెదక్‌లో సమావేశం...

చలో హైదరాబాద్... చలో నిజామాబాద్... చలో వరంగల్... రాతలతో గోడలు నింపుతున్నారు.

ప్రాణాలైనా అర్పిద్దాం. తెలంగాణ సాధిద్దాం... జైతెలంగాణ... జైజై తెలంగాణ.

ఎక్కడ చూసినా ఇవేరాతలు. ఎవరినోట విన్నా తెలంగాణ నినాదమే. బస్సులెక్కి విద్యార్థులు టికెట్లడుగుతే 'జై తెలంగాణ' అంటున్నారు. బలవంతం చేస్తే గాలి తీసేయడం, బస్సు అద్దాలు పగులగొట్టడంలాంటి పనులు చేస్తున్నారు. ఉద్యమం పేరుమీద నానాభీభత్సం సృష్టిస్తున్నారు.

ఉస్మానియా యూనివర్శిటీ క్యాంపస్‌లో పోలీసుకాల్పులు, నలుగురు విద్యార్థుల మృతి... ఇంజనీరింగ్ విద్యార్థి మరణం. ఖమ్మంలో ఇద్దరు విద్యార్థుల మృతి... వరంగల్‌లో కాల్పులు... మెడికల్ విద్యార్థి చావు.

ఇలాంటి వార్తలతో విద్యార్థులు మరీ రెచ్చిపోతున్నారు. ప్రభుత్వ ఆస్తులు ధ్వంసమవుతున్నాయి.

రోజూ కొందరు విద్యార్థులు చనిపోతూనే ఉన్నారు. రోజురోజుకూ ఆందోళన ఉధృతం కావడంవల్ల అన్ని పాఠశాలలు, కాలేజీలు మూసివేశారు.

హైదరాబాద్‌లోనూ, ఢిల్లీలోనూ ప్రత్యేక రాష్ట్రం గూర్చి చర్చలు జరుగుతున్నాయని వార్తలొస్తున్నాయి.

మరోదిక్కు విద్యార్థులు రెచ్చిపోతూ కోస్తా ప్రాంతంనుంచి వచ్చి ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళ ఇండ్లను ధ్వంసం చేస్తూ వెళ్లిపోయేట్టు చేస్తున్నారు. ఇదే అవకాశంగా తీసుకొని తమకు పడని వాళ్లపై పగతీర్చుకుంటున్నారు.



రెండు సంవత్సరాలుగా ఆ ఊళ్లో గుంటూరుజిల్లానుంచి వచ్చిన సుబ్బారావు కుటుంబం కూలిపనులు చేసుకుంటూ బతుకుతున్నారు. శ్రీరామ్‌సాగర్ కాలువలు తవ్వడానికి కూలీలను అప్పుడప్పుడు సరఫరా చేసేవాడు. ఆ కుటుంబంమీద దాడిచేసి వాళ్ళమ్మాయిని నానా రకాలుగా అవమానించారు. వాళ్ళందర్నీ కొట్టారు. వాళ్లు వెంటనే ఊరు విడిచి వెళ్లిపోయారు. పక్క ఊళ్లో పని చేస్తున్న రంగారావు సారు ఇంట్లోకెళ్లి ఫర్నీచర్ ధ్వంసం చేశారు. సారంటే పడని వాళ్లు అతన్ని కొట్టారు. వాళ్లూ ఊరు వదిలి పోక తప్పలేదు. తెలంగాణా ప్రాంతంలో ఇలాంటి సంఘటనలెన్నో జరుగుతున్నాయి.

ఇదంతా ఏంటో సాంబయ్యకర్థం కావడంలేదు. విశాలాంధ్ర గూర్చి విన్నాడు. ఆంధ్రప్రదేశ్ అవతరణ గూర్చి పుస్తకాల్లో చదివాడు. తెలుగువాళ్లకోసం రాష్ట్రం గూర్చి పొట్టి శ్రీరాములు ప్రాణత్యాగం గూర్చి చదివాడు. ఇన్ని చేసి సాధించుకున్న రాష్ట్రంలో మళ్లీ ప్రత్యేక రాష్ట్రమేంటో అతనికర్థం కావడంలేదు. ఇలా ఎందుకు జరుగుతోందో అత




నికి తెలియడంలేదు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా ఇలా ఎందుకు జరుగుతోంది? రాష్ట్రంలోనే మళ్లీ ప్రత్యేక రాష్ట్రమేంటి? అభివృద్ధి విషయంలో ఇలా పక్షపాత ధోరణి ఎందుకుంటుంది? తనను తానే అనేకసార్లు ప్రశ్నించుకున్నాడు సాంబయ్య.

అయినా అందరితోపాటు సాంబయ్య కూడా 'జై తెలంగాణా ఉద్యమం'లో పాల్గొన్నాడు. రెండుమూడుసార్లు తోటి విద్యార్థులతోపాటు కరీంనగర్, వరంగల్ పోయొచ్చాడు. కొన్ని విషయాల గూర్చి తెలుసుకున్న సాంబయ్య ఒక్కోసారి ప్రత్యేక తెలంగాణా అవసరమేమో అని కూడా అనుకోకపోలేదు. కాని తెలుగువారందరికీ ఒక రాష్ట్రం అనే విశాలాంధ్ర దృక్పథాన్ని పుస్తకాల్లో చదివిన సాంబయ్యకు ప్రత్యేక రాష్ట్రం అనేదాంట్లో ఏదో అపశ్రుతి కనబడుతోంది.

ఏదేమైనా, ఈ ఆందోళనవల్ల సాంబయ్యకు కొంత తెరపి దొరికిందనే చెప్పవచ్చు. అటు వ్యవసాయప్పనులు, ఇటు చదువుతో సతమతమవుతున్న సాంబయ్యకు బడి మూతబడటంవల్ల చదవడం తప్పింది. ఇప్పుడాతడు పూర్తిగా వ్యవసాయప్పనులకే అంకితమవుతున్నాడు. ఎవరైనా తీసుకెళితే అపుడప్పుడు కరీంనగర్ పోతున్నాడు. ఆ ఊరికి రోడ్డు పడ్డా ఇంకా బస్సు రావడంలేదు. మొన్నమొన్ననే కరెంటొచ్చింది. కాని అది వ్యవసాయప్పనులకే ఉపయోగమైంది. ఓ నాలుగైదు ఇండ్లలో మాత్రమే కరెంటు తీసుకున్నారు.

వేసంగి పంటకోసం ఏతం పోయడం, ఎడ్లను మేపుకురావడం, ఇతర పనులు చేస్తూ కాలం గడుపుతున్నాడు సాంబయ్య. ఓదిక్కు దుర్భరమైన కరువు, మరోదిక్కు పాఠశాలల బందు. సాంబయ్యకు పరిస్థితంతా గజిబిజిగానూ, భయంగొలిపేదిగానూ కనబడుతోంది. అతనికేం చేయాలో తోచడంలేదు. చూస్తూండగానే వేసవి వచ్చేసింది. ఇప్పుడు హెచ్.ఎస్.సి. పరీక్షలు కావాల్సిన సమయం. ఈ పరీక్షలైన తర్వాత కాలేజీలో చదవాలనుకున్న సాంబయ్యకు పరీక్షలయ్యే సూచనలే కనబడటంలేదు. ప్రత్యేక రాష్ట్రం మాటేంటోకాని చదువు పాడైపోతుందని సాంబయ్యకెంతో బాధగా ఉంది.

ఓరోజు చిలుకయ్య సాంబయ్యను దగ్గర కూర్చోబెట్టుకొని "ఎట్ల బిడ్డా! ఈ లొల్లి తగ్గేటట్టు లేదు. చదువులు పాడుగావట్టె" అన్నాడు.

"ఏం జెయ్యాలె బాపు? ఓ సంవత్సరం వృథా అయిపోయేట్టుంది"

"బళ్లు ఎప్పుడు మొదలైతయో తెలువది. ఇప్పుడేం పని లేదుగదా! పట్వారి లెక్కలు నేర్చుకో. పెద్దపల్లి దొరదావతన్. ఈనె ముసలోడైందుకదా! ఎవ్వలకన్న పట్వారీగిరి ఇయ్యాన్నని చూత్తాండట దేశ్‌ముఖ్. నువ్వైతే పని నేర్చుకో. దేశ్‌ముఖ్ నడుగుదాం. నువ్వు షారేనైతివి. సర్పంచితోనంటె దొరకు చెప్పుతనన్నడు"

ఇంకా చదువుకోవాలనున్న సాంబయ్యకు ఆ పని దొరికినా చేయడం ఇష్టంలేదు.

"నేను చదువుకుంటన్నగద బాపు. ఆ పనెందుకు?"

"ఆర్నెల్లాయె బడిలేక. ఇంకెన్ని రోజులైతదో తెలువది"

"దానికి నేనేం జెయ్యాలె? ఆ లెక్కలు పెద్ద కష్టమేంగాదు. కాని నాకా పని ఇష్టంలేదు. నువ్వే వాళ్లు దొంగలని ఎన్నోసార్లు చెప్పినవు. ఆ దొంగలెక్కలే నేర్చుకొమ్మంటన్నవు?"

"నిజమే కని బతుకన్నంటె ఏదోటి జెయ్యాలెగద! బళ్లు మొదలైనా ఊళ్లె చదువైపోతే కరీంనగర్‌ల చదివించుడు నానుంచైతదా? చదువుకున్నోనివి నువ్వేం ఎవుసం జేసి బతుకుతవా?"

"ఎందుకు జెయ్య బాపు? నేనైతే చదువు

కుంట. నీకు ఇక్కడ ఖర్చులు వెళ్లకుంటె నేనక్కన్నే ట్యూషన్లు జెప్పుకుంట చదువు కుంట. లేకుంటె ఓ దుకాణంలో సాయంత్రాల్లో పనిజేస్త''

కొడుకు మాటలకు చిన్నబుచ్చుకున్నాడు చిలుకయ్య.

"ఏం మాట్రల సాంబన్న గవ్వి? సరె... బళ్లు మొదలైనవరకు సూత్తాంకని నువ్వైతె పట్వారి పని నేర్చుకో. అటెనుక నువ్వు చెయ్యకున్నా మంచిదేకని పనస్తె చెడిపోత దా?"

సరేనన్నాడు సాంబయ్య.

తెల్లవారి పట్వారీ ఇంటికెళ్లాడు. పట్వారి సాంబయ్య వెళ్లేసరికి చాపమీద కూర్చొని దత్తురం ముందుపెట్టుకొని 'ఒకటి... రొండు... పది... ఎనభై....' అంటూ లెక్కలు చేస్తున్నాడు. కళ్లద్దాల సందుల్లోంచి సాంబ య్యను చూసి

"నువ్వార సాంబయ్య! మీ నాయిన్న తోలిండా? మీ నాయన్నకు బాగా పేక్ష! అటు చదువు రావాలి ఇటీ పనులన్నీ నేర్చుకోవాలి. సరె... నాదేం బోయింది? మా నేర్పుత తియ్యి. దంచినమ్మకు బుక్కిందే కూలని నీకేమిచ్చేది లేదు. నేను చెప్పిన పని చె య్యాలి'' లోపల చెబుదామని లేకున్నా ఊళ్లో క్రమక్రమంగా వస్తున్న మార్పులను దృష్టిలో పెట్టుకొని అన్నాడు వెంకటేశ్వ రరావు.

"సరే పంతులు...." అని చాపమీద కూర్చున్నాడు సాంబయ్య. కొన్ని వందల పేపర్లు వేసి కుట్టిన పొడవైన 'దత్తురం', ఓ రూళ్ల కర్ర, పెన్సిల్ సాంబయ్య ముందుకు తోశాడు పట్వారి.

"దీన్నిండా గీతలు కొట్టు. పేజీకి యాభై లైన్లుండాలి'' అన్నాడు.

దాన్ని చూసేసరికే భయమైంది సాంబ య్యకు. ఇదేం పనన్నట్టుగా పట్వారి దిక్కు చూశాడు.

"పాకాల చెరువెనుకున్న పొలాలను చె రువు కట్టెక్కి చూసిందటో దున్నపోతు. ఇన్ని పొలాలను నేనే దున్నాలని బెంగటీ లిందట. రపీమని గుండాగి చచ్చిందట. మెల్లమెల్లగ గీతలు కొడితే పది రోజుల్ల మా ఐపోతది పని. నువ్వేం భయపడకు. ఇంకొంచెం ఆలస్యమైనా మంచిదే కాని వంకర పోవద్దు. తెల్సిందా?

చదువులో చురుకైనవాడైన సాంబయ్యకు ఇలాంటి పనులంటే చిరాకు. పట్వారీనేమన లేక పని ప్రారంభించాడు సాంబయ్య.

"మెల్లగ కొట్టు గీతలు. వంకర పోవద్దు. ఈ కాలపు పోరగాండ్లకు ఓపికే ఉండదు. నేనైతే ఇలాంటివి నూర్లకొద్ది పుస్తకాలకు గీతలు గొట్టిన... రాసిన"

పట్వారేమంటాడోనని భయపడుతూ మె ల్లమెల్లగా, సాధ్యమైనంత చక్కగా వచ్చేట్టు గీతలు కొడ్తున్నాడు సాంబయ్య. రెండు పేజీ లు పూర్తవడానికి అరగంట పైన్నే పట్టింది. ఆ తర్వాత చూసి "యాస గీతేది?" అన్నాడు పట్వారి.

"మీరు చెప్పలేదు గదా పంతులు'' అన్నాడు సాంబయ్య.

"అన్నీ చెబుతరారా? ప్రతి పేజీకి యాసగీ తుంటుందని తెలియదా? చదువుకున్నోడట చదువుకున్నోడు. మా కాలంలో నాలుగో తరగతి చదివినోడు భారతం, భాగవతం, రామాయణం అన్నీ తప్పులు పోకుండా చదివి తాత్పర్యం చెబుతాడు. మీరు న్నారెందుకు? ఒక్క పద్యం కూడా తప్పులు పోకుండా చదువలేరు''

పట్వారి మాటలకు సాంబయ్యకు కోప మొస్తోంది.

"అట్లేం కాదు పంతులూ. నేనేపద్యమైనా చదువుతా''

"మా చదివినవు తియ్యి. ఎవ్వడు పడితే వాడు చదువుకుంటే చదువురావడానికిదేమ న్న మట్లె బొర్లుడా? చేపలు పట్టుడా?"




సాంబయ్యకా మాటలు నచ్చడంలేదు.

సాంబయ్య ఈమధ్య వక్తృత్వ పోటీల్లో నూ పాల్గొంటున్నాడు. ఊళ్లలో అప్పుడప్పుడే తలెత్తుతున్న తిరుగుబాటు ధోరణులు, మల్లే శంసారు హేతువాద ప్రభావం, ఉధృతంగా సాగుతున్న తెలంగాణ ఉద్యమ ప్రభావం సాంబయ్యలోని భయాలను కొంత కొంతగా దూరం చేస్తున్నాయి. పోగా తెలుగన్నా, లెక్క లన్నా సాంబయ్యకు విపరీతమైన అభి మానం. పంతులు మాటలు విని మౌనంగా ఉండలేకపోయాడు సాంబయ్య.

"పంతులుగారూ! నేనేపద్యమైనా చదువు తాను. చదువుకోవడానికి కులాలే కావాల నడం బాగాలేదు'' అన్నాడు.

"మా చదివినవు తియ్యి'' అని తన పక్కనే ఉన్న కాళహస్తీశ్వర శతకాన్ని తీసి కఠినంగా ఉన్న ఓ పద్యాన్ని చూపాడు. "ఈ పద్యాన్ని చదవడానికి ఒక్క బ్రాహ్మణులకైతే తప్ప నోరే తిరగదు. మద్యం, మాంసాలు తినే శుద్దరోల్లకు ఇవి చదువడం రాదు'' అన్నాడు వెంకటేశ్వరరావు.

ఆ మాటలు సాంబయ్యకసలే నచ్చలేదు. పోగా తాను అత్యధికంగా ప్రేమించే తన మాతృభాషలోని పద్యం బ్రాహ్మణులకొక్కరికే చదువొస్తాదనడం ఆతనికి బాధాకరంగా ఉంది. ఏమైనాసరే ఈ విషయాన్ని ఛాలెంజ్ గా తీసుకోవాలనుకున్నాడు.

"పంతులుగారూ! మీ కొడుకులిద్దర్నీ పిలువుండ్రి. అదుగో మన పూజారి కొడుకు శాస్త్రి పోతున్నాడు. అతన్ని పిలువండి. ఈ పద్యాన్ని మా నలుగురితో చదివించండి. ఎవరు బాగా చదువుతారో తేల్చండి'' అన్నాడు సాంబయ్య.

శర్మను పిలిచాడు. ఒక్క వెంకటేశం తప్ప చదువులో తనతో పోటీకి నిలిచేవాళ్ళెవరూ లేరని సాంబయ్యకు తెలుసు.

మొదట ఆ ముగ్గుర్ని పద్యం చదవమన్నాడు పట్వారి. అది చదవడానికి తటపటాయించారు వాళ్లు. అతికష్టంగా ఐదారు తప్పులతో చదవగలిగారు. ఇప్పుడు సాంబయ్య వంతొచ్చింది. సాంబయ్య స్పష్టంగా, ఒక్క తప్పు కూడాపోకుండా ఒత్తులు, కామాలతో సహా దృష్టిలో పెట్టుకొని లయబద్ధంగా చదివాడు.

పట్వారి నోరు తెరిచాడు.

"మిగతావాళ్లు ముగ్గురు బ్రాహ్మలే. నేనొక్కణ్ణే కాదు'' అని ఇప్పుడేమంటారు? అన్నట్టుగా చూశాడు సాంబయ్య.

"నువ్వు చదువులో హుషారే. నీ గురించి కాదు నేం జెప్పేది. కాని బ్రాహ్మణుడో, బ్రాహ్మణాంశ ఉన్నవాడో ఐతే తప్ప సంస్కృత పదాలతో కూడిన పద్యాలను దోషాలు లేకుండా చదువలేడు''

ఆ మాటల్లోని దుర్మార్గాన్ని అర్థం చేసుకున్నాడు సాంబయ్య. అతని పసిహృదయం గాయపడింది. పట్వారీకి సరైన సమాధానం చెప్పి నోరు మూయించాలనుకున్నాడు.

"నిజమే పంతులుగారు. అయితే పద్యాలను బాగా చదువరానోల్లు, సంస్కృత పదాలను మంచిగ ఉచ్చరించరానోల్లు బ్రాహ్మలకు పుట్టలేదన్నట్టేనా...?"

ఆ మాటలు విని నోరు తెరిచాడు పట్వారి. ఒంటినాగలెవుసం చేసుకుంటూ బతికే చిలుకయ్య కొడుకు ఊరికే పట్వారైన తనతో ఇలా మాట్లాడటం వెంకటేశ్వరరావుకు మంటగా ఉంది. 'ఊరు చెడిపోతోంది' అనుకున్నాడతను. కాని, సాంబయ్య నేమనడానికీ అతని దగ్గర కారణాలు లేవు.

"కాదురా సాంబయ్య! ఈరోజుల్లో ఎవ్వరైన చదువుకుంటున్నరు. వచ్చిందిగద మనకు ససంత్రం. ఆ గాంధిమహాత్ముడు పుట్టి దేశాన్ని పాడుజేసిండు. అందర్ని చంక కెక్కించుకున్నడు. అందుకే గిట్లయితంది''

జుట్లు ముడేస్తూ బతుకుతున్నా అన్యాయంగా అమాయకుల దగ్గర డబ్బులు వసూ

లు చేస్తూ బతుకుతున్నా, విపరీతమైన ఖర్చు, కొడుకుల కొచ్చిన దురలవాట్లు, ఏ పనీ చేయకుండా తిరగడం, ఆడంబరాలు, దెబ్బతింటున్న వ్యవసాయాలవల్ల అతని ఆస్తి క్రమక్రమంగా తగ్గుతోంది. ఇంకొద్దిరోజు లైతే ఉన్న బాకీలకిందికి మరింత భూమి పోయే అవకాశముంది.

చింత చచ్చినా పులుపు చావలేదన్నట్టు మాట్లాడుతున్న పట్వారీని చూస్తుంటే సాంబయ్యకు అసహ్యమేస్తోంది.

ఆ ముగ్గురూ వెళ్లిపోయారు.

తలవంచి గీతలు కొడుతుండటం పరమ బోర్‌గా ఉంది సాంబయ్యకు. "పంతులుగారు... నాకు లెక్కలు చెప్పండి. గీతలు కొట్టుడేంపని?"

వీడికా నేను లెక్కలు చెప్పేది? చెబితే తన కొడుక్కు చెబుతాడు. తన లెక్కలు అందరికీ వస్తే తనకేం విలువుంటుంది? వీన్నిక ముందు రాకుండా చేయాలి తనలో తాననుకున్నాడు.

"పని రావాలంటే చెప్పినట్టు వినాలి. ఆ దత్తురం నిండా గీతలు కొట్టినంకనే ఏ లెక్కలైనా చెప్పడం..." అన్నాడు పట్వారి.

ఓపిగ్గా రెండురోజులు గీతలు కొట్టాడు సాంబయ్య. అయినా వెంకటేశ్వరరావు ఏవో వంకలు పెడుతూనే ఉన్నాడు. పోగా దారి వెంటపోతున్న స్త్రీలను పిలిచి పరాచికాలాడటం, బూతుమాటలు మాట్లాడటం, కించపరచడం లాంటివి సాంబయ్యకసలే నచ్చడం లేదు. తన తండ్రి అప్పుడప్పుడు తాగినా తాగుబోతులపై, పేకాటడేవారిపై, ఇలా స్త్రీలనవమానించేవారిపై సాంబయ్యకు సదభిప్రాయం లేదు. తండ్రెంత బలవంతం చేసినా ఇక పట్వారి ఇంటికి పోనని తెగేసి చెప్పాడు సాంబయ్య.

జూన్ వచ్చినా పాఠశాలలు తెరువలేదు. పరీక్షలే కాలేదు. ఉద్యమం ఇంకా నడుస్తూనే ఉంది. నాయకుల ఆవేశపూరిత ఉపన్యాసాలు, విద్యార్థుల బలిదానాలు సాగుతూనే ఉన్నాయి.

ఈసారీ సమయానికి వర్షాలు పడలేదు. గత సంవత్సరంకంటె కొంత మెరుగే అయినా ఇప్పుడూ కరువే.

సాంబయ్య తండ్రితోపాటు వ్యవసాయ పనులు చేస్తూ కొన్ని పాఠ్యేతర పుస్తకాలు చదువుతున్నాడు. పంచాయతీ గ్రంథాలయంలోకి కొన్ని పుస్తకాలు తెప్పించారు. అవన్నీ తీసుకొని చదువుతున్నాడు సాంబయ్య. టాగూర్ రచనలు కొన్ని చదివాడు. శరత్ రచనలూ చదివాడు. కొన్ని తెలుగు నవలలూ చదివాడు. విశ్వనాథ పుస్తకాలూ చదివాడు. డిటెక్టివ్ నవలలు కూడా బాగానే చదివాడు. తీరిక సమయంలో ఏది దొరికితే అది చదివాడు. ఈ కాలంలోనే 'శేషప్రశ్న' నవల చదివాడు. రెండుసార్లు చదివినా అందులోని తాత్వికత అర్థం కాలేదు సాంబయ్యకు. ఇతర పుస్తకాలు చదవడంవల్ల కొంత కొంత లోకజ్ఞానం అలవడుతోంది సాంబయ్యకు. పెళ్లి చేస్తానన్న తల్లిదండ్రులకు ఇప్పుడెట్టి పరిస్థితిలోనూ చేసుకోనని ఖచ్చితంగా చెప్పేశాడు సాంబయ్య.

ఈ సంవత్సరకాలంగా దొరికిన విశ్రాంతి గడించిన అనుభవాలు... ఇంతకాలంగా చూసిన జీవితం, తండ్రి బతుకు, ఊళ్ళో జరుగుతున్న సంఘటనలు, చదువుతున్న పుస్తకాలు సాంబయ్యలో ఎన్నో ఆలోచనలను కలిగిస్తున్నాయి. గ్రామాల్లో వస్తున్న మార్పులు, క్లిష్టతరమవుతున్న ఆర్థిక స్థితిగతులు మననం చేసుకుంటున్నాడు సాంబయ్య.

ఊళ్లో చదువుకున్న పడుచువాళ్లు తయారవుతున్నారు. ఇప్పటికీ చాలా ఇండ్లలో రేడియోలు లేవు. ఎందుకో కాని చిన్న చిన్న వ్యవసాయాలు దెబ్బతింటున్నాయి. మరోదిక్కు కొందరు కాపు కుటుంబాలవాళ్లు వ్యవసాయాన్నే నమ్ముకుని బతుకుతున్నవాళ్లు ఆర్థికంగా కొంచెం మెరుగవుతున్నారు. కొంతమంది దొరల వ్యవసాయాలు కూడా




సరిగా నడవడంలేదు. కరణం పంతులు లాంటి వాళ్ళ భూములు అమ్ముడుపోతు న్నాయి. కొందరు దొరలు పట్టణాల్లో ఇండ్లు కట్టుకుంటున్నారు. కొండల్‌రెడ్డి కూడా కరీంనగర్‌లో ఇల్లు కట్టాడు.

జరుగుతున్న మార్పులు సాంబయ్యకు జ్ఞాపకం వస్తున్నాయి. 'కర్నపొడి పగకాల్లెకు పోయినా తీరది. తను ఉన్నప్పుడు జుట్లు ముడేసి బతికిన కర్నపయినె చచ్చిపోయేట ప్పుడు పొలిమేర రోడ్డుమీద కాలెయ్యమన్న డు. దాంతోని రెండూర్లనడుమ కొట్లాట' తండ్రి చెప్పిన మాటలను మననం చేసుకు న్నాడు సాంబయ్య.

తన తల్లిదండ్రులు తనకొరకెంతో కష్టప డుతున్నారు. ఈ వ్యవసాయాల్లో పొట్టనింపు కోవడమే గగనమవుతుంది. రోజూకూలి పడటం కూడా కష్టంగానే ఉంది. తనపై తండ్రి ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. తాను మరింత బాగా చదువుకొని మంచుద్యోగం సంపాదించుకొని తండ్రి కష్టాలను దూరం చేయాలి. జీవితమంతా మట్టిలో మట్టయి పనిచేస్తున్న తన తల్లిదండ్రులను తానుద్యోగై సుఖపెట్టాలి. వాళ్లు కాలుకిందపెట్టకుండా చూడాలి. కాని ఈ ఉద్యమం ముగిసేదెప్పు డు? చదువులు సాగేదెప్పుడు?

సాంబయ్యలో ఎన్నో ఆలోచనలు.

పొట్టచేతబట్టుకొని వచ్చిన సుబ్బారావు కుటుంబాన్ని, రంగారావు సారును ఉద్యమం పేరుమీద అవమానించి పంపించడం జ్ఞా పకం వచ్చి సాంబయ్య హృదయం భార మైంది. అలాగే బతకడానికెళ్ళిన పద్మశాలీ లను భీవండి, షోలాపూర్, బొంబాయిల నుండి పంపిస్తే వాళ్ళ గతేమవుతుంది? అను కున్నాడు సాంబయ్య.

బావకుద్యోగమైన తర్వాత తామిచ్చిన కట్నం తక్కువనిపించింది. తేపకోసారి చెల్లె ను కొట్టి పంపిస్తున్నాడు. చెల్లెకాపురం నిలబె ట్టడానికి తన తండ్రి ఏదో కొంత ఇచ్చి పంపిస్తున్నాడు.

ఇవన్నీ ఎందుకు జరుగుతున్నాయి? ఊళ్ళో మూఢ నమ్మకాలింకా చెక్కు చెదర కుండా ఉన్నాయి. వీరేశలింగం పంతులుగా రు స్వాతంత్ర్య పోరాటం ముమ్మరంగా సాగుతున్న కాలంలో ఉండి కూడా స్వా తంత్ర్య పోరాటంలో పాల్గొనలేదు. అతడు కేవలం సంఘసంస్కరణల వరకే ఎందుకు పరిమితమయ్యాడు?

సమయం దొరకినప్పుడల్లా ఎన్నోవిధాలు గా ఆలోచిస్తూనే ఉన్నాడు సాంబయ్య. అత నిలో ఎన్నెన్నో ప్రశ్నలు తలెత్తుతున్నాయి. ఏ ప్రశ్నలకు సమాధానాలు మాత్రమాతని కి దొరకడం లేదు.

ఏదేమైనా ఈ సమ్మెలు బందయి పాఠ శాల ఎప్పటిలా నడిస్తే బాగుండునను కుంటున్నాడు సాంబయ్య. ఒక విద్యా సంవ త్సరం పాడయ్యేట్టుందని బాధపడ్తున్నాడు.

నాయకులు రోజుకో తీరు మాట్లాడుతున్నా రు. విద్యార్థులకు రాజకీయాలొద్దని సమ్మెవి రమించుకోవాలని అధికార పార్టీ నాయకులు విజ్ఞప్తి చేస్తున్నారు.

ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడు తుందని కొందరు, అది సాధ్యంకాదని మరి కొందరు చెబుతున్నారు. పరీక్షలయి పోయి నా హెచ్.ఎస్.సి. అయిపోయేదనుకుంటు న్నాడు సాంబయ్య.

ప్రత్యేక రాష్ట్రం ఖాయం. ఇందిరాగాంధీ ఒప్పుకున్నారు. అన్న వదంతి రాష్ట్రమంతా వ్యాపించింది.

అలాంటి సమయంలో ఉద్యమాన్ని విర మించడం జరిగింది. తెలంగాణ పోరాట సమయంలో భూపోరాటాలను నీరుగార్చిన ట్టే నాయకులీ పోరాటాన్నీ నీరుగార్చారు. ఆ నాయకులంతా అధికార పార్టీలో ఆశ్రయం సంపాదించారు. సంవత్సరకాలంగా సాగిన పోరాటం రెండువందల మందికి పైగా

విద్యార్థులను బలితీసుకొంది. కొందరికి ఢిల్లీలో రాజకీయ పదవులు లభించాయి. కొందరికి రాష్ట్రంలో పదవులు లభించాయి. విద్యార్థుల తల్లిదండ్రులకు కడుపుకోత మిగిలింది. అప్పటివరకు హెచ్.ఎస్.సి. ఆపైన తరగతులు చదువుతున్న విద్యార్థులకు ఒక సంవత్సరం చదువు వెనుకబడింది.

కోస్తా ముఖ్యమంత్రి మారి తెలంగాణవ్యక్తి ముఖ్యమంత్రయ్యాడు. తర్వాత సంవత్సరానికి జరిగిన పార్లమెంటు ఎన్నికల్లో తెలంగాణా ప్రజాసమితికి పధ్నాలుగులో పదమూడు సీట్లొచ్చాయి. అయితే వాళ్ళంతా త్వరలోనే అధికార పార్టీలో చేరి కొందరు మంత్రులు కూడా అయ్యారు.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఎన్నో విషాద స్మృతులను మిగిల్చినా తెలంగాణ ప్రాంతంలో ఓ విధమైన రాజకీయ చైతన్యాన్ని తీసుకొచ్చింది. దొరలు చెప్పిన వాళ్ళకే ఓటేయడంనుంచి ప్రజలు కొంత ఆలోచించే స్థితిని తెచ్చిపెట్టింది. ఆ ఉద్యమంలో చురుకైన పాత్రలు తీసుకున్న వాళ్ళు అధికారపార్టీలో పదవులు పొందడం కొందరి విషయంలో జరిగితే మరికొందరు ప్రజానాయకులుగా ఎదిగారు. కొందరు అటు తర్వాత తెలంగాణలో లేచిన భూపోరాట ఉద్యమాల్లో ప్రముఖ పాత్రవహించి రాష్ట్రాన్ని గడగడలాడించారు. కొందరు బలయ్యారు.

ఆ ఉద్యమ ప్రభావంతో ఆ ఊళ్ళో 'యువజన సంఘం' స్థాపించడం జరిగింది. అది దొరల్లాంటి వాళ్ళకు మింగుడుపడని సమస్యాయి కూర్చుంది.

హెచ్.ఎస్.సి. పరీక్షలయ్యాయి. పరీక్షల్లో మాస్ కాపీయింగ్ జరిగింది. విద్యార్థుల్లో ఒక విధమైన అరాచకత్వం ప్రబలింది. కాపీ చేయనివ్వని ఉపాధ్యాయులు కత్తిపోట్లు తిన వల్సి వచ్చింది. కొందరు విద్యార్థులు పక్కనే కత్తులు పెట్టుకొని పరీక్షలు రాశారు.

హెచ్.ఎస్.సిలో నూటికి నూరుశాతం మంది ఉత్తీర్ణులయ్యారు. అందులో అరవైశాతం మందికి మొదటిశ్రేణి మార్కులొచ్చాయి. మిగతావాళ్ళకు ద్వితీయశ్రేణి మార్కులొచ్చాయి. థర్డ్‌క్లాస్ అన్నమాటే లేదా సంవత్సరం.

పరీక్షా ఫలితాలను చూసి నవ్వాలో ఏడ్వాలో అర్థంకాలేదు సాంబయ్యకు. తమ పాఠశాలనుంచి సాంబయ్యకు, వెంకటేశంకు మాత్రమే ఫస్ట్ క్లాస్‌వస్తుందని ఊహించారు ఉద్యమానికి ముందు ఉపాధ్యాయులు. కానిప్పుడు సగంమంది కొచ్చింది.

ఫలితాలు వచ్చిన వెంటనే పి.యు.సి.లో అడ్మిషన్ కొరకు నోటిఫికేషన్ పడింది. పి.యు.సి.లో జాయినవుతానన్నాడు సాంబయ్య.

"ఇగ నానుంచి గాదు... ఊళ్ళెనంటె ఎట్లనో వెళ్ళింది. కరీంనగర్‌కు పంపి చదివించుడుగాదు. రొండేండ్లనుంచి కరువు. తిండి దినుసులు దొరుకుడే కష్టమైతంది... ఇంక నీకు చదువుకేన్నుంచి తేవాలె? పదకొండయి పోయింది గద. ఏదన్న నౌకరి మాదొరుకుతది. నౌకరి జూసుకో... నౌకరి దొరకకుంటే ఇంట్లుండు. నువ్వు పని చెయ్యకున్నా మంచిదే. నా నుంచైతె చదివించుడుగాదు''

తెగేసి చెప్పేసాడు చిలుకయ్య.



"ఏంది రాజమ్మ? నీ కొడుకెందుకో పండుకున్నడు. పట్టపగటేల పన్నడేంది?" అరుగు




మీదున్న మంచంలో పడుకొనున్న సాంబయ్యనుద్దేశిస్తూ అంది అంజమ్మ. ఆమె విసుర్రవుతు విసుర్తూ పాటలు పాడటంలో నేర్పరి. మొక్కజొన్న గడక విసరడానికి ఆమె పాటను సాధనంగా చేసుకుంది. ఎన్ని గంటలైనా పాట పాడుతూ విసురుతుందామె.

"పంటేందిగని నీ పాట వినత్త లేదేంది?" అంది రాజమ్మ.

"అదేమన్న సంబురానికి పాడేపాటా ఏంది? విసుర్రవుతు తింపుతాంటె కడుపుల పేగులు నోట్లెకత్తయి. గా కష్టం తెలువద్దని పాడుతం గదా? సరెగని కొడుకలిగి పన్నడా?"

"ఇగో ఏం జెప్పాలె వదినె... మీ అన్నేమొ చెప్పుతె వినడాయె... ఇటు సాంబన్న పట్టువట్టుకోనుండె... నడుమ నేంజావన్నా? నాకేమన్న తెలిసిపాడైతదా ఏమన్ననా? మల్ల మోసెటోనికెరుక కావటి బరువని ఎల్లుతదో ఎల్లదో మీ అన్నకే ఎరుక?"

నేనడిగిందేంది? నువ్వు చెప్పిందేంది? జానెడు పొడుగు రాగానికి మూరెడు పొడుగు దీర్ఘందీసిండట నీ అసోంటోడు''

"గదే చెప్పుతన్ననో? నువ్వేమొ కోపానికి రావడ్తివి? ఇగో చదువుకున్నోల్లకు బాగా రందుంటది... వాళ్ళు నిద్రలగూడ ఆలోచించుకుంటనే ఉంటరు. ఎప్పుడు చదువు మనాదితోని నిద్రే సరిగ్గ పట్టదాల్లకు... ఒకామె కిద్దరు కొడుకులట... ఒకయినె చదువుకుంటండు ఇంకొగయినె ఎవుసం జేత్తండు. ఎవ్వలకెక్కో రందుంటదోనని తల్లి నిద్రవోతున్న ఇద్దరి నోల్లల్ల వెన్నముద్దేసిందట. ఎవుసం జేసేటయినె నోట్లెది అట్లనే ఉన్నదట... చదువుకునెటయినె నోట్లెది కరిగిపెయిందట... ఎందుకంటె అయినెకెక్కో రందుంటది గదా! మా సాంబన్నకు చదువు రంది... పదకొండయిపాయె... పన్నెండు చదువన్నంటెకరీంనగరంల చదువన్నాయె... రొండేండ్ల నుంచి కరువు పాడాయె... మల్ల తండ్రికి కొడుకు వేరే ఊళ్ళుంటె పనెల్లదని రందయితంది. చేతుల పైసల్లేపాయె... అందుకో ఊకుండు మంటండు... సాంబన్నేమొ ఒక్కదాంట్ల గూడ పెయిలు గాకపాయె... చదువుతనంటండు... తండ్రద్దంటె వింటలేడు... ఎట్లయిన చదువుకున్నోల్ల ఆలోచన వేరే తీరుగుంటది... మనం రొండుకండ్లతోని జూత్తె వాళ్ళు నాలుగు కండ్లతోని జూత్తరు. మరి వాళ్ళ బాపేమొ వింటలేకపాయె''

"అట్లనా గా చదువుల సంగతి మనకేమెరుక?" అంటూ వెళ్ళి పోయింది అంజమ్మ.

మంచంలో పడుకొనున్న సాంబయ్య నిద్రపోవడం లేదు. తల్లి మాటలు వింటున్నాడు. తండ్రి చదువాపు చేస్తాననడం సాంబయ్యకు బాధాకరంగా ఉంది. తండ్రికెన్ని సమస్యలున్నా తాను బాధ్యతా రహితంగా ప్రవర్తించడం లేదు కదా! తానేం ఖర్చుచేస్తాడు. ఎప్పుడూ ఒక్క పైసకూడా వృధాగా ఖర్చుచేయడు... తనింకా చదువుకొని తల్లిదండ్రులను సుఖపెట్టాలనుకుంటుంటే తండ్రి చదువొద్దంటున్నాడు. సాంబయ్యకు తండ్రిపై కోపంగా ఉంది. తన నిస్సహాయ స్థితికి దుఃఖంగానూ ఉంది.

భూమయ్య సారంటే సాంబయ్యకు చాలా అభిమానం. అతడావూరి వాడే... హరిజన కుటుంబానికి చెందిన వాడు... ఈమధ్యనే ఆ ఊరికి ఉపాధ్యాయుడుగా వచ్చాడు. భూమయ్య సారును తన తండ్రికి చెప్పమని పిలిచాడు సాంబయ్య. ఊళ్ళో కెళ్ళిన తండ్రి కొరకు, సారు కొరకు ఎదురుచూస్తున్నాడు. చిలుకయ్య సాంబయ్యనెప్పుడూ నొప్పించలేదు. అలాగే సాంబయ్యకూడా తండ్రిని కాదనలేదు. కాని, ఈ విషయంలో మాత్రం వాళ్ళేకీభవించడంలేదు. దీనికి ఎవరి కారణాలు వాళ్ళకున్నాయి.

రెండు మూడు రోజులుగా సాంబయ్య సరిగా అన్నం తినడంలేదు. తల్లితో కూడా సరిగా మాట్లాడడంలేదు. తండ్రితో భూమ

య్యసారు ముందు ఏం మాట్లాడాలో మననం చేసుకుంటూ పడుకొనున్నాడు సాంబయ్య.

కొద్ది సేపట్లో చిలుకయ్య ఇంటికొచ్చాడు. అతడు వెంగళరావు దొర దగ్గర్నుంచొస్తున్నా డు. వెంగళరావే తోవవెంటపోతున్న చిలుక య్యను పిలిచాడు. మనసులో ఏదో పెట్టుకొని నవ్వాడు.

"మంచిగున్నవా చిలుకయ్యా?" అన్నా డు.

"ఏం మంచిగ దొర... కరువుకాలం పాడా యె. నా కొడుకును కరీంనగర్ తోలి చదివి య్యన్నంటె నానుంచైతదా? వాడేమొ పట్టు వడుతండు'' అన్నాడు చిలుకయ్య.

తన కొడుకులిద్దరూ హెచ్.ఎస్.సి. కూడా పూర్తి చేయకుండానే చదువాపారు. ఊళ్లో చిన్న కులాలవాళ్లు కొంతమంది చదువు కుంటున్నా వెంగళరావుకు అదిష్టంలేదు. చదువులో హుషారైన చిలుకయ్య కొడుకు ఇంకా చదువుకొని పైకి రావడం అతనికసలే ఇష్టంలేదు. ఊళ్లో యువజన సంఘంలాంటివి స్థాపించడం చదువుకున్న యువకుల వల్లనేనని అతని అభిప్రాయం. అందుకే

"అప్పుడు నేం జెప్పుతె విన్నవా? చదువు కున్న పోరగాండ్లు వినరు. చదివినా అందరి కి నౌకర్లు వత్తయా ఏంది? ఇప్పటికే ఎంత మంది వట్టిగ తిరుగుతలేరు? గా పొల్లగాండ్ల కేమెరుక? నీ తిప్పలు నీకున్నయి. గద్దరా యించి పెట్టి చెప్పిన పని చేయమను'' అన్నాడు వెంగళరావు.

దొర మాటల్లో అపశ్రుతులు, పక్షపాత ధోరణులు కనబడినా ప్రస్తుత పరిస్థితుల్లో అంతకంటె మార్గం కనబడటంలేదు చిలుక య్యకు.

"అంతే దొరా'' అన్నాడేమనాలో తోచక.

"ఇప్పటియన్ని వానాకాలం చదువులు. నా దగ్గరికి తోలు. సాంబయ్యకు నేను చెప్పుత. చదువుకున్న పోరగాండ్లు లంగలు తయారైతండ్రు. వాళ్లేమన్న తల్లిదండ్రుల మాట వినెటట్లున్నరా?" అన్నాడు వెంగ ళరావు.

చిలుకయ్య కా మాటలు నచ్చలేదు. సాంబయ్య చదువుకుంటన్నంత మాత్రాన తననెప్పుడూ కాదనలేదు. పెద్దలనెవరినీ అగౌరవపరచలేదు. తన కొడుకును చది వించకుండా చేయడం దొర ఉద్దేశ్యమని తెలుస్తూనేవుంది చిలుకయ్యకు. తనలాంటి కుటుంబాలవాళ్లు చదువుకుంటే వీళ్లకెందుకు కళ్లు మండుతాయోననుకున్నాడు చిలుక య్య.

దొర మాటల గూర్చే ఆలోచిస్తూ ఇంటికొ చ్చాడు. మంచంలో పడుకోనున్న కొడుకు పక్కన కూర్చున్నాడు. మీద చెయ్యేసి ముఖా న్ని తనవైపుకు తిప్పాడు. ముఖంపై కన్నీటి చారికలుండటం చూశాడు. సాంబయ్య ఇంతవరకూ ఏడ్చాడని తెలుసుకున్నాడు. చిలుకయ్య మనసు కరిగిపోతోంది. అయినా పరిస్థితులాతన్ని భయపెట్టినాయి. కరీంన గర్‌లో చదివిస్తే అయ్యే ఖర్చుల గూర్చి వెంగళరావు చెప్పిన మాటలాతన్ని మరింత భయపెడుతున్నాయి. సాంబయ్య లేచి కూర్చున్నాడు.

"ఏమైందని ఏడుత్తున్నవు? అందరు చదువుకోనే బతుకుతండ్రా? ఇప్పటికే పద కొండు చదివినవు చాలదా? ఇంకా చదువుత నంటె ఎట్లెల్లాలె?" అన్నాడు చిలుకయ్య.

"బాపూ! నేనెప్పుడైనా ఫెయిలయ్యానా? అన్నిట్లో మంచి మార్కులే తెచ్చుకున్నాను. నన్నెందుకు బందు జేస్తానంటున్నవు? ను వ్వు చదివించకున్నా నేనొక్కన్నే చదువు కుంటా... సాయంత్రాల్లో ఏదైనా దుకాండ్లో పని చేసుకుంట చదువుకుంట"

"గవ్వేం మాటలు బిడ్డ" అని "సాంబ య్యకు చదువంటె గంత ప్రేముంది. చదివి





య్యలేవు'' అంది రాజమ్మ.

"నాకు చదివియ్యన్నని లేదా? ఎట్లెల్లు తది మరి?" చిలుకయ్యనగానే మౌనంగా ఉంది రాజమ్మ.

ఇంతలో భూమయ్యసారక్కడికొచ్చాడు. సారును చూసి మంచంలోంచి లేచి వాకిట్లోకొచ్చాడు సాంబయ్య. అతనికి నమస్కరించి వాకిట్లో ఉన్న మంచం వాల్చి

"కూర్చోండి సార్!" అన్నాడు.

భూమయ్య మంచంలో కూర్చోకుండా గోడపక్కనున్న బండమీద కూర్చున్నాడు. తనకు చదువు చెప్పే ఉపాధ్యాయుడు మంచంపై కూర్చోకపోవడం సాంబయ్యకు బాధాకరంగానే ఉన్నా అది కొత్త కాదు కాబట్టి ఏమనలేదు. సాంబయ్య కూడా అతని పక్కకు కొంచెం దూరంలో ఉన్న బండపైన కూర్చున్నాడు. చిలుకయ్య వాకిట్లో వాల్చిన్న మంచంలో కూర్చున్నాడు. ఉపోద్ఘాతమేం లేకుండానే అన్నాడు భూమయ్య.

"చిలుకయ్యగారూ! సాంబయ్య చదువులో మంచి క్లెవర్. అన్నిట్లోనూ ఫస్టు మార్కులే. అతనికి చదువుపై ఆసక్తుంది. అలాంటివాణ్ని చదువొద్దనడం ఏం బాగుంటుందో చెప్పండి''

"అది కాదు సారూ! మా పరిస్థితి తెలువంది కాదు. ఇన్ని రోజులు కుండలగలదింత తిని నాకు పనులల్ల సాయం చేసుకుంట బడికిపోయిండు. ఇప్పుడు కస్బూర్లుంచి అన్ని పంపన్నంటె నానుంచైతదా?"

"అదా మీ భయం! మీకు ఎంతో కొంత వ్యవసాయముంది. మరి మాకేముందో చెప్పండి? మా నాన్న నీరటిపని చేస్తూ నన్ను చదివించాడు. ఓ పరిస్థితిలో నే చదువుకోనన్నా తానెంతైనా కష్టపడుతానని డిగ్రీవరకు చదివించాడు. మీరు మాకంటె అధ్వాన్న పరిస్థితిలో ఏం లేరుగదా!"

"మీకు గవర్నమెంటోల్లు స్కాలర్‌షిప్పులిచ్చిరి. హాస్టల్ల వర్తిగనే తిండిబెట్టిరి. మీరు చదువుకునుడు అలుకగనే. మా అసొంటోల్లు చదివించుడే కష్టం"

"మీరన్నదాంట్లో కొంత నిజం లేకపోలేదు. కాని సాంబయ్యకు మెరిట్ మార్కులున్నాయి. అతనికేదో స్కాలర్‌షిప్ తప్పకుండా వస్తుంది. స్కూల్లో ఉన్నప్పుడు కూడా వచ్చిందికదా! స్కాలర్‌షిప్ డబ్బులుపోగా మీరు పెట్టాల్సిన ఖర్చు చాలా తక్కువే. అందులో సాంబయ్య దొర పిల్లల్లా బాధ్యతారహితంగా ఖర్చు పెట్టేవాడు కాదు. మీకేమంత భారం కాదు''

"ఒక్కడే కొడుకును దూరం తోలుడంటె మనుసొప్పుతలేదు''

"చిలుకయ్యగారూ! తమ పిల్లలమీద ప్రేమ ఎవరికైనా ఉంటుంది. అందుకోసం వాళ్ల భవిష్యత్తునే నాశనం చేయడం ఏమంత బాగుండదు. డబ్బుండి దొరల పిల్లలను చదివిద్దామన్నా చాలామంది చదువుకోలేదు. ఏ ఇద్దరు ముగ్గురో పేరుకొచ్చేట్టున్నారు. సాంబయ్య చదువుమీద అంత ఆసక్తి చూపుతుంటే మీరేవేమో చెబుతున్నారు. కరీంనగర్ ఎంత దూరంలో ఉంది? ఇప్పుడు బస్సు లేకున్నా త్వరలోనే బస్సు పడే అవకాశం ఉంది మనూరికి. ఇవన్నీ కారణాలు కానేకావు. చదివించదలుచుకుంటే ఎలాగైనా చదివించొచ్చు''

"వెంగళరావు దొరలాంటివాళ్లు కూడా వద్దన్నారు''.

"వాళ్లెప్పుడు మనల్ని చదువుకొమ్మన్నారు? వ్యవసాయ కుటుంబాలవాళ్లు చదువుకొని తెలివికొస్తే వాళ్ల ఆటలు సాగవని భయం. తమతో సమానంగా గౌరవం పొందుతారని ఈర్ష్య. మా నాన్న ఇప్పటికీ అందరికీ వంగి వంగి నమస్కారం చేస్తాడు. మరి నేనో? దొరలైనా నన్ను కూచోమంటారు. అందుక్కారణం...? నాకున్న చదువేకదా?" అన్నాడు భూమయ్య.

చదువుయొక్క ప్రాముఖ్యత గూర్చి వివరించాడు. సాంబయ్యను చదువు మాన్పిస్తే దొరలెలా సంతోషపడతారో చెప్పాడు. ఒక్కగానొక్క కొడుకును చదివించడానికి ఇంతగా వెనుకాడాల్సిన పని లేదని వివరించాడు. ఈ కాలంలో ఏ ఆధారమూ లేనివాళ్లు కూడా కూలిపని చేసైనా పిల్లలను చదివిస్తున్నారని కొన్ని ఉదాహరణలు చెప్పాడు.

భూమయ్యసారు మాటలు చిలుకయ్య హృదయానికి తగిలాయి. ఒక్కగానొక్క కొడుక్కు తానన్యాయం చేస్తున్నాడా? తనను తాను ప్రశ్నించుకున్నాడు. తనను చదివించమని దీనంగా వేడుకుంటున్నట్టున్న సాంబయ్య ముఖం, భూమయ్యసారు మాటలు చిలుకయ్యను ఆలోచించేలా చేస్తున్నాయి.

"ఒక్కడే పొల్లగాడాయె. ఎట్లనన్న కష్టపడుదాం తియ్యలేవు. వానికి పెద్ద నౌకరైతే మనకీ బాధలుంటాయా? అప్పో సప్పో చేసి ఎల్లదీసుకుందాం" అంది రాజమ్మ.

సరేనని తలూపాడు చిలుకయ్య.

ఇంతలో సుంకరి సాయులు బరిసె పట్టుకొని అక్కడికొచ్చాడు.

"చిలుకన్న నిన్ను కొండల్‌రెడ్డి రమ్మంటండె!". అన్నాడు సాయులు.

"ఎందుకు?" అడిగాడు చిలుకయ్య.

"నాకేమెరుకగని ఆల్లు అనుకోంగిన్న. వాళ్లు కాశికి పోతరట. నువ్వోసారి కాశికి పోతె మంచిగుండునని అన్నవటకద. గదే అడుగు తడనుకుంట"

చిలుకయ్యలాంటివాళ్లకు కాశీకి పోవడం ఓ స్వప్నంలాంటిదే. చాలా ఏళ్లుగా హరిశ్చంద్రుని కథ విన్నప్పట్నుంచీ చిలుకయ్య కాశీకి పోవాలనుకుంటున్నాడు. కాని అది సాధ్యం కావడంలేదు. ఓసారి కొండల్‌రెడ్డితో మాటల సందర్భంగా ఈ విషయం చెప్పాడు. ఇప్పటికా సమయం వచ్చిందా? అనుకున్నాడు. 'అయినా కరువు కాలంలో...?' తనను తాను ప్రశ్నించుకున్నాడు.

"కరువుల బాగోతమని ఇప్పుడిదోటా? మా సాంబన్న సంగతి గూడ సర్పంచినడుగచ్చు. మేమస్తన్నం పోరా సాయులు'' అన్నాడు చిలుకయ్య.

భూమయ్య సారు ఇంటికెళ్లిపోయాడు. సాంబయ్యను తీసుకొని చిలుకయ్య కొండల్‌రెడ్డి ఇంటికెళ్లాడు.

ఊరి పెద్దమనుషులు కొందరక్కడున్నారు.

"చిలుకయ్యా బాగున్నవా?" అన్నాడు కొండల్‌రెడ్డి.

"ఆఁ... గిట్లున్నం" అన్నాడు చిలుకయ్య.

"ఇంకో పదిహేను రోజుల్లో మేం కాశీకి పొయ్యస్తామనుకుంటున్నాం! నువ్వోసారి నాతో వస్తానన్నట్టు గుర్తు. వస్తావా మరి? అందరం కలిసిపోవచ్చు. ఒక్కరు పోయిరావడం కష్టం. ఈ అవకాశం మళ్ళీ రాదు. మనిషి జన్మ ఎత్తినందుకు జీవితంలో ఒక్కసారైనా కాశీకి పోయి రావాలి'' అన్నాడు కొండల్‌రెడ్డి.

కొంత ఖర్చుతో కూడుకున్నదైనా, ఈ సమయంలో తనకు కొంత కష్టంగానే ఉన్నా పోవడానికే నిర్ణయించుకున్నాడు చిలుకయ్య.

కొడుకు విషయం గూర్చి చెప్పాడు కొండల్‌రెడ్డితో.

మిగతా వాళ్ళ విషయంలో అంతగా శ్రద్ధ చూపని కొండల్‌రెడ్డి సాంబయ్య విషయంలో మాత్రం ఎప్పుడైనా మంచిగానే ప్రవర్తిస్తున్నాడు... సరైన సలహాలే ఇస్తున్నాడు. తన కొడుక్కు దగ్గరి స్నేహితుడవడం వల్ల కావచ్చు. లేదా తన కొడుక్కు ఉపయోగపడతాడని కావచ్చు.

"ఏం మనిషి వున్నవు చిలుకయ్య! సాంబయ్యసోంటి మంచి పిల్లవాన్ని చదువు బందు జేత్తవా? నీకు వెళ్ళకుంటే నా దగ్గర డబ్బు




తీసుకపో... చదువు మాత్రం మాన్పించద్దు'' అన్నాడు.

ఆ మాటలు విన్న సాంబయ్య ముఖం వెలిగింది.

"కాశీకి పోవడానికి తయారుగా... నీ కొడుకును కాలేజీలో చేర్పిస్తున్నవు గద! శివునాజ్ఞ తీసుకుందాం. శివు నాజ్ఞలేనిదే చీమైనా కదలదన్నారు కదా!" అన్నాడు కొండల్‌రెడ్డి.

కొడుకును కాలేజీలో చేర్పించడానికి, కాశీ ప్రయాణానికి అయ్యే ఖర్చును గూర్చి ఆలోచిస్తూ కొడుకును వెంటబెట్టుకొని ఇంటికెళ్ళాడు చిలుకయ్య. కొడుకు చదువు గూర్చి తన కాశీ ప్రయాణం గూర్చి రాజమ్మతో చెప్పాడు. ఆమె లబదిబా మొత్తుకుంది. దాదాపేడుస్తున్నట్టుగా అంది...

"కొడుకును చదివిస్తనన్నవు మంచిదే. కాశీకి పోవుడెందుకు మరి? కాశీకి పోయినాడు కాటికి పోయినట్టేనాయె''

బస్సులు, రైల్లు లేని సమయంలో కాశీకి కాలినడకన పోవాల్సివచ్చేది. అడవులు, వాగులు, వంతలు దాటుతూ అంతదూరం పోయి సురక్షితంగా తిరిగి రావడమనేది ఆకాలంలో దాదాపసాధ్యమే. అందువల్లే ఈ సామెత పుట్టింది. అందుకే జీవితపు చరమ దశలో కాశీకిపోయి అక్కడే శేషజీవితం గడిపి అక్కడే బూడిదైపోయేవారు. ఆ ఊర్నుంచి ఓ షావుకారు యాభై ఏండ్లకింద కాశీకిపోయి తిరిగిరాలేదని చెప్పుకుంటారు.

"అది ఎప్పటి మాటో...? ఇప్పుడు రైళ్ళున్నయి. అయినా నేనొక్కన్ని పోతలేను గద! అందరితోని నేను'' అన్నాడు చిలుకయ్య. ఎడ్లకు మేతవేయడానికి కొట్టందిక్కు పోయాడు.

"సాంబన్నా! మీ బాపు కాశికి పోతనంటండు... అయినెకు గదేం బుద్ధి? నువ్వన్న వద్దని చెప్పు బిడ్డా!" అంది రాజమ్మ.

భారతదేశంలోని పుణ్యక్షేత్రాల్లో ఒకటైన కాశీని గూర్చి పుస్తకాల్లో చదివాడు సాంబయ్య. ఈ కాలంలోనూ తల్లి భయపడుతుండటం సాంబయ్యకు నచ్చలేదు.

"అవ్వా! బాపుకేం గాదు! ఇప్పుడెంతో మంది పోతున్నరు'' అని తల్లిని సముదాయించాడు.

అయినా కొడుకును పట్టుకొని ఏడుస్తూనే ఉంది రాజమ్మ. భార్య ఏడ్పు చూసి ప్రయాణం మానుకుందామనుకున్నాడు చిలుకయ్య. కాని ఈ అవకాశంపోతే తాను జన్మలో కాశీని చూడలేనని పోవడానికే నిర్ణయించుకున్నాడు.

సాంబయ్య పి.యు.సి.లో జాయినవ్వడానికి కరీంనగర్ ఎస్.ఆర్.ఆర్. కాలేజీలో దరఖాస్తు పెట్టొచ్చాడు. చిలుకయ్య కొండల్‌రెడ్డి తదితరులతో కాశీకి పోయాడు.

పదిహేను రోజులైనా తిరిగిరాని వాళ్ళ కోసం ఊళ్ళో ఎదురుచూస్తున్నారు. రకరకాల పుకార్లు బయలుదేరాయి.

"అక్కడే గంగలో మునిగిపోయిండ్రు''

"తోవల దొంగలు గొట్టిండ్రు''

"కావాలనే మోక్షమత్తదని గంగల కలసిపోయిండ్రు''

కొందరైతే వాళ్ళ ఇండ్లకొచ్చి విచారాన్ని కూడా వెలిబుచ్చుతున్నారు. కాశీకి వెళ్ళిన వాళ్ళందరి ఇండ్లలోనూ శోకాలు మొదలయ్యాయి. రాజమ్మ వల్లిస్తూ ఏడుస్తోంది. సాంబయ్యకు మనసు మనసులో ఉండటం లేదు.

"వాళ్ళిక తిరిగిరారు. ఆశ వదులుకోవాలి'' అనే నిర్ణయానికొచ్చారంతా. అలాంటి సమయంలో అక్కణ్నుంచో తెలుగు పాండాను వెంటబెట్టుకొని వచ్చారంతా.

కాశీనుంచొచ్చిన వాళ్ళ ఇండ్లలోకి ఊరిజనమంతా తండోపతండాలుగా పోతున్నారు. మూడు నాలుగు రోజుల వరకు వాళ్ళ ఇండ్లనిండా సందడే.

'కాశీకి పోకున్నాపోయొచ్చిన వాళ్ళ కాళ్ళు ముట్టుకుంటే కాశీకి వెళ్ళొచ్చినంత పుణ్యం' అని కాశీకెళ్ళొచ్చిన వాళ్ళ కాళ్ళను తాకి పోతున్నారు జనం. కొందరయితే సాష్టాంగపడి కాళ్ళమీద పడుతున్నారు.

ముఖ్యంగా ఏకులం వాళ్ళు ఆకులం వాళ్ళింటికి, లేదా తమకంటె పెద్దకులం వాళ్ళింటికిపోయి దండంబెట్టి వస్తున్నారు.

కరీంనగర్‌లో పి.యు.సి. లిస్టు పెట్టారని తెలిసింది. తండ్రిదగ్గర డబ్బుతీసుకొని కరీంనగర్ పోయాడు సాంబయ్య. కిషన్‌రెడ్డి అక్క వాళ్ళిప్పుడు కరీంనగర్‌లోనే ఉంటున్నారు. కిషన్‌రెడ్డి వాళ్ళింట్లో ఉండి చదువుకుంటాడు. బి.పి.సిలో జేయిన్ కమ్మంది కిషన్‌రెడ్డి చిన్నక్క. కాని సాంబయ్యకు లెక్కలంటే ఇష్టం పి.యు.సి. మ్యాథ్స్‌లో జాయినయ్యాడు సాంబయ్య.

కిషన్‌రెడ్డి అక్క వాళ్ళింట్లోనే ఓ గదిని అద్దెకు తీసుకున్నాడు. గది అద్దె నెలకు పది రూపాయలు.



రేపే సాంబయ్య కరీంనగర్ ప్రయాణం... చిలుకయ్య, రాజమ్మల మనసదోలా ఉంది. ఇన్ని రోజులుగా ఎప్పుడూ కొడుకును విడిచుండలేదు. సాంబయ్య కూడా అంతే. చదువు పేరుమీద కొడుకును కరీంనగర్‌కు పంపడం వాళ్ళకు బాధాకరంగానే ఉంది. తల్లిదండ్రులను వదిలిపోవడం సాంబయ్యకు కూడా బాధాకరంగానే ఉన్నా ఏదో కొత్త జీవితం గడుపుబోతున్నానన్న సంతోషమూ కొంతుంది. 'కరీంనగర్ ఎంత దూరంలో ఉంది? ప్రతివారమూ వచ్చి పోవచ్చు. బస్టాండుకెళితే రోజూ తమ ఊరివాళ్ళొకర్రైనా కలుస్తారు. అనుకొని తననుతాను సంతృప్తిపరుచుకుంటున్నాడు సాంబయ్య.

సాంబయ్యకిప్పుడు రెండే పాంట్లున్నాయి. అవీ రెండేళ్ళకింద కుట్టించినవి. రెండు మూడు నిక్కర్లున్నా అవి తానిప్పుడు తొడగలేడు. తండ్రి నడిగి ఇంకో రెండు పాంట్లు కుట్టించాలనుకుంటున్నాడు. రెండుమూడు రోజులుగా తండ్రితో మాట్లాడాలనుకుంటూనే మాట్లాడలేక పోతున్నాడు.

విచారంగా కూచున్న తండ్రితో

"బాపూ! ఓ బాపూ!" అన్నాడు సాంబయ్య''

"ఏంది బిడ్డా?"

"నేనిప్పుడు కాలేజికి పోవన్నాయె! నాకున్నయే రొండు పాతపైంట్లు. ఇంక రెండు పట్టియ్యి''

"ఇప్పుడు పైసలేన్నుంచి తేవాలె బిడ్డ?"

"కాదు బాపూ! పాతరెండు పైంట్లతోనెట్ల వెళ్ళుతది? నిప్పుడొక్క రెండు పట్టిస్తె నిన్నెప్పుడడుగనిగ... నాకెట్లైన స్కాలర్‌షిప్ వస్తది. స్కాలర్‌షిప్ వచ్చినపుడు యాడాదికోటి కుట్టించుకుంట"

"ఆగయ్య షావుకారి దగ్గరికి పోయి తెచ్చుకోని ఇక్కన్నే మేరయినె కిచ్చిపో... నువ్వు వచ్చినపుడు కొంచపోవచ్చు. పంట పండినంక పైసలిత్త... కొంచెమాగినంక పోయి తెచ్చుకో'

"మా తెచ్చుకుంట బాపు''

"బిడ్డా! నువ్విదువరకెక్కో తిరిగినోనివిగాదు. అక్కడెట్లుంటవో ఏమో?" అన్నాడు చిలుకయ్య.

"పట్నంల అందరు లంగలుంటరట... రౌడి పోరగాండ్లుంటరు. ఎవ్వల జోలికి పోకు'' అంది అక్కడికొచ్చి కూర్చొని రాజమ్మ.

"నేనెవ్వరి జోలికెందుకు పోత? నా చదువేందో నేనేందో? నాకు టైమేడ దొరుకుతది బాపు?"

"మనం బోకున్నా మనజోలి కచ్చెటోల్లుంటరు. ఇది బట్ట గాల్చి మీదేసే కాలం.




బీడ్లెకు పొయ్యత్తంటె ఓసారి బంగారమని నమ్మిచ్చి నా దగ్గర ఇరవై రూపాయలు తీసుకున్నడొగయినె''

"ఎంతైన 'కస్బూరు' పొడే బిడ్డ... ఎట్ల వండుకుంటవో ఏమొ? ఎవ్వాలన్నత్తె ఇక్క న్నుంచి కూరగిట్ట మా పంపుతం"

"పాడు సోపతులు చెయ్యకు బిడ్డ. రాత్తి ౖరాక తిరుగకు... ఎప్పుడన్న ఒక్క సినిమా సూడుగని ఊకె సినిమాలు చూడకు. సోపతి కాల్లు పోదామని మా అంటరు''

"ఏం బోను. నేనిక్కడున్నప్పుడు కూడా తిరిగిన్నా? మంచిగనే వండుకుంట. మీరు నాకోసమేం రంది పడకుండ్రి. శనివారం సాయంత్రమొచ్చి సోమవారం మబ్బుల లేచి పోత"

"గంజుల బియ్యంబోసి చేతివేళ్ళకుండే నడిమి గీతలదాక నీళ్ళువోత్తె సరిపోతయి

అక్కడికక్కడికి మంచి గుడుకుతది. నీళ్ళె క్కో అయితె వంచాలె. అత్తెసరే. పెట్టుకో'

"ఇదువరకెన్నిసార్లు చెప్పినవే అవ్వ. అట్లనే వండుకుంట. ఓసారి రెండుసార్లు పాడైనా ఆ తర్వాత వంటదేవస్తది. స్టౌమీదనే వండుకునుడాయె''

కొడుక్కు రకరకాల జాగ్రత్తలు చెబుతూనే ఉన్నారు. తల్లిదండ్రులకు తనపై ఉన్న ప్రేమకు సాంబయ్య కళ్లు చెమరుస్తున్నాయి. ఊరుదాటి పెద్దగా తిరుగని సాంబయ్యకు కూడా అందర్నీ వదిలిపెట్టి పోవడం కష్టతరంగానే ఉంది.

లేచి షావుకారింటికెళ్ళాడు సాంబయ్య. రెండు పాంట్లుకోసం బట్ట తీసుకున్నాడు. నిక్కర్ల పైకి కుట్టించిన బుషర్టులున్నాయి కాబట్టి అంగీబట్ట తీసుకోలేదు. బట్టను తీసుకెళ్లి మేర సత్తయ్యకిచ్చాడు. నాలుగైదు రోజుల్లో కుట్టుంచమన్నాడు. ఇంటికొచ్చి ఓ ఇనుప సందుగలో అన్నీ సర్దుకున్నాడు.

తెల్లవారి ఎడ్లబండ్లో బియ్యం, పప్పు, మిరప్పొడి మరికొంత వంటసామాను కట్టిన ముల్లెలు వేసుకొని చిలుకయ్య కొడుకుని తీసుకొని పక్కూర్లో ఉన్న బస్టాండుకెళ్లాడు. రాజమ్మ కొడుకుపోతూ ఉంటే కండ్లనీళ్లు తీసుకుంది.

'ఇకనుంచి తాను పట్నంలో చదువుతాడు. అటుతర్వాత ఏదో ఉద్యోగమవుతుంది. అప్పుడప్పుడు ఊరికొచ్చినా తాను ఊళ్లో ఉండేదిక తక్కువే. అంటే తాను పుట్టిపెరిగిన నేలకు, ఆడిపాడిన ప్రదేశాలకు తన స్వంత నేలకు దూరం కాబోతున్నాడా?' ఈ ఆలోచన రాగానే సాంబయ్య మనసు భారమైంది. తాను చదివిన పాఠశాలను, ఈతలు కొట్టిన చెరువును, తంగేడుపూవు కొరకెక్కిన గుట్టలను, చెట్లు పుట్టలను జ్ఞాపకం చేసుకుంటూ అవి తనకు దీనవదనాలతో వీడ్కోలు పలుకుతున్నట్టనిపించి సాంబయ్య మనసు మరింత బరువెక్కింది.

బస్సెక్కిస్తూ చిలుకయ్య కొడుక్కు మరెన్నో జాగ్రత్తలు చెప్పాడు. తండ్రి చెప్పిన వాటికన్నిటికీ తలూపి మౌనంగా బస్సులో కూర్చున్నాడు సాంబయ్య. బస్సు కదిలి కరీంనగర్ దిక్కు పరుగులు తీస్తోంది. సాంబయ్యలో ఎన్నో ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి.

బస్సుదిగి సామాన్లు రిక్షాలో వేసుకొని కిషన్‌రెడ్డి అక్క ఇంట్లో తీసుకున్న అద్దెగదిలో కొచ్చాడు సాంబయ్య. కిషన్‌రెడ్డి మిత్రుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు. ఆరోజు వాళ్ళింట్లోనే భోజనం చేశాడు.

తెల్లవారినుండి వండుకొని తింటున్నాడు. మొదట్లో వంట కొంచెం ఇబ్బందికరంగానే అనిపించినా తర్వాత తర్వాత అలవాటైపోయింది. కిషన్‌రెడ్డితో కలిసి కాలేజీకెళ్లొస్తున్నాడు. మొదట్లో ప్రతి పీరియడ్‌కూ గదులు మార్చడంవల్ల గదులు వెతుక్కోవడానికి ఇబ్బంది పడ్డాడు సాంబయ్య. హెచ్.ఎస్.సి.వరకు తెలుగు మీడియంలో చదివిన సాంబయ్యకు పి.యు.సి.లో ఒకేసారి ఇంగ్లీషు మీడియంలో బోధించడంవల్ల మొదట్లో కొంత ఇబ్బందయింది. ముఖ్యంగా లెక్చరర్ల మాటతీరు (Pronounciation) అర్థమయ్యేది కాదు. చదువులో ఎంతో ఇంటెలిజెంటయిన సాంబయ్య త్వరలోనే ఆ ఇబ్బంది నధిగమించాడు.

ప్రతివారం ఊరికెళ్లి వస్తూనే ఉన్నాడు. సాంబయ్య కరీంనగర్‌లో జీవితం గూర్చి, చదువు గూర్చి తల్లిదండ్రులకు చెపుతున్నారు. కాలేజీ చదువుతున్న కొడుకుంజూసి వాళ్లు గర్వపడుతున్నారు. ఆతన్ని అపురూపంగా చూస్తున్నారు. ఇంట్లో ఉన్నప్పుడు ఉన్నదాంట్లో మెరుగైనది వండిపెడుతున్నాడు. సాంబయ్య పోయేప్పుడు అప్పుడప్పుడు వండిన మటన్, చికెన్, చేపలు ఓ డబ్బగిన్నెలో పెట్టిస్తున్నారు. కొడుకుపై ఎన్నో ఆశలు పెంచుకుంటున్నారు.

ఎప్పుడూ పల్లెల్లోనే ఉన్న సాంబయ్యకు




మొదట్లో పట్టణ జీవితం కొంత ఇబ్బందిక రంగానే అనిపించింది. పల్లెల్లో ఎంతో ఆప్యాయంగా ఒకరి అవసరాల్లో మరొకరు సాయం చేస్తూ ఉండటం చూశాడు సాంబయ్య. ఎవరింట్లో కార్యమైనా, ఎవరి ఆరోగ్యమైనా బాగా లేకున్నా పల్లెల్లో అందరికీ తెలిసేది. కాని ఇక్కడ పక్కింటివాళ్లను కూడా పట్టించుకోకపోవడం చూస్తున్నాడు. రెండిండ్ల అవతలున్న వాళ్ళెవరో కూడా తెలియని పరిస్థితిని గమనిస్తున్నాడు. వీళ్ళిలా ఎలా ఉండగలుగుతున్నారు? అనుకునేవాడు సాంబయ్య.

జిల్లాలోని వివిధ ప్రాంతాలనుండి, కొందరైతే ఇతర జిల్లాలనుండి వచ్చినవాళ్లు సాంబయ్య తరగతిలో ఉన్నారు. వాళ్లంతా మా క్లాసులో నేను ఫస్టంటే నేను ఫస్టని చెప్పుకోవడం చూశాడు సాంబయ్య. తెలంగాణ ఉద్యమం పుణ్యమాని అందులో చేరినవాళ్ళంతా ఫస్టుక్లాసున్నవాళ్లే... అయితే నిజంగా ప్రథమశ్రేణి విద్యార్థులెవరో ఆ తర్వాత మెల్లమెల్లగా తేలిపోతున్నారు.

ఓరోజు ప్రభాకర్‌సారు ఇంగ్లీషు చెబుతున్నాడు. అతడింగ్లీషులో మంచి ప్రావీణ్యమున్న వ్యక్తి... బోధన కూడా అందరి కర్థమయ్యేలా ఉంటుంది. అతని క్లాసంటే పిల్లలకెంతో ఇష్టం. ఇంగ్లీషు పాఠం చెబుతూనే ప్రిన్సిపాల్‌ను నిందిస్తున్నాడు ప్రభాకర్. అతనికి ఇంగ్లీషు ఏమాత్రం రాదని, ఆతడు మాట్లాడేదాంట్లోంచి పది పదాలను తీసివేస్తే అతడిక మాట్లాడలేడని చెప్పాడు. ప్రిన్సిపాల్ గురించి ఎంతో హీనంగా మాట్లాడాడు. అతడలా ఎందుకు మాట్లాడుతున్నాడో సాంబయ్య కర్థం కాలేదు. తన పైఅధికారి అయిన ప్రిన్సిపాల్‌ను చులకనచేసి మాట్లాడటం సాంబయ్యకు నచ్చలేదు. ప్రభాకర్‌సారంటే ఎంతో అభిమానమున్న సాంబయ్యకు ఆ రోజుతో అసహ్యమేర్పడింది. తనకు రావాల్సిన ప్రమోషన్ రాకపోవడంవల్ల ప్రభాకర్ సారు ప్రిన్సిపాల్‌నలా నిందిస్తున్నాడని తెలుసుకున్నాడు సాంబయ్య.

కాలేజీలో ఉన్న రీడింగ్‌రూంలోకి అన్నిరకాల పత్రికలొస్తాయి. చదువంటే ఎంతో ఆసక్తి ఉన్న సాంబయ్య పత్రికలను కూడా చదవడం మొదలుపెట్టాడు. పాఠ్యపుస్తకాలన్నీ చదివి మంచిమార్కులు తెచ్చుకోవడానికి కృషిచేసే విద్యార్థికి మ్యాగజన్స్‌లాంటివి చదివే సమయం దొరకడం చాలా కష్టం. సాంబయ్య ధ్యేయం ప్రథమశ్రేణిలో మంచి మార్కులతో ఉత్తీర్ణుడు కావడం. ప్రతిసారీ తండ్రి ఇంటి అవసరాల గూర్చి చెబుతూనే ఉన్నాడు. అందువల్ల మ్యాగజిన్స్ లాంటివి చదవాలని ఎంత ఆసక్తి ఉన్నా పాఠ్యపుస్తకాలు చదవడానికే ఎక్కువ ప్రాధాన్యతనిచ్చేవాడు. కాలేజీలో ఉన్నప్పుడు ఏ లెక్చరరైనా రాకుంటే, ఆ స్థానంలో మరే లెక్చరర్ క్లాసు తీసుకోకుంటే రీడింగ్ రూమ్‌కెళ్ళి పత్రికలు తిరగేసేవాడు. ఎన్నో చెత్త విషయాలతోపాటు పాఠ్యపుస్తకాల్లో తాను చదవని ఎన్నో విషయాలు పత్రికల్లో ఉన్నాయన్న విషయాన్ని గ్రహిస్తున్నాడు సాంబయ్య.

కాలేజీ జీవితానికలవాటవుతూ గ్రామీణ, పట్టణ జీవితాల్లోని తేడాను అవగాహన చేసుకుంటున్న సమయంలో కాలేజీ విద్యార్థి యూనియన్ ఎన్నికలొచ్చాయి. కాలేజీలో పెద్ద హడావిడి ప్రారంభమైంది. కులాలవారిగా, ప్రాంతాలవారిగా, రాజకీయాలవారిగా విద్యార్థులు ప్రచారం ప్రారంభించారు. గుంపులు గుంపులుగా తిరుగుతూ తమ కోటెయ్యమంటున్నారు. మాది సిక్‌వాడి గ్రూపంటూ, మాది కార్ఖానాగడ్డ గ్రూపంటూ, మాది జ్యోతినగర్ గ్రూపంటూ పట్టణంలోని వాడలవారిగా ప్రచారం చేస్తున్నారు. తమ కోటేస్తే అధికార పార్టీ ఎమ్మెల్లేతో అన్ని పనులు చేయిస్తానని ఒకరంటే, ఎమ్.పి.తో అన్ని పనులు చేయిస్తానని మరొకరంటున్నారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో వీరోచిత ఉపన్యాసాలిచ్చిన వాళ్ళిప్పుడు పార్టీల తర

పున పోటీ చేస్తున్నారు. మరికొందరు ఇంకా తెలంగాణ నినాదంతోనే పోటీ చేస్తున్నారు. విద్యార్థులు కిరాయికుండే గదుల్లోకి వచ్చి ఓటేయమని చెబుతున్నారు. ప్రతి తరగతి గదికొచ్చి ప్రచారం చేస్తున్నారు. అక్కడక్కడ విద్యార్థులు కొట్టుకోవడం కూడా జరుగుతోంది. ఈ ఎన్నికల గొడవలతో దాదాపు పదిరోజుల చదువు పాడైంది. విద్యార్థులకు రాజకీయాలొద్దు అంటున్న రాజకీయనాయకులు కూడా విద్యార్థి ఎన్నికల వెనుకున్నారని తెలుసుకున్న సాంబయ్య నోరు తెరిచాడు.

రెండు రెడ్డి గ్రూపుల మధ్య పోటీగా డిగ్రీ కాలేజీ ఎన్నికలు ముగిశాయి. అందులో ఒకరు గెలుపొందారు. అయితే రెండు గ్రూపుల మధ్యా కొట్లాటలు సంవత్సరమంతా సాగాయి. ఒకర్నొకరు హాకీ స్టిక్‌లతో, పొయ్యిల కట్టెలతో కొట్టుకున్నారు. ఓ రోజైతే బి.యస్సీ క్లాస్ జరుగుతుండగానే బెంచీని విరగ్గొట్టి దాన్ని కట్టెలతో ఒక గ్రూపువారు మరో గ్రూపువారిని చితకబాదారు. దానికి ప్రతీకారంగా మరోదాడి.

విద్యార్థి యూనియన్ ఎన్నికల్లోనూ ఇన్ని గొడవలెందుకో సాంబయ్య కర్థం కావడంలేదు. బయట ఎన్ని గొడవలు జరుగుతున్నా చదువు పాడవడానికి అవకాశాలుంటే ఎన్ని సంఘటనలు జరుగుతున్నా సాంబయ్య చదువే ధ్యేయంగా పెట్టుకొని రాత్రింబవళ్లు కృషిచేస్తున్నాడు. గ్రామాల్లోని స్కూళ్లలో ఉన్నప్పుడు ప్రథమశ్రేణిలో ఉన్న విద్యార్థులు కూడా ఇక్కడ సినిమాలు, తిరగడాలకు అలవాటుపడి వెనక్కిపోవడం గమనిస్తున్నాడు. ఎలాంటి ప్రలోభాలకూ లొంగకూడదని తీవ్రంగా కృషిచేస్తున్నాడు.

ఈమధ్య సాంబయ్యకో సమస్య వచ్చిపడింది. లోన్ స్కాలర్‌షిప్ కోసం దరఖాస్తు పెడుతున్నాడు సాంబయ్య. మెరిట్ మార్కులున్నాయి సాంబయ్యకు. ఆ స్కాలర్‌షిప్ వచ్చే అవకాశముంది. స్కాలర్‌షిప్ విలువ 720/- రూపాయలు. అది పెద్ద మొత్తమే. ఏడాది ఖర్చులో సగానికి పైగా వస్తుంది. ఆ స్కాలర్‌షిప్ వస్తే తండ్రిమీద భారం తగ్గుతుందనుకున్నాడు సాంబయ్య. అయితే ఆ స్కాలర్‌షిప్ రావడానికి దరఖాస్తు ఫారంపై ఫస్టుక్లాస్ మేజిస్ట్రేట్ సంతకం కావాలి. జిల్లాలో వాళ్లు ముగ్గురే ఉన్నారు. ఒకరు కలెక్టర్. రెండోవ్యక్తి జిల్లా సెషన్స్ జడ్జి. మూడో వ్యక్తి డిస్ట్రిక్ట్ రెవెన్యూ ఆఫీసర్. (D.R.O.). మొదటి ఇద్దరి దగ్గరకెళ్లడం సాధ్యంకాదని మూడవ వ్యక్తి సంతకం కోసం కాళ్లరిగేలా తిరుగుతున్నాడు సాంబయ్య. ఆఫీసు ప్యూన్లే లోపలి కెళ్ళనీయడం లేదు. తామే సంతకం పెట్టిస్తామని డబ్బు తీసుకున్నారు. క్లర్కూ డబ్బు తీసుకున్నాడు. అయినా వారంరోజులుగా తిరుగుతున్నా పనికావడంలేదు. రెండురోజుల్లో దరఖాస్తివ్వకుంటే స్కాలర్‌షిప్ రాదు. తలపట్టుకొని కలెక్టరాఫీసు ముందు చెట్టుకింద కూర్చున్నాడు సాంబయ్య. ప్రభుత్వాఫీసుల పనితీరును, అవినీతిని గూర్చి ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆతనికి చికాకుగా ఉంది. సంతకం కోసం తిరిగి తిరిగి వేసారిపోయాడు.

వదులుగా ఉన్న పాంటు షర్టు వేసుకొనున్న ఓ బక్కపలుచటి వ్యక్తి అతని దగ్గరకొచ్చాడు.

"ఏం బాబూ! ఇక్కడేం చేస్తున్నావు. రెండు రోజులుగా నిన్ను చూస్తున్నాను'' అన్నాడు. అతడెవరో సాంబయ్యకు తెలియదు. లేచి నిల్చున్నాడు సాంబయ్య.

"మీరెవరు సారు?" అనడిగాడు..

"నా పేరు మురళయ్య. గట్టెపెల్లి మురళయ్యంటారు నన్ను''

ఆ పేరు ఎందరి నోట్లనుంచో విన్నాడు సాంబయ్య. రజాకార్ల పోరాటంలో వీరోచితంగా పోరాడాడని విన్నాడు. కాని ఆతన్ని చూడటమదే మొదలు. ఆతన్ని చూస్తున్నందుకానందంగానూ, ఉద్వేగంగానూ




ఉంది సాంబయ్యకు. ఆ పేరుపై ఉన్న భక్తి గౌరవాలను ఆపుకోలేక అతని పాదాలకు సమస్కరించాడు. సాంబయ్యను లేపి నిల్చో బెట్టాడు మురళయ్య.

"సార్... సార్... గట్టె మురళయ్యంటే మీరేనా?" అన్నాడు.

"అవును'' అని తాను రజాకార్లకెదురొడ్డి పోరాడిన ఒకటిరెండు సంఘటనలను గూర్చి చెప్పాడు. తన కాలుకైన తుపాకీ గుండు గాయాన్ని చూపించాడు.

అతన్ని చూశానన్న ఆనందంతో మాట పెగిలిరావడం లేదు సాంబయ్యకు.

రెండుసార్లు మురళయ్య మళ్ళీ అడుగగా తను అక్కడికొచ్చిన సంగతి గూర్చి చెప్పాడు సాంబయ్య.

"సంతకం పెడుతలేడా? ఏ గాడిదికొడుకు నీకు సంతకం పెట్టంది? ఇటియ్యి'' అని సాంబయ్య చేతిలోని దరఖాస్తు తీసుకున్నాడు మురళయ్య. మెట్లెక్కి గబగబా డి.ఆర్.ఓ. ఆఫీసులో కెళ్ళాడు. అతనికెవరూ అడ్డు చెప్పలేదు. ఐదు నిమిషాల్లో సంతకం చేయించుకొని తిరిగొచ్చాడు.

"మైట్ ఈజ్ రైట్‌రా... ఎవ్వరూ మెల్లమెల్లగ చెప్పుతే వినడు. మీ ఊళ్లున్న వెంకటేశ్వరరావు మాకు చుట్టమే. వాడొట్టి ఫ్యూడల్ వెధవ. అప్పుడు మమ్మల్ని దొంగలని, హంతకులని ప్రచారం చేసినవాళ్లలో వాడొకడు. ఈ వ్యవస్థలో ఏదో బాముకుంటానను కుంటున్నాడు వాడు. రోజురోజుకు దిగజారుతున్నా తెలిసిరావడంలేదు'' అని దరఖాస్తు సాంబయ్యకిచ్చి "పో బిడ్డ పో' అన్నాడు.

మురళయ్యకు నమస్కారం చేసి వెళ్లిపోయాడు సాంబయ్య. మురళయ్యను కలుసుకున్న సంఘటనను సాంబయ్యెప్పుడూ మరిచిపోడు.

సాంబయ్య చదువులో నిమగ్నమయ్యాడు. పరీక్షలు దగ్గరపడుతున్న కొద్దీ మరింత సీరియస్‌గా చదువుతున్నాడు. అప్పుడప్పుడు చూసే సినిమాలను కూడా చూడటంలేదు. ఇప్పుడు ఊరికి పదిహేనురోజులకొక్కసారి పోయొస్తున్నాడు. ప్రతి పండుగకు తప్పకుండా వెళ్ళొస్తున్నాడు. ఈసారి ఉగాది పండుగకెళితే తండ్రి సాంబయ్యనే పండుగరోజున 'సాగువాటు' కావాలన్నాడు. సాంబయ్య పేరు మీదనే మంచిగుందన్నాడు. తండ్రి మాటను వినక తప్పలేదు సాంబయ్య. ఉగాది తర్వాత కాలేజీకొచ్చాడు సాంబయ్య.

లెక్కల క్లాస్ జరుగుతోంది. ఎమ్‌క్యూబ్ ($M^3$) శర్మ ట్రిగనోమెట్రీ చెబుతున్నాడు. అతని పేరు మదనమోహన్ మాలయ్య శర్మ. అయితే అతన్నందరూ పై పేరుతోనే పిలుస్తారు. సాంబయ్య పక్కన కృష్ణమూర్తి కూర్చున్నాడు. అతని పక్కన వేణు. శర్మ క్లాసవుతోంది.

"వేణూ, వేణూ! ఉగాదినాడు నువ్వెన్ని బూరెలు తిన్నవు?" అన్నాడు కృష్ణమూర్తి సీరియస్‌గా.

'థట్ నీ యవ్వ! నువ్వో తిండిపోతువు న్నవ్. ఎన్ని బూరెలు తింటె నీకెందుకు?" కోపంగా అన్నాడు వేణు.

చాక్‌పీసు ముక్కలను ఇద్దరి మీదికి విసిరేశాడు శర్మ. అందరూ నవ్వారు.

ఆ రోజంతా కృష్ణమూర్తి మాటలగూర్చే జ్ఞాపకం చేసుకుంటూ నవ్వుకున్నాడు సాంబయ్య.

చూస్తూండగానే, పట్టణ జీవితానికి అలవాటుపడుతుండగానే ఆ సంవత్సరం చదువయిపోయింది. ఆ సంవత్సరమే పి.యు.సి. చివరిబ్యాచ్. అలాగే మల్టీపర్పస్ స్కూళ్లలో పన్నెండవ తరగతి కూడా. వీళ్లతో పాటే ఇంటర్ మీడియేట్ బ్యాచ్ మొదలైంది.

ఆ సంవత్సరం పరీక్షలు కొంత స్ట్రిక్టుగానే జరిగాయి. పి.యు.సి.లోని సాంబయ్యతో పాటు మరో ఇద్దరు ఫస్టుక్లాసులో పాసయ్యారు.



కొండల్‌రెడ్డి సాంబయ్యనెంతో మెచ్చుకున్నాడు. కొడుకుని చూసి చిలుకయ్య గర్వపడ్డాడు. కిషన్‌రెడ్డి హైదరాబాద్ నిజాం కాలేజీలో డిగ్రీలో జాయినయ్యాడు. సాంబయ్య కరీంనగర్‌లోనే బి.ఎస్సీలో జాయినయ్యాడు.

సాంబయ్య వద్దంటున్నా కిషన్‌రెడ్డి సాంబయ్య సర్టిఫికెట్స్ ట్రూకాపీలు తీసుకొని ఉస్మానియాలో ఇంజనీరింగ్ సీట్ కోసం దరఖాస్తు చేశాడు. తాను కూడా దరఖాస్తు పెట్టుకున్నాడు. సమ్మెలు, ఇంటర్మీడియేట్ బ్యాచ్‌లాంటివన్నీ ఉండటంవల్ల ఇంజనీరింగ్ అడ్మిషన్స్ లేటయ్యాయి. అప్పటికింకా ఎంసెట్ లేదు. మెరిట్ మార్కులతోనే సీట్ లభించింది.

సాంబయ్య బి.ఎస్సీ ఫస్టియర్ క్లాసులు ప్రారంభమై రెండు నెలలైన తర్వాత కిషన్‌రెడ్డి సాంబయ్యకు ఇంజనీరింగ్‌లో సీటు వచ్చిందని, వచ్చి జాయిన్ కమ్మని లేఖ రాశాడు. ఆ తర్వాత తానే వచ్చాడు..

సాంబయ్య అప్పుడు సందిగ్ధంలో పడ్డాడు. హైదరాబాద్ వెళ్ళి ఇంజనీరింగ్‌లో జాయిన్ కావడమా? కరీంనగర్‌లోనే ఉండి డిగ్రీ చేయడమా? తనకు స్కాలర్‌షిప్ వస్తున్నప్పటికీ ఈ డిగ్రీనే అతికష్టంగా చదివిస్తున్న తండ్రి తనను హైదరాబాద్‌లో చదివించగలడా? తాను మాత్రం అంత దూరంలో ఉండి చదువుకోగలడా?' సాంబయ్య తనకుతాను ఎన్నో ప్రశ్నలు వేసుకున్నాడు.

ఇంజనీరింగ్ చదివితే మంచి భవిష్యత్తుంటుందని, బి.ఇ.లో సీటు రావడం అపూర్వమని, తప్పకుండా జాయిన్ కమ్మని చెబుతున్నాడు కిషన్‌రెడ్డి. కరీంనగర్‌లోని మిత్రులు కూడా అదే అంటున్నారు. కిషన్‌రెడ్డిని తీసుకొని ఊరెల్లాడు సాంబయ్య. చిలుకయ్య, సాంబయ్య కలిసి కొండల్‌రెడ్డి దగ్గరికెల్లారు.

"కిషన్‌రెడ్డికి, నీకు ఇద్దరికీ బి.ఇ.లో సీటు వస్తుందనుకున్న నీకొచ్చింది. వాడికి రాలేదు. వాడికి నీకంటే తక్కువ మార్కులున్నయికదా. ఇంజనీరింగ్‌లో సీటు రావడం మామూలు విషయం కాదు. ఇంకేం ఆలోచించకుండా పోయి జాయినవ్వు. ఏమంటవు సాంబయ్యా'' అన్నాడు కొండల్‌రెడ్డి.

సాంబయ్యేం మాట్లాడలేదు.

"కొడుకును చదివియ్యనంటన్నవా చిలుకయ్య''

"నాకైతె చదువుల సంగతేం దెలువది. వాడు చదువుకుంటానంటె చదువుకోనియ్యి. ఎల్లకుంటె ఇంత అప్పుజేత్త. వాడే తేరుపుకుంటడు. లేకుంటే ఇంతంత భూమమ్ముత. వానిష్టం ఎక్కన్నన్న చదువుకోనియ్యండ్రి'' అన్నాడు చిలుకయ్య.

"చిలుకయ్యా! వెనుకకు రాకు. కావాల్సింటె నేను సాయంజేత్త. నౌకరయింతర్వాత సాంబయ్యే అప్పు తీర్పుకుంటడు. మనూల్లెనుంచి ఓ ఇంజనీరు కానియ్యి'' అన్నాడు కొండల్‌రెడ్డి.

చిలుకయ్య ఏం మాట్లాడటంలేదు. సాంబయ్యకేం మాట్లాడాలో అర్థం కావడంలేదు. ఇంతవరకు జీవితమంతా గ్రామంలోనే గడిపి కేవలం ఉపాధ్యాయుల్లాంటి ఉద్యోగులనే చూసిన సాంబయ్యకు ఇంజనీరింగ్ చదువు యొక్క విలువ తెలియదు. పోగా అతడేవేవో ఆదర్శాలను మనసులో పెట్టుకున్నాడు. డిగ్రీచేసి ఉపాధ్యాయుడిగా చేరి తనకు సాధ్యమైనంతవరకు సేవ చేయాలనుకుంటున్నాడు సాంబయ్య. నరహరిసారు మాటలు, మల్లేశంసారు బోధలు, ఐజాక్ డి.ఇ.ఓ. ఉపన్యాసం అతనిపై గాఢముద్ర వేశాయి. అంతేకాకుండా తండ్రి నప్పులపాలుచేసి అది చదువకుంటేంబోతుంది? అనుకున్నాడు. అయినా ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు.

కొద్దిసేపు మాట్లాడి ఇంటికెల్లారు చిలుకయ్య, సాంబయ్య.

తెల్లవారి సాంబయ్య, కిషన్‌రెడ్డి కరీంనగర్ వెల్లారు. కిషన్‌రెడ్డి సాంబయ్యను




రమ్మని మరీమరీ చెబుతూ హైద్రాబాద్ వెళ్లిపోయాడు. గడువు తేదీ నాలుగైదు రోజులైనా లేదు. సాంబయ్య ఇంకా రాలేదు. కిషన్‌రెడ్డి వచ్చి జాయిన్ కమ్మని లేఖ రాశాడు.

బాగా ఆలోచించిన సాంబయ్య తాను ఇంజనీరింగ్‌లో జాయిన్ కావడంలేదని, ఉపాధ్యాయుడిగా చేరి భవిష్యత్తులో సేవ చేస్తానని, ఏవేవో ఆదర్శాలు వల్లిస్తూ కిషన్‌రెడ్డికి లేఖ రాశాడు. అపూర్వమైన అవకాశాన్ని ఆవిధంగా జారవిడుచుకున్నాడు.



సాంబయ్య ఇప్పుడు జ్యోతినగర్‌లో గదిని అద్దెకు తీసుకొని ఉంటున్నాడు. అతని రూమ్మేటు ఈశ్వర్. ఆ గదిపక్కనే మరో గదిలో వేణు, సారధి, చక్రపాణి ఉంటున్నారు. ఆ నలుగురితో మంచి స్నేహం కుదిరింది సాంబయ్యకు. వాళ్లంతా ఒకరితో పోటీపడి ఒకరు చదువేవాళ్లే. అందరూ దిగువ, మధ్య తరగతి కుటుంబాల్లోంచి వచ్చినవాళ్లే. వాళ్లంతా కలిసి కాలేజీకెళ్తున్నారు. కలిసి చదువుకుంటున్నారు. ఎన్నో విషయాలను చర్చించుకుంటున్నారు. తాము చదువుకొని తల్లిదండ్రులకు బాసటగా నిలవాల్సిన అవసరాన్ని తేపతేపకు గుర్తు చేసుకుంటున్నారు.

తీరిక దొరికినప్పుడు సాంబయ్య జిల్లా గ్రంథాలయానికెళ్లేవాడు. అతనితో ముఖ్యంగా సారధి వెళ్లేవాడు. వాళ్లక్కడ ఎన్నో పుస్తకాలు చదివేవారు. సాహిత్యంతో కొంత కొంత పరిచయమేర్పడింది సాంబయ్యకు. అయితే తాననుభవించిన జీవితం, ఎదుర్కొన్న అనుభవాలు అతనికి బోధించిన మల్లేశంలాంటి ఉపాధ్యాయుల ప్రభావం సాంబయ్య ఆధునిక సాహిత్యంవైపు మొగ్గు చూపేట్టు చేశాయి. సారధి, సాంబయ్య తమకున్న పరిమిత పరిజ్ఞానంతో ఏవేవో చర్చించుకునేవారు. సారధి సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలోంచి వచ్చినవాడు. అతనికి ప్రాచీన సంస్కృతి సాంప్రదాయమన్నా, పూర్వ వైభవమన్నా ఇష్టం.

అందుకే అతడు విశ్వనాధ సత్యనారాయణ సాహిత్యాన్ని అభిమానించేవాడు. అతనిపై అపారమైన భక్తిశ్రద్ధలను చూపేవాడు. చంధోబద్ధం కాని ఆధునిక సాహిత్యం అసలు సాహిత్యమే కాదనేవాడు. శ్రీశ్రీ, సినారెలాంటివాళ్లసలు కవులే కాదనేవాడు. సాంబయ్యకా మాటలు నచ్చేవి కావు. వాళ్ల గూర్చి పెద్దగా చదువకున్నా సారధి వాదన తప్పనుకునేవాడు.

'వాక్యం రసాత్మకం కావ్యం' అని తెలుగు లెక్చరర్ చెప్పిన వాక్యాన్ని గుర్తుంచుకొని రసాత్మకంగా ఒక్క వాక్యం రాసినా అది కావ్యమే అని వాదించేవాడు. నడుచుకుంటూ కాలేజీకెళ్తున్న సమయంలో వాళ్లు తెలిసీ తెలియని ఎన్నో విషయాలు చర్చించుకునేవారు. ఈశ్వర్ కూడా సాంప్రదాయ కుటుంబంలోంచి వచ్చినవాడే. మరీ అమాయకుడు. అతనికి పల్లె జీవితంతో పెద్దగా పరిచయం లేదు. టౌన్‌లోనే పుట్టిపెరిగాడు. తండ్రి ఉద్యోగి.

"ఊళ్లలో దొరలు బాగా సాగించుకుంటరు'' అన్నాడు కాలేజీకెళ్తుండగా సాంబయ్య.

"మా చెప్పినవు తియ్యి. వాళ్ల భూముల్లో కూలిపనులు చేస్తూ ఎంతోమంది బతుకుతున్నారు'' అన్నాడు ఈశ్వర్.

"ఈశ్వర్ నీకు తెలిసింది తక్కువ.

ఊళ్లలో దొరలతో బాధితులెంతోమందున్నారు'' అన్నాడు సాంబయ్య.

"మీ శూద్రులకు పెద్దకులాల వాళ్లంటే మంట. అందుకే వాళ్లమీద ఏవేవో చెబుతారు''

ఈశ్వర్ మాటలకు సాంబయ్య మనసు గాయపడింది.

"మనకు సంబంధం లేని విషయాలు మనకెందుకు? మనం వచ్చిందిక్కడికి చదువుకుంటానికి. కావాల్సుంటే బెర్నార్డ్‌షా డాక్టర్స్ డైలెమా నాటకం గురించి చర్చిద్దాం. అది మనకు పాఠ్యభాగంలో ఉంది'' అన్నాడు వేణు.

వేణుకివేమీ పట్టవు. తల్లిదండ్రులు ఎంతో కష్టపడి తనను చదివిస్తున్నారు. తాను మంచి మార్కులతో పాసై మంచుద్యోగం సంపాదించుకొని కుటుంబాన్ని ఆర్థికంగా నిలదొక్కుకునేట్టు చేయాలి. చెల్లెండ్ల పెళ్లిళ్లు చేయాలి. సమాజం గూర్చో మరి దేన్ని గూర్చో పట్టించుకునే తీరికా ఓపికా తనకు లేవు. తను ఊరి బళ్లో చదువుకున్నప్పుడు తన మనసెప్పుడూ వ్యవసాయంపైనే ఉండేది. బడికి కొంచెం దూరంలో ఉన్న పొలానికి ఏమాత్రం సమయం దొరికినా పరుగెత్తుకొని వెళ్లి నీళ్లు పెట్టి వచ్చేవాడు. అతనికిప్పుడు చదువొక్కటే ధ్యేయం...

"అవునవును. వేణన్నది నిజం. అయినా ఇంకా నాటకం పూర్తికాలేదు కదా! ప్రభాకర్ సారు డ్రామానెంత బ్రహ్మాండంగా చెబుతున్నాడు'' అన్నాడు చక్రపాణి.

వాళ్లు కాలేజీకెళ్లేసరికి విద్యార్థి యూనియన్ ఎన్నికల గూర్చి చర్చలు జరుగుతున్నాయి.

'మళ్లీ మొదలైందా బాగోతం....' తనలో తానే అనుకున్నాడు సాంబయ్య. ఆరోజు హైద్రాబాద్‌లో జరిగిన ఏదో సంఘటన గూర్చి సమ్మె చేయాలన్నారు. కొందరు విద్యార్థులు వద్దంటున్నారు. కొందరు చేయాలంటున్నారు. క్లాసులు వదిలిపెట్టి వెళ్లిపోవాలని చెబుతున్నారు.

"మనకు సంబంధం లేని విషయాల గూర్చి మనం చదువునెందుకు పాడు చేసుకోవాలి?" అన్నాడో విద్యార్థి.

"ఓ... ఇగ చదివి పొడుగు జేస్తడు? మనకు సంబంధముంటేంది లేకుంటేంది? స్ట్రైకంటే స్ట్రైకే'

ప్రత్యేక తెలంగాణా ఉద్యమం తర్వాత విద్యార్థుల్లో అరాచకత్వంతోపాటు ఓ తెగింపూ వచ్చింది. తమకు సంబంధమున్నా లేకున్నా ప్రతి విషయానికీ పాజిటివ్‌గానో, నెగెటివ్‌గానో స్పందించడం మొదలైంది.

ప్రతి గదికెళ్లే కొంతమంది విద్యార్థులు పిల్లలను బయటకు పంపిస్తున్నారు. సాంబయ్య గదిలో ప్రకాశ్‌రెడ్డిసారు మ్యాథ్‌మాటిక్స్ చెబుతున్నాడు. అతడు చాలా మంచి ఉపాధ్యాయుడు.

"విద్యార్థులను బయటకు పంపండి. ఈరోజు సమ్మె'' అన్నాడో విద్యార్థి. మిగతా వాళ్లతని చుట్టూ మూగారు.

"ప్రతి విషయానికీ సమ్మెలంటూ చదువు నెందుకు పాడు చేసుకుంటారు? మీరు కాలేజీ లెగ్గొడితే పనులవుతాయా...?" ఏదో చెబుతున్నాడు ప్రకాశ్‌రెడ్డి.

"నకురాల్ జేత్తున్నడేందిర?" అంటూ ఎవరో ఒకతను వెనుకనుంచి అతని తలపై ఒక్క దెబ్బేశాడు. ప్రకాశరెడ్డి కళ్లవెంట నీళ్లు రావడమొక్కటే తక్కువ. విద్యార్థులంతా లేచి బయటకెళ్లారు. సాంబయ్య, వేణు కలిసి సారు గదిలోకెళ్లి సానుభూతి మాటలు మాట్లాడి వచ్చారు.

యూనియన్ ఎన్నికలు ఈసారి కూడా పెద్ద గొడవలతోనే పూర్తయ్యాయి. ఇద్దరి విద్యార్థుల తలలు పగిలాయి. చదువుకుంటానికి వచ్చినవాళ్లకిన్ని కొట్లాటలెందుకో సాంబయ్యకర్థం కావడంలేదు. ఆ నలుగురితో మంచి స్నేహమైంది సాంబయ్యకు. వా






ళ్లంతా చదువులో హుషారే. దాదాపందరికీ చదువే ముఖ్యోద్దేశ్యం. అందరి ఆర్థిక పరిస్థితులూ ఇంచుమించొకేవిధంగా ఉన్నాయి. అందుకే వాళ్ళమధ్య స్నేహం బలపడింది. అయితే అప్పుడప్పుడూ పట్టుదలలకు పోయి కొన్ని కోతి పనులూ చేసేవారు.

ఓరోజు ఆ ఐదుగురూ కూరగాయల మార్కెట్కెళ్లారు. ఏది తక్కువ ధరకు లభిస్తే దాన్ని కొనుక్కోవడం వాళ్లకలవాటు. ఇంటికెళ్లింతర్వాత పంచుకోవచ్చని అంతా కలిసే ఓ పొడవైన సొరకాయ కొన్నారు. కూరగాయలు దస్తీల్లో కట్టుకొని తేవడం అలవాటు. సొరకాయ దస్తీలో పట్టదు. దాన్నెవరు ఇంటివరకు తీసుకెళ్లాలన్నది ప్రశ్న. మార్కెట్నుంచి గదివరకు గల దూరాన్ని ఐదు భాగాలుగా విభజించారు. అంతంతదూరం ఒక్కొక్కరు పట్టుకోవాలని నిర్ణయించుకున్నారు. మొదట సాంబయ్యే పట్టుకున్నాడు. తన దూరమైపోయిం తర్వాత వేణుకిస్తే తీసుకోవడంలే

దు. పైగా నేనైతే కింద పడేసి వచ్చేవాడినని సాంబయ్యను రెచ్చగొడుతున్నాడు. మూడు సార్లడిగినా వేణు తీసుకోలేదు. సాంబయ్య అక్కడే నిల్చున్నాడు.

"నేను మోసే దూరం అయిపోయింది. సొరకాయను కింద పెడ్తున్నాను. మీ ఇష్టం" అన్నాడు. అలాగే అంటాడు సాంబయ్య. పారవేయడని వాళ్లంతా అనుకున్నారు. కాని సాంబయ్య అన్నంతపనీ చేశాడు. దాన్నలాగే వదిలి అంతా వెళ్లిపోయారు. ఆ విషయాన్ని జ్ఞాపకం చేసుకొని వాళ్లనేకసార్లు నవ్వుకుంటారు.

క్లాసులిప్పుడు రెగ్యులర్‌గా సాగుతున్నాయి. సాంబయ్య, అతని మిత్రులు సీరియస్‌గానే చదువుకుంటున్నారు.

'కరీంనగర్‌కు వాజ్‌పేయ్ రాక

'జనసంఘ్ నాయకుడు వాజ్‌పేయ్ రాక...'

'గంజ్‌లో పెద్ద బహిరంగ సభ...'

గోడలనిండా అటల్ బిహారీ వాజ్‌పేయ్ రాక గురించి రాస్తున్నారు. కొందరు విద్యార్థులు కూడా వాజ్‌పేయి రాక గురించి చెబుతున్నారు.

బహిరంగ సభకు చాలామంది విద్యార్థులు హాజరయ్యారు. సాంబయ్య, అతని మిత్రులు కూడా హాజరయ్యారు. హిందీలో అతని ప్రసంగం ఎంతో ప్రభావస్ఫోరకంగా ఉంది. దేశాన్ని గూర్చి, దేశభక్తిని గూర్చి, అధికార పార్టీ తప్పులను గూర్చి గంటకుపైగా ఉపన్యసించాడు వాజ్‌పేయ్. ఐదేళ్ళక్రితం ఇందిరాగాంధీ చెప్పిన విషయాలకూ, ఈరోజు వాజ్‌పేయ్ చెప్పిన విషయాలకూ మధ్యగల బేధాలను గూర్చి ఆలోచిస్తూ ఇల్లు చేరుకున్నాడు సాంబయ్య. అప్పుడప్పుడే దేశాన్ని గూర్చి, సమాజాన్ని గూర్చి తెలుసుకుంటూ ఆలోచించే స్థితికొస్తున్న సాంబయ్యకంతా గందరగోళంగా కనబడుతోంది.

డిగ్రీ మొదటి సంవత్సరం సగానిపైగా గడిచిపోయింది. మొట్టమొదటిసారిగా నక్సల్‌బరి, నక్సలైట్, శ్రీకాకుళ రైతాంగ పోరాటం అన్న మాటలను విన్నాడు సాంబయ్య. ఇంతకుముందు అప్పుడప్పుడు పత్రికల్లో ఆ పేర్లు చదివినా ఇంత దగ్గరగా ఎప్పుడూ వినలేదు. ఎవరో సాంబయ్య గదికొచ్చి నక్సల్‌బరిలో ప్రారంభమైన పోరాటం శ్రీకాకుళంలో ఉవ్వెత్తున లేచిందని మొన్నమొన్నటి వరకూ సాగి అణచివేతకు గురైందని చెప్పాడు. ఆ పోరాటంలో అసులువు బాసిన వెంపటాపు సత్యంలాంటివాళ్ల పేర్లు చెప్పాడు.

నక్సలైట్ అన్న పదం వింటేనే సాంబయ్య వెన్నులోంచి వణుకులాంటిది పుట్టుకొస్తుంది. ఒళ్లంతా భయంతో వణికిపోయింది. మధ్యతరగతి ఆలోచనలకే పరిమితమై చదువేదో ఒరగబెడ్తుందని భావిస్తున్న సాంబయ్యకు విపరీతంగా భయమేసింది. తన చదువెక్కడ పాడైపోతుందోనని, తానెక్కడ తనవారికి దూరమైపోతానోనని ఆందోళన కల్గింది. ఈశ్వర్ అతడు చెప్పిన మాటలను పట్టించుకోనేలేదు. ఎన్నో విషయాలు చెప్పి అణచివేత ఎక్కువగా ఉన్న తెలంగాణలో పోరాటాలు ప్రారంభమవుతున్నాయని కొన్నేళ్లలో అవి ఉధృతంగా సాగుతాయని చెప్పాడు. చదువుల నిష్ప్రయోజకత్వాన్ని, గుమస్తాలను చేసే చదువులను గూర్చి చెప్పాడు. అతడి మాటల్లో ఎన్నో నిజాలున్నట్లనిపించినా గ్రామాల్లో దొరల గూర్చి చెప్పిన విషయాలు తాను కొంతవరకైనా చూసినవే అయినా ఆ పదాలు వింటే గజగజ వణికిపోయాడు సాంబయ్య.

అన్నీ చెప్పి విప్లవ రచయితల సంఘం గూర్చి చెప్పాడతను. చదవమని కొన్ని పుస్తకాలిచ్చిపోయాడు. ఆ పుస్తకాలు ముట్టుకోకూడదనుకుంటూనే తెరిచాడు సాంబయ్య. వాటిని చూస్తే మరింత భయమేసింది. ఆ పుస్తకాలు చదువుతుంటే రక్తం సలసలా మరుగుతోంది. వాటిని అలాగే చదివితే




తాను చదువు కొనసాగించడం అసాధ్యమని దాచిపెట్టాడు సాంబయ్య. అయితే వాట్లో తనలాంటివాళ్లకు, తన తండ్రిలాంటి శ్రమజీవులకు కావాల్సినవేవో ఉన్నాయని మాత్రం గ్రహించాడు. వాటినుండి దృష్టిని మరల్చి చదువుపై మనసును లగ్నం చేశాడు సాంబయ్య. అయినా ఆ పుస్తకాలతన్ని వెంటాడుతూనే వున్నాయి. ఆ వ్యక్తి విద్యార్థుల గదుల్లోకి అప్పుడప్పుడు వచ్చి పోతున్నాడు. అతన్నుండి తప్పించుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు సాంబయ్య. అటు దృష్టి మరలకుండా ఉండడానికి మరింత ఎక్కువ సమయాన్ని చదువుపై కేంద్రీకరిస్తున్నాడు.

డిగ్రీ మొదటి సంవత్సరం చివర్లో ఇంటి కెళ్లాడు సాంబయ్య. కొడుకు చదువును గూర్చి అడిగాడు చిలుకయ్య. దినదినం దిగజారుతున్న ఆర్థిక పరిస్థితిని గూర్చి చెప్పాడు.

"సాంబయ్యా! బొడ్లెవరాలు పోసుకొని పుట్టిన్ననుకున్నడు వెంగళరావు దొర. ఎప్పటికి తనదే సాగుతదనుకున్నడు. గా పడుసు పోరగాండ్లు యువజన సంఘం పెట్టిండ్రు గద... గాల్లు దొరనడిగెటోల్లయిండ్రు..."

"ఏమైంది బాపూ... ఏమైంది?"

"గా చెర్ల నీళ్లనమ్ముకుంటె ఎవ్వలూ కుంటరు? ఇన్ని రోజులు ఎవ్వలేం నోరు దెరువలే. గా పోర పోరగాండ్లంత అడుగన్నని అడిగిండ్రు''

"దొరేమన్లేడా మరి...?"

"ఎందుకేమనడు? వాళ్లడిగెవారకు కిందు మీదయిండు. నన్నడిగెటోల్లా అని కోపానికచ్చిండు. అయినా తెగిన బొక్కెన నూతిల్దాకని ఆల్లకేమైతది? దొరెంత బెదిరించినా వాళ్లు జెనుకలే'

"మునుపటి లెక్క చెరువు నీల్లు పొరుగూరువాళ్లకు అమ్ముడు బంద్యైనట్టేనా?"

"ఎంత కోపమున్నా ఏం జెయ్యాల్లో తెలువక పోరగాండ్లు చెప్పిందానికే ఒప్పుకున్నడు. మొన్న అమ్మితే వచ్చిన పైసలను ఊరుకే ఇస్తనన్నడు''

"బాపూ! మా రూముల్లోకి ఎవరెవరో వస్తున్నరు. వాళ్లు చెప్పేవి నిజమేననిపిస్తున్నా వింటుంటే భయమేస్తోంది''

కొడుకు మాటలు విన్న చిలుకయ్య గుండె గుభేలుమంది.

"నా చిన్నప్పుడు కూడా కమ్యూనిస్టోల్లు వత్తురు... వీళ్లు అటువంటోల్లేనేమో! గవ్విన్ని పట్టించుకోకు బిడ్డ... ఎవ్వలెక్కడ పోతే మనకేంది?" అన్నాడు.

"నేనెందుకు పట్టించుకుంటాను బాపు? నాకు తెలియదా?"

"ఇంకో సంగతి బిడ్డ... కొండల్‌రెడ్డిగా పరంపోగు భూములాగవట్టుకున్నడట గద... అవ్వీట్ని గూడ విడిచిపెట్టవల్సచ్చింది. ఏమనుకున్నడో ఏమొ కొండల్‌రెడ్డి పడుసు పోరగాండ్లడుగంగనే కొంత నయమే... వదిలిపెట్టిండు''

"ఎంతైనా కొండల్‌రెడ్డి కొంత నయమే బాపు. మిగతా దొరలంత అధ్వాన్నం కాదు. గీ దొరల గురించి కూడ మా రూంకొచ్చినాయన చెప్పాడు''

"వాళ్లెవరో ఎంటో తెలువది. రూంలకెందుకు రానిస్తండ్రు... అటెనుక పీకులాటైతది''

తన ఊళ్లో జరుగుతున్న విషయాలకు సంతోషపడుతూ అలాంటివాట్లో తన ప్రమేయం ఏమాత్రం ఉండకూడదని ఆందోళన పడుతున్న తండ్రి సాంబయ్యకర్థం కాలేదు. ఎక్కడేం జరిగినా తనకేమాత్రం ఇబ్బందీ కలుగకూడదని భావిస్తున్న తండ్రి మధ్యతరగతి మనస్తత్వం సాంబయ్యకు బోధపడటంలేదు. ఆ మనస్తత్వాన్నే జీర్ణించుకున్న సాంబయ్యకు ఆ మాటల్లో తప్పుమాత్రం కనబడలేదు.

"నాకెక్కడ తీరిక దొరుకుతది బాపు? ఆ లెక్కలు, ఫిజిక్స్, కెమిస్ట్రీ వాటితోనే కుస్తీ

పడాలి! నాకు చదువు తప్ప మరో ధ్యాసుండదు'' అన్నాడు సాంబయ్య.

"ఈ సందు జూసుకొని గొల్లోల్లవెట్టి గొర్లిచ్చుడు బందు జేసింద్రు... వాల్లు యాదవ సంఘం పెట్టుకున్నప్పట్నుంచే అనుకుంటంద్రు. గిప్పుడైందా పని?"

"మరి వాళ్లకెందుకియ్యాలె బాపు వెట్టిగొర్లు? కష్టపడేదేమొ వాళ్లు. వెట్టి గొర్లేమొ దొరలకియ్యన్నా?"

"ఎనుకట్నుంచి సాగుతంది. దొరలను కాదని బతికినోల్లెవ్వలు? ఇప్పుడిప్పుడు అడుగుతంద్రు''

ఊళ్లో చోటుచేసుకుంటున్న మార్పుల గూర్చి చెబుతున్నాడు చిలుకయ్య.

"చదువుకున్న పొల్లగానికి గవ్వన్నెందుకు చెప్పుతన్నవు? గివ్వన్నేం మను సునవడుతయాల్లకు'' అంది రాజమ్మ.

"చిలుకన్నా... మనూరికి బస్సచ్చిందే. అందరు పోయి చూస్తంద్రు. పోదాం పా... ఎన్నేండ్లవట్టి వత్తదనుకుంటంద్రు? గిప్పుడచ్చె'' వాకిట్లో కడుగుపెడుతూనే అన్నాడు రామనర్సు.

"అబ్బ... తిరుగంగ తిరుగంగ గిప్పుడచ్చిందా? ఇగ మనకు బస్సెక్కుటానికి గంత దూరం నడుసుడు తప్పుద్ది. పోయి చూసత్తాం పా'' అని లేచాడు చిలుకయ్య.

రామనర్సు, చిలుకయ్య ముందు వెళ్లారు. వాళ్ల వెనుకనే సాంబయ్య పోయాడు.

బస్సును చూడటం కొత్తగాకున్నా ఆ ఊరికి ఆర్.టి.సి. బస్సు రావటం అదే ప్రథమం కాబట్టి ఊరివాళ్లు చాలామంద క్కడ గుమిగూడారు. డ్రైవర్, కండక్టర్‌తో మాట్లాడుతున్నారు.

"దసర పండుగకు మాకు మీ ఊరు తరపునుంచి మంచి గొర్రెపొట్టేలునియ్యాలె'' అన్నాడు డ్రైవర్.

"మా సర్పంచ్‌సాబ్ ఒప్పుకున్నాడుకదా! మా ఇస్తం. ఊరు పేరుమీన్నేకద! అదేమంత బిసాయదు?" అన్నాడు కారోబారి.

"గొల్లోల్లు ఎట్టిగొర్లు బందు జేసింద్రు గద.... ఏన్నుంచి తెచ్చిత్తరు?" అన్నాడు నర్సిరెడ్డి.

"కొనిస్తె ఐపాయెంబాయె'' అన్నాడు కారోబారి.

"అంతే... అంతే..." అన్నారందరూ.

రెండు రోజుల తర్వాత అదే బస్సులో కరీంనగర్ వెళ్లిపోయాడు సాంబయ్య.

* * *

"రజాకార్ల వ్యతిరేక పోరాటంగా ప్రారంభమైన తెలంగాణ పోరాటం భూపోరాటాలుగా మారాయి. వేలకొద్ది ఎకరాలను భూమిలేని వారికి పంచడం కూడా జరిగింది''

"పంచగానే ఏమైంది...? మళ్ళీ ఎప్పటి చిప్ప ఎనుగులకే నన్నట్టు పోరాటం విరమించగానే మొదటికొచ్చింది''

"కొందరి ద్రోహంవల్ల పోరాటం విరమించడం జరిగింది''

"ద్రోహమో గీహమో! ఇంత పెద్ద దేశంలో ఓ చిన్న ప్రాంతంలో పోరాటాలు జరిగి భూమిపంపకం లాంటివి జరిగినా అదెన్నేళ్లుంటుంది. దేశవ్యాప్తంగా జరిగినప్పుడది విజయవంతమవుతుంది''

"ఎంత గొప్ప పోరాటమైనా మొదలు ఏదోచోట ప్రారంభమై క్రమక్రమంగా విస్తరించడం జరుగుతుంది''

"ఏదేమైనా గాంధీలాగ కోట్లాదిజనాన్ని ప్రభావితం చేసే నాయకత్వం వహించే నాయకుడు రావాలి. అలాంటప్పుడే ఏ ఉద్యమమైనా విజయవంతమవుతుంది. గాంధీ సిద్ధాంతాలతో అందరూ ఏకీభవించకున్నా అతని చిత్తశుద్ధిని ఒప్పుకోవాలి''

"అతడు చేసిందంతా ఉన్నతవర్గ ప్రయోజనాల కోసమే. మొన్న మొన్నచ్చిన శ్రీకాకుళ గిరిజన తిరుగబాటు కూడా దారుణంగా




అణచివేయబడింది. ఎంతోమంది యువకులు, మేధావులు ఆ ఉద్యమంలో తుపాకీ గుండ్లకు బలయ్యారు''

"ఇప్పుడు మన తెలంగాణ ప్రాంతంలో కూడా వస్తదంటున్నరు. ఎవరెవరో వస్తున్నరు. ముఖ్యంగా మన విద్యార్థులే అందులో తిరుగుతున్నారు. విద్యార్థులకు రాజకీయాలొద్దని ఉపన్యాసాలు చెబుతారు మనవాళ్లు. మళ్ళీ ఆ విద్యార్థులనే అన్నిటికీ పావులుగా ఉపయోగించుకుంటారు''

"జై తెలంగాణ ఉద్యమం తర్వాతైతే అన్నిట్లో విద్యార్థుల పాత్ర ఎక్కువైంది''

"ఎవరెవరో వచ్చి రహస్యంగా చెబుతున్న రాజకీయాలు వేరు. యువకులైన కాలేజీ విద్యార్థులు ప్రతిదానిపట్లా స్పందించడం మామూలే. అయినా పోరాటాలు పోరాటాలంటూ బలికావడమే తప్ప ఒరిగేదేమున్నది. శ్రీకాకుళంలో జరిగేదేంటి?"

"అందుకే ఏదైతే ప్రజలు కోరుకుంటున్నారో అదే ప్రభుత్వం చేయడానికి సిద్ధమవుతుంది. ఇవన్నీ భూముల గురించే కద... భూసంస్కరణలను ప్రభుత్వమే అమలు చేస్తానంటుంది''

"ప్రభుత్వమట భూసంస్కరణలమలు చేస్తదట. మొదలైతే మంత్రులు తను భూములను వదులుకుంటే చాలు. అన్నిట్నీ అమలు చేసినట్టే''

"పి.వి.గారు అష్టభాషా ప్రవీణులు... మేధావులు... ముఖ్యమంత్రిగా భూసంస్కరణలు చేసి చూపెడతారు''

"ఈ రాజకీయనాయకులమీద ఇన్ని నమ్మకాలుండటం మంచిదే. అది అమాయకత్వం కూడా. తామే జమీందార్లయి భూములను ఇతర్లకు పంచుతామంటే నమ్మే అమాయకులెవరు?"

"అందులో పి.వి.గారు మాత్రం పోయడానికి కూడా ఢిల్లీ అనుమతే కావాలంటాడు. అతని ఢిల్లీ ప్రయాణాలతోనే సరిపోతుంది''

"నవ్వీన నాపచేనే పండుతుందంటారు. మేధావులు చేసేపనులు చాపకింది నీరులా ప్రభావం చూపుతాయి''

"భూసంస్కరణలన్నారో లేదో దొరలు భూములను భార్యల పేర్లమీద, సంతానం పేర్లమీద, బంధువుల పేర్లమీద, పాలేర్ల పేర్లమీద ఆఖరుకు కుక్కలు, నక్కల పేర్లమీద గూడ రిజిస్ట్రేషన్లు చేసి పారేస్తండ్రు. ఇంకే భూమిని పంచుతరు?"

"ఏదో పనికిరాని గుట్టలను, తుప్పలను వదిలిపెట్టినట్టు చేసి భూసంస్కరణలు చేశామని చేతులు దులుపుకుంటారు''

"ఇదీ వినోభాభావే సర్వోదయ ఉద్యమంలాంటిదే. సర్కారువాళ్ల పనులన్నీ ఇలాగే వుంటాయి''

"ఇంకో జోకు తెలుసా? భూసంస్కరణల మాటవిని కోస్తాలో విడాకులు తీసుకొని భూములను పంచుకున్నవాళ్లూ ఉన్నారంటున్నాడు. చట్టానికి చూస్తే వాళ్లు విడాకులు తీసుకున్నట్టు సంసారాలు మాత్రం ఎప్పటిలాగే చేస్తారు''

"ఇవన్నీ వట్టిబూటకాలు... శ్రీకాకుళం గొడవ చూసి, తెలంగాణ పసిగట్టి చేస్తున్న పనులు... ఇవన్నీ కంటితుడుపు వ్యవహారాలే''

ఫస్టియర్ తర్వాత వేసవి సెలవులయిపోయి కాలేజీ ప్రారంభమైనప్పట్నుంచీ విద్యార్థులు మాట్లాడుకుంటున్న మాటలను మననం చేసుకుంటున్నాడు సాంబయ్య. ఆ మాటలను వింటుంటే ఏదో తనకే తెలియని ప్రమాదమేదో సంభవించబోతోందనిపిస్తోంది సాంబయ్యకు. అయినా తనకివన్నీ అవసరంలేదు. వెళ్ళినవాళ్ళేమేమో చేస్తారు. తనకు చదువే ముఖ్యం. ఇంకేమీ వద్దు. తనకు తానే గట్టిగా నిర్ణయం చేసుకుంటున్నాడు సాంబయ్య. అయినా అప్పుడప్పుడు గదుల్లోకి వస్తున్న పుస్తకాలను చదువకుండా ఉండలేకపోతున్నాడు. అందులో ముఖ్యంగా యు

వకుల రక్తాన్ని ఉప్పొంగింపజేసే కవిత్వ ముండటం చూశాడు. దేనిపై దృష్టి మరల్చ కుండా చదవడానికి ప్రయత్నిస్తున్నా సాంబ య్యకు భయం భయంగానే ఉంటుంది.

ఇప్పుడు సాంబయ్యకు తన రూమ్‌మేట్ ఈశ్వర్‌ను చూస్తే కూడాభయమనిపిస్తుంది. ఎంతో అమాయకుడు తన చదువేంటో తనేంటోగా చూసుకునే ఈశ్వర్ ఈసారి సెల వులనుంచి వచ్చేప్పుడు బోలెడు పుస్తకాలు తెచ్చాడు. అవన్నీ ఎర్రజెండా పుస్తకాలే. తానవన్నీ చదివానని అందరూ చదవాలని చెప్పాడు ఈశ్వర్. సాంబయ్యకు వాటిని చూస్తే భయమేసింది.

"ఈశ్వర్! నీకెవరో బ్రెయిన్‌వాష్ చేసినట్టు న్నారు. ఈ పుస్తకాలన్నీ ఏంటి? నీకు చదువు కోవాలని లేదా?" అన్నాడు వేణు.

"ఈ చదువులు కేవలం గుమాస్తాలను తయారుచేయడానికి పనికొచ్చేవి మాత్రమే. ఇవి చదివితే ఒరిగేదేం లేదు. అసలు చదువు లు సమాజాన్ని గూర్చి చెప్పేవి. అవి మన విద్యాలయాల్లో చెప్పరు. మనకు కావా ల్సింది శాస్త్ర విద్యావిధానం"

ఈశ్వర్ మాటలు విని నోరు తెరిచా రంతా. ఇంతవరకు కనీసం తమలాగా కూడా ఇతర విషయాల్లో పాల్గొనని ఈశ్వర్ అంతలోనైన మాటలు మాట్లాడటం ఆశ్చ ర్యం కల్గించింది. వేణు, చక్రపాణి, సారధి, ఈశ్వర్‌ను తమ గదికి రావద్దని, తమను ఇబ్బందిపాలు చేయొద్దని ఖచ్చితంగా చెప్పా రు. అయినా అతడేవేవో చెబుతూనే ఉన్నా డు. అందరికంటె ఎక్కువ సమయాన్ని చదువుకే వినియోగించే ఈశ్వర్ ఇప్పుడు పాఠ్యపుస్తకాలను ముట్టకోవడమే గగనమవు తుంది. ఎవరెవరో మిత్రులను తీసుకొస్తున్నా డు. అప్పుడప్పుడు కరపత్రాలు తెస్తున్నాడు. రాత్రుల్లో వాల్‌రైటింగ్‌కు పోతున్నానంటూ పోయి ఏ అర్ధరాత్రి దాటింతర్వాతో వస్తున్నా డు. ఈశ్వర్ తన రూమ్మేటుగా ఉంటే ప్రమాదమేననుకున్నాడు సాంబయ్య. ఈశ్వర్‌నైనా వేరేగది చూసుకొమ్మనాలి. లేదా తానైనా మరోగదికెళ్ళాలి అని నిర్ణయించుకు న్నాడు సాంబయ్య.

స్వాతంత్ర్యదిన సిల్వర్‌జుబ్లీ సందర్భంగా కాలేజీలో నిర్వహిస్తున్న స్వాతంత్ర్యం ప్రా ముఖ్యత అనే అంశంపై వ్యాసరచన పోటీ కోసం వ్యాసం తయారుచేస్తూ ఈ రెండు నెలలుగా జరుగుతున్న విషయాలను మననం చేసుకుంటున్నాడు సాంబయ్య. ఆరోజు ఆగష్టు 13. తెల్లవారి వ్యాసరచన పోటీ. 15 ఆగష్టు రోజున బహుమతి ప్ర దానం.

"ఏంటి ఏదో సీరియస్‌గా రాస్తున్నావు?" అంటూ గదిలోకి ప్రవేశించాడు ఈశ్వర్.

"వ్యాసరచన పోటీకోసం వ్యాసం"

"అంటే నీకింకా ఈ స్వాతంత్ర్యంమీద భ్రమలు పోలేదన్నమాట. ఇది బూటకపు స్వాతంత్ర్యం. మన దేశానికింకా స్వా తంత్ర్యం రాలేదు. కేవలం అధికార మార్పిడి జరిగింది. తెల్లవాడు పోయి నల్లవాడొచ్చా డంతే' అన్నాడు ఈశ్వర్.

"ఈశ్వర్... మన మిక్కడికొ చ్చిందెందుకు? చదువుకోవడానికి. మనమీద మన తల్లిదండ్రులెన్ని ఆశలు పెట్టుకున్నారు? ఇలా ఉద్యమాలంటూ తిరిగితే మన చదువు లేం కావాలి?"

"సాంబయ్యా... నువ్వోట్టి భ్రమలో ఉన్నావు. ఈ వ్యవస్థలో మనలాంటివాళ్ళకేదో ఒరుగుతుందనుకోవడం శుద్ధ భ్రమ. నువ్వు మెరిట్ విద్యార్థివైనంత మాత్రాన నీకుద్యోగం దొరుకుతుందనుకోకు. దొరికినా నువ్వేదో నీ తల్లిదండ్రులను ఉద్ధరిస్తాననుకుంటున్నా వేమో? ఉద్ధరించినా అది నీ ఒక్కడి కుటుంబంవరకే పరిమితం. నేను చేసేది మొత్తం తల్లిదండ్రులకొరకు. ఈ దోపిడీ వ్య వస్థను కూల్చందే దేశానికి విముక్తి లేదు'' అన్నాడు ఈశ్వర్.




దోపిడీ అన్న పదాన్ని అంత దగ్గరగా మొదటిసారిగా విన్న సాంబయ్యకు భయమైంది. ఈశ్వర్ ఎంతవరకు పోతాడో అతనికర్థం కాలేదు.

"ఈశ్వర్...! అవన్నీ పెద్ద మాటలు. దయచేసి నన్ను చదువుకోనియ్యి. నా ఇంటి పరిస్థితి రోజురోజుకూ దిగజారుతుంది. మా నాన్న అప్పుల్లో మునిగిపోతున్నాడు. ఈ పరిస్థితుల్లో నాకేమన్నా అయితే వాళ్లు తట్టుకోలేరు. నాకీ వ్యవస్థలో మంచీ చెడూ రెండూ కనబడుతున్నాయి. నేనెటూ తేల్చుకోలేకపోతున్నాను. నువ్వు నా జోలికి రాకు''

"సరే... అలాగే భ్రమల్లో బతకండి. నా మాటల్లోని సత్యాలేంటో నీకు తర్వాత తెలుస్తాయి. ఇదుగో కరపత్రాలు. బూటకపు స్వాతంత్ర్యం బండారాన్ని బయటపెట్టేవి.. 15 ఆగస్టు రోజున పంచబోతున్నాం" అని కొన్ని కరపత్రాలిచ్చి బయటకెళ్లాడు ఈశ్వర్.

కరపత్రాన్ని చదివిన సాంబయ్యకు మరోసారి వణుకులాంటిదొచ్చింది. అందులో ఉన్న విషయాల్లో చాలా నిజాలున్నట్టనిపించి నా వాట్ని గురించి చెప్పడం తమ పనికాదేమో ననుకున్నాడు సాంబయ్య. వాటిని తీసి చింపి పారేశాడు. ఇక పోటీకోసం వ్యాసం ఎంత ప్రయత్నించినా రాయలేకపోయాడు సాంబయ్య.

పోలీసు గ్రౌండులో కలెక్టర్ ఉపన్యాసం జరుగుతున్న సమయంలో 15వ ఆగస్టు రోజున కరపత్రాలు పంచి అరెస్టయ్యాడు ఈశ్వర్. అతని గదిపై కూడా దాడిచేశారు పోలీసులు. కొంత సాహిత్యం దొరికింది. సాంబయ్యనేవేవో ప్రశ్నలడిగారు.

"సార్! నాకేం తెలియదు. ఆ పుస్తకాలు నేను తెచ్చినవి కావు. నేను పల్లెలోంచి వ్యవసాయ కుటుంబంనుంచి వచ్చినవాణ్ణి. నన్ను ఒక్కరోజు పోలీసుస్టేషన్లో ఉంచారని తెలిసినా మా అమ్మానాన్నలు బతుకరు'' అని దీనంగా వేడుకున్నాడు సాంబయ్య.

పోలీసులకేమనిపించిందో ఏమో 'వానిసోపతి చేయకు' అని హెచ్చరించి వెళ్ళిపోయారు.

ఇక లాభంలేదని సాంబయ్య ఆ గది ఖాళీచేసి చక్రపాణితో కలిసి మరోచోట గది తీసుకున్నాడు. పోలీసులతో బాగా దెబ్బలు తిని నాలుగురోజుల తర్వాత బయటకొచ్చిన ఈశ్వర్ ఎప్పటిలాగే తన కార్యక్రమాలను కొనసాగిస్తూనే ఉన్నాడు. ఒక్కరోజు పోకుండా కాలేజీకొచ్చేవాడు. అప్పుడప్పుడు మాత్రమే వస్తున్నాడు.

ఓరోజు ఫిజిక్స్ క్లాస్ జరుగుతోంది. పాపయ్య లెక్చరర్ థియరీ ఆఫ్ రిలేటివీ గూర్చి చెబుతున్నాడు. బోర్డుమీద $E=Mc^2$ రాస్తున్నాడు. కాగితం బాణం రివ్వున వచ్చి సారుకు తాకి కిందబడింది. పాపయ్య ముఖం ఎర్రబడింది. దాన్ని విప్పాడు పాపయ్య. ఆ కాగితంమీదో తాటిచెట్టు బొమ్ముంది. దాన్నెక్కుతున్న గౌడు నడుముకు కల్లుకుండ బొమ్ముంది. కొంతమందికది కనబడనే కనబడింది. హాలునిండా నవ్వులు... పాపయ్య ముఖం అవమానంతో కందిపోయింది. గౌడకులంలోంచి వచ్చిన పాపయ్య క్లాసుకొచ్చేవరకు ఎన్నోసార్లు బోర్డుపై కల్లుబింది బొమ్మగీయడం చూశాడు. ఇప్పుడు కాగితం బాణాలు విసిరి అవమానించడం భరించరానిదిగా ఉంది పాపయ్యకు.

"దీన్ని విసిరిందెవరు?" గద్దరించినట్టున్నాడు పాపయ్య. "మాకెరుకె లేద్సార్' అంటూ క్లాసులో నవ్వులు.

ఇంతలో ఇద్దరు ముగ్గురు విద్యార్థులు ఆ క్లాసులోకి చొచ్చుకొచ్చారు. లెక్చరరుండే గద్దెపైకెక్కారు. అందులో ఒకతను మాట్లాడటం ప్రారంభించాడు.

"డియర్ ఫ్రెండ్స్! ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థి, విద్యార్థి నాయకుడు జార్జిరెడ్డి

మరణంవల్ల విద్యాలయాలన్నిట్లో విద్యార్థి యూనియన్లను నిషేధించడం జరిగింది. ఇదెన్నాళ్లు సాగుతుందో తెలియదు. అందువల్ల మనకు విద్యార్థి యూనియన్ రిప్రజెంటేటివ్స్ లేకుండా అయ్యారు. అయినా ఎవరికి వారే మనమంతా నాయకులమై మన సమస్యలకోసం సంఘటితంగా పోరాడుదాం. మన శక్తిముందు ఏ శక్తీ నిలువదు.

తెలంగాణకు మొదట్నుంచీ అన్యాయమే జరుగుతుంది. అన్నిట్లో కోస్తా ప్రాంతంవాళ్ళ ఆధిపత్యమే కొనసాగుతుంది. ప్రత్యేక తెలంగాణ కోసం రెండువందల మందికి పైగా విద్యార్థులు బలయ్యారు. ఫలితం శూన్యం.

ఇప్పుడు ప్రత్యేక ఆంధ్ర కావాలని ఉద్యమం చేస్తున్నారు కోస్తాలో. ఒకవిధంగా ఇది మనకు మంచిదే. ఇదే సమయంలో మనమూ ప్రత్యేక రాష్ట్రంకోసం పోరాడుదాం. తరగతులను బహిష్కరిద్దాం''

పాపయ్యసారు మధ్యలోనే వెళ్లిపోయాడు.

జైతెలంగాణ అంటూ విద్యార్థులంతా బయటకొచ్చారు. "మళ్ళీ మొదలైంది లొల్లి'' తనలో తాననుకుంటూ బయటకొచ్చాడు సాంబయ్య. ఇదెంతకాలం చదువును నష్టపెడుతుందో అనుకున్నాడు.

ఆంధ్రలో ఉద్యమం ఉధృతంగా సాగుతోంది. తెలంగాణలో కొద్దిరోజులు కాలేజీలు బందయ్యాయి.

"భూసంస్కరణలంటె వినెటోల్లెవ్వలు?"

"తమకున్న భూములను పంచుతనంటె కోస్తా భూస్వాములూకుంటరా? అందుకే ఈ లొల్లంతా?"

"పేరే కాని భూసంస్కరణలని భూమెవలకు పంచిండ్రు?"

"పనికిరానిదింత విడిచిపెడుతండ్రేమొ? ఆమాత్రం గూడ విడిచిపెట్టడానికి సిద్ధంగా లేరు వాళ్లు''

"పి.వి.ని దించంది ఊర్కోరు..."

రకరకాలుగా అనుకుంటున్నారు.

వాళ్ళకున్నట్టుగానే ముఖ్యమంత్రిని మార్చడంతో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం చల్లారింది. కొద్దిరోజులు గవర్నర్ పాలనపెట్టి మరొకర్ని ముఖ్యమంత్రిని చేశారు.

కాలేజీలిప్పుడు మామూలుగానే నడుస్తున్నాయి. నెలకు పైగా నష్టపోయిన తరగతులనిప్పుడు తీసుకుంటున్నారు. మరో సంవత్సరం నష్టపోకుండా ఈ ఉద్యమం తొందరగానే ముగిసినందుకు సాంబయ్య తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు. ఇంతవరకు జరిగిన నష్టాన్ని భర్తీ చేసుకోవడానికి సాంబయ్య మరింత సీరియస్‌గా పాఠాలు చదువుకుంటున్నాడు. ఈశ్వర్‌లాంటి వాళ్లు తమ ప్రయత్నాలు తాము చేస్తూనే ఉన్నారు. కొందరు యువకులు ఊళ్లలోకెళ్లి చార్‌మజుందార్ రాజకీయాల గూర్చి ప్రచారం చేస్తున్నారు.

సిద్ధాంతాల కోసం, ఓ ధ్యేయం కోసం ప్రాణాలనర్పించడానికైనా సిద్ధంగా ఉన్న యువకులు కొందరుంటే, జులాయిగా తిరుగుతూ కాలేజీ జీవితాన్ని చదువుకోసం కాక ఎంజాయ్‌మెంట్ కోసమని భావించే విద్యార్థులు మరికొందరున్నారు. ఆరోజే బి.యస్సీ (బి.జెడ్.సి) రెండవ సంవత్సరం జువాలజీ పాఠం జరుగుతుండగానే బి.ఏ. చదివే కొంతమంది విద్యార్థులు గదిలోకి ప్రవేశించారు. ఇద్దరు విద్యార్థుల్ని కట్టెలతో బాదడం మొదలుపెట్టారు. వాళ్ల తలలు పగిలి రక్తం కారుతుంటే,

"మా వాడ అమ్మాయి జ్యోతి జోలికొచ్చావంటే పొడిచి పారేస్తం. మీకు మావాడ పిల్లే దొరికిందా?" అని బూతులు తిట్టుకుంటూ వెళ్లిపోయారు.

మరోరోజు వీళ్లు వాళ్లపై దాడిచేశారు.

అమ్మాయిలతో ప్రేమకలాపాలు సాగించడంలో జరిగిన కొట్లాటలుగా వాటిని గురించి చెప్పుకుంటున్నారు.






ఎన్నికలున్నప్పుడు ఓ విధమైన కొట్లాటలయితే ఎన్నికలు లేనప్పుడు ఈ విధమైన కొట్లాటలుండటం గమనించాడు సాంబయ్య. విద్యార్థుల్లో సిద్ధాంతాలకు జీవితాలనర్పించే వాళ్ళతో పాటు లంపెన్ వర్గమూ ఉండటం అతని దృష్టిలో కొచ్చింది.

కొందరు వచ్చింది పోట్లాడటానికన్నట్టే ప్రవర్తిస్తుంటే చూస్తున్న సాంబయ్య వేణుతో అన్నాడోరోజు "వేణూ? వీళ్లకు చదువక్కర్లేదా? అలాంటప్పుడెందుకొస్తున్నట్టు కాలేజీకి''

"కొందరు చదువులుంటే కట్నం పెరుగుతుందని వస్తారు. కొందరికేమో కాలేజంటే ఓ ఎంజాయ్‌మెంట్ కేంద్రం. తాజెడ్డకోతి వనమెల్ల చెరిచిందన్నట్టు వీళ్లు చెడిపోవడమే కాకుండా ఇతర్ల చదువులకూ నష్టం చేస్తారు. వీళ్ళందర్నీ మనం పట్టించుకోవద్దు. మనమెందుకొచ్చామో గుర్తుంచుకొని చదువుకో

వాలి. ఈ వయసులో ఇక్కడ చెడిపోవడానికి అన్ని అవకాశాలూ ఉంటాయి. సినిమాలు... షికార్లు... రౌడీయిజం... ఇంకా ఎన్నో... ఎన్నో'' అన్నాడు వేణు.

వేణు మాటలెంతో జీవితానుభవం ఉన్న వాడి మాటల్లా అనిపించాయి సాంబయ్యకు. అవసరాల్లో ఆర్థిక ఇబ్బందుల్లో పుట్టిపెరిగిన పిల్లలకు మెంటల్ మెచ్యూరిటీ తొందరగా వస్తుందన్న విషయాన్ని గ్రహించాడు సాంబయ్య. అతిగారాబంగా కొంగుచాటు పిల్లలుగా పెరిగిన వాళ్లకు లోకజ్ఞానం తక్కువుండటం సాంబయ్య అనుభవంలోకొచ్చింది.

దీపావళి పండుగకు రెండురోజుల సెలవులొచ్చాయి. సాధారణంగా దీపావళికి ఊరికెళ్లడంలేదు సాంబయ్య. దీపావళి నోములు లేవు కాబట్టి అక్కడే ఉండి చదువుకోవచ్చని ఉన్నాడు. మిగతా అన్ని పండుగలు పల్లెటూళ్లోనే మంచిగనిపించినా దీపావళి మాత్రం కరీంనగర్ పట్టణంలోనే మంచిగుంటుందనిపిస్తుంది సాంబయ్యకు. ఊళ్లో కొందరు బాణసంచా అవి కాల్చినా పట్టణంలో విపరీతంగా కాలుస్తారు. గంజ్‌లోనైతే షావుకార్లు వేలకొద్ది రూపాయల పటాసులు కాలుస్తారు. అక్కడున్న మిత్రులతో కలిసి రాత్రి బయటకెళ్తాడు సాంబయ్య. రోడ్డునిండా పటాసులు కాల్చిన కాగితాలే. జుమ్మంటూ పోయే రాకెట్‌లు, పువ్వులు విరజిమ్మే చిచ్చుబుడ్లు చూస్తూ తిరుగుతాడు. ఊళ్లో ఇవన్నీ ఉండవు.

అందుకే గత రెండు సంవత్సరాలలాగే ఈ ఏడు కూడా మిత్రులంతా ఊరెళ్లినా సాంబయ్యక్కడే ఉన్నాడు. తెల్లవారితే దీపావళనగా ఓ వ్యక్తి సాంబయ్యగదికొచ్చాడు. అతన్నిదివరకోసారి చూసిన జ్ఞాపకముంది సాంబయ్యకు.

"నేను శేషయ్య ఊరివాణ్ని. శేషయ్య నాకు మంచి స్నేహితుడు.. ఈ రాత్రికిక్కడ పడుకుంటాను'' అన్నాడు.

వేణు బంధువు శేషయ్య. అతన్తో వచ్చాడి తను ఇదివరకు.

"నీ పేరేంటి?" అన్నాడు సాంబయ్య.

"కిష్టయ్య''

"అన్నం తిన్నవా? వండి పెట్టాలా?"

"హోటల్లో తిని వచ్చాను''

ఇంటికి వచ్చిన అతిథిని వట్టిగ పడుకోబెట్టకూడదని దసరాకు తెచ్చుకోగా మిగిలిన రెండు గారెలనిచ్చి తినమన్నాడు సాంబయ్య. వాటిని తిని నీళ్లు తాగి సాంబయ్య వేసిన పక్కమీద పడుకున్నాడు కిష్టయ్య. రాత్రివరకు చదువుకొని పడుకున్నాడు సాంబయ్య. తెల్లవారి లేచి చూసేసరికి కిష్టయ్య లేడు. ఉదయమే లేచి ఊరెళ్ళుంటాడనుకున్నాడు సాంబయ్య.

పండుగ తెల్లవారి ఊర్నుంచి వచ్చిన చక్రపాణి "నా ప్యాంటేది?" అన్నాడు.

ఎక్కడ వెదికినా అది దొరుకలేదు. వేణు వాళ్లంతా వెతికితే బావి వెనుకున్న చెట్టుకింద దొరికింది. అయితే అందులోని ముప్పై రూపాయలు లేవు.

కిష్టయ్యను గూర్చి చెప్పాడు సాంబయ్య.

ఊరంతా తిరిగి అతన్ని పట్టుకొచ్చారు వేణు, చక్రపాణి. పక్క గదుల్లో ఉన్నవాళ్లు వాణ్ణి చితకబాదారు. మాసిన పాత బట్టలతో ఉన్న కిష్టయ్యను కొడుతుంటే జాలేసింది సాంబయ్యకు. వాళ్లంతా అతన్ని దొంగంటుంటే అవసరం అతనితో అలా చేయించిందనుకున్నాడు సాంబయ్య. కిష్టయ్యను కొడుతున్న దృశ్యమే సాంబయ్య కళ్లముందు కదిలింది చాలాకాలం.

వ్యవసాయ మార్కెట్‌కు వడ్లు అమ్మడానికి తీసుకొచ్చిన చిలుకయ్య డబ్బు చేతిలోకొచ్చేసరికి రాత్రి కావడంవల్ల సాంబయ్య గదికొచ్చాడు.

తండ్రికి ఆలుగడ్డ కూర వండి భోజనం పెట్టాడు సాంబయ్య. కొడుకు వంటను మెచ్చుకున్నాడు చిలుకయ్య.





తండ్రికి పక్కవేసి అతని పక్కనే పడుకున్నాడు సాంబయ్య.

"బిడ్డా! ఈ ఎవుసంల ఎంత జేసినా గట్టుకు కట్టెలు మోసినట్టే ఐతంది! ఏం జెయ్యాలె బిడ్డ? అన్నీటికేమొ మస్తు ధరలుండె. దినుసుకేమొ ధరలేపాయె. రోజు రోజుకు దిగజారుడే ఐతంది'' అన్నాడు చిలుకయ్య.

"వ్యవసాయాలన్ని ఇలాగే ఎందుకవుతున్నాయి? రోజు రోజుకు వ్యవసాయాలెందుకు మూలకు పడుతున్నాయో నాకర్థం కావడంలేదు బాపూ! ఐదారు నెలల్లో ఈ సంవత్సరం చదువయిపోతుంది. ఇంకో సంవత్సరమైతే నా డిగ్రీ ఐపోతుంది. అటు తర్వాత ఏదైనా ఉద్యోగం చూసుకుంటాను. ఈ కొద్దికాలం ఎలాగో వెళ్లదీయాలె బాపూ!" అన్నాడు సాంబయ్య.

"ఎంత కష్టమైనా నీ చదువు పూర్తిగావాలె బిడ్డ! కిందికో మీదికో మావెళ్లదీత్త. కని రోజు రోజుకు కాలమెట్లనో ఐతంది. ఊళ్లెకెవ్వలెవ్వలో వత్తండ్రు. ఏవేవో చెప్పుతండ్రు. దొరలు కారాలు మిరాలు నూరుతండ్రు. అంత వడ్లు పెరుగు కలిపినట్టుంది బిడ్డ!"

"ఇక్కడ కూడ అట్లనే ఉంది బాపు! ఈశ్వర్ ఇంతకుముందు నాతో ఉండేవాడు. ఓరోజు అరెస్టయిండు. నన్ను కూడ పోలీసులు బెదిరించిండ్రు. నేనా గది ఖాళీచేసిన"

ఇన్ని రోజులుగా తండ్రినుంచి దాచిన విషయాన్ని చెప్పాడు సాంబయ్య.

పోలీసులొచ్చారనేసరికి లేచి నిల్చున్నాడు చిలుకయ్య.

"సాంబయ్యా! గదేందో నక్సులైట్లంటండ్రు... ఇంకేమో అంటండ్రు... గవ్వీటిజోలికి పోకు బిడ్డ. నీకెమన్న అయిందంటె ఇగ మేం గోదాట్లె పడి చచ్చుడే''

"ఎన్నో జరుగుతూనే ఉంటాయి బాపు. నేనేవీ పట్టించుకోను. నాకు నా చదువే ముఖ్యం. కాని బాపూ! ఎంత పట్టించుకోవద్దనుకున్నా ఎన్నో శక్తులు లాగుతూనే ఉంటాయి. ముఖ్యంగా విద్యార్థులు ఆ ఉద్యమం దిక్కు ఆకర్షితులవుతున్నారు. ఎన్నో మీటింగులు... పుస్తకాలు... మాటలు... చర్చలు... వాటిదిక్కు దృష్టి మరలుతూనే ఉంటుంది బాపు!"

కొడుకు మాటలకు తలపై పిడుగు పడ్డట్టయింది చిలుకయ్యకు.

"అంటే నువ్వు గూడ వాళ్లతోని పోతన్నవా?" అన్నాడు.

"లేదు బాపూ! ఉన్న సంగతి చెప్పాను. నేను ఎంతో నిగ్రహంతో చదువుపైన్నే దృష్టి మరల్చి రాత్రింబవళ్లు చదువుతున్నాను. బాపూ! వాళ్ల పుస్తకాలు చదువుతుంటే వాళ్ల ఉద్దేశ్యం మంచిదేనేమో అనిపిస్తుంది''

"అవ్వన్ని మనకెందుకు బిడ్డ? నువ్వు గిట్ల ఆలోసిత్తె చదువు బందుజేసిందే నయ్యం. నీకేం జరిగినా మేం బతుకుడు కష్టం. చదివినకాడికాయె. ఇంటికిరా మరి''

"బాపూ! నామీద నీకంత నమ్మకం లేదా? ఉన్న పరిస్థితిని చెప్పానే కాని నేను వాళ్లతో పోతాననలేదు కదా! అవ్వా, మీరు నాగురించి ఏం రంది పెట్టుకోకుండ్రి. బాగా చదివి ఫస్టుక్లాసులో పాసయితా'' అన్నాడు సాంబయ్య.

"పాడు సోపతులు చెయ్యకు బిడ్డ. నీ పనేందో నువ్వు చూసుకో'' అని పదే పదే చెప్పాడు చిలుకయ్య.

వాళ్లతోని పోనని కొడుకుతో చేతిలో చేయి వేయించుకున్నాడు. ఇంకా తెల్లవారకముందే లేచి బండి గట్టుకొని పోయాడు.

క్లాసులు క్రమం తప్పకుండా జరుగుతున్నాయి. ఈశ్వర్ మరి కొందరు విద్యార్థులు ఉద్యమంకోసం తిరగడంలోనే ఎక్కువ సమయం గడుపుతున్నారు. ఈశ్వర్ సాంబయ్య గది కప్పుడప్పుడు వచ్చి పోతున్నాడు. ఏవేవో చెబుతున్నాడు. అయినా సాంబయ్య

మనసు ఇతర విషయాలపైకి పోనీయకుండా చదువుపైన్నే లగ్నం చేస్తున్నాడు.

అప్పుడప్పుడు జిల్లా కేంద్ర గ్రంధాలయా నికెళ్లి పత్రికలు, పుస్తకాలు తిరగేసి వస్తున్నాడు. కాలేజీ రీడింగ్‌రూంలోనూ కొన్ని పత్రికలు చదువుతున్నాడు. పాఠ్యపుస్తకాలకంటె ఇతర పుస్తకాలవల్లే జీవితానికి సంబంధించిన విషయాలను తెలుసుకోవచ్చన్న విషయాన్ని క్రమక్రమంగా గ్రహిస్తున్నాడు సాంబయ్య.

చూస్తూండగానే ఆ సంవత్సరం గడిచిపోయింది. పరీక్షలొచ్చాయి. ఆ సంవత్సరం ఒక్క లాంగ్వేజెస్‌లోనే పరీక్షుంటుంది. చివరి సంవత్సరంలో అన్ని ఐచ్ఛిక విషయాలలో ఒక్కోదానికి మూడు పేపర్ల చొప్పునుంటాయి.

ఇంగ్లీషు మొదటి పేపర్ జరుగుతోంది. సాంబయ్య తనకొచ్చింది చకచకా రాసేస్తున్నాడు.

రమేష్ దగ్గర్నుంచి చిట్టి లాగాడు ఇన్విజిలేటర్, పేపర్ తీసుకున్నాడు.

"సార్... మీరు కాపీ అని రాస్తే నా చదువు పాడైపోతుంది. అందువల్ల మీకేమొస్తుంది?" అన్నాడు రమేష్.

"అంటే కాపీ చేసినా చూస్తూ ఊర్కోమంటావా?" అన్నాడు ఇన్విజిలేటర్.

"సార్... ఒక్కసారి మీరు నా కండ్లలోకి చూసి చెప్పండి! మీరు జీవితంలో ఎప్పుడూ కాపీ కొట్టలేదా? కాపీ కొట్టకుండానే అన్నీ పాసయ్యారా? సూటిగా చూసి చెప్పండి. అబద్ధమాడకూడదు'' అన్నాడు రమేష్.

ఆ మాటలు విని చలించాడు ఇన్విజిలేటర్. ఏమనుకున్నాడో ఏమో నకల్ చిట్టీ చింపి కిటికీలోంచి బయటపడేసి ఆన్సర్‌షీటు రమేష్‌కిచ్చి "మళ్లీ చిట్టీ దొరుకుతే మాత్రం ఊర్కోను... జాగ్రత్త' అని రాసుకొమ్మన్నాడు.

"థ్యాంక్యూ సార్..." అని తన పనిలో నిమగ్నమయ్యాడు రమేష్. సాంబయ్య ఇదంతా చూస్తూనే ఉన్నాడు.

పరీక్ష సమయమైపోయింతర్వాత పేపర్లిచ్చి బయటకొచ్చారు విద్యార్థులు. సాంబయ్య రమేష్‌నడిగాడు.

"ఆ సారు సెంటిమెంటుమీద దెబ్బకొట్టాను. ఆ సారు మంచోడే. నాకు తెలుసు... విశ్వనాధం సారున్నాడు చూడు... వాడు కర్కోటకుడు. వాన్ని కిందపెడితే పంటలుండవు. పైనుంచితే వానలుండవు. ఆ సారుకింకా పెండ్లి కాలేదనుకుంటాను. పెండ్లి కాకుంటే ఎప్పటికీ పెళ్లి కాదు. ఇదువరకు పెళ్లయుంటే వానికసలే పిల్లలు పుట్టరు. ఇది నా శాపం" అన్నాడు రమేష్.

"ఏమైంది... అంత ఘోరంగా శపిస్తున్నావు?" అన్నాడు సాంబయ్య.

"ఏమైతది... రమేష్‌ను నకలు కొట్టుకోనియ్యలేదేమో!" అన్నాడు రఘుబాబు. అతడు రమేష్ సహధ్యాయి.

"అదేం కాదు. వాడు చాలా పాపాత్ముడు'' అని అక్కణ్నుంచి వెళ్లిపోయాడు రమేష్. అతని మాటలగూర్చే ఆలోచిస్తూ తన గదికెళ్లాడు సాంబయ్య.

* * *

రెండవ సంవత్సరం పరీక్షలు రాసి వేసవి సెలవులు గడపడానికి ఊరెళ్లాడు సాంబయ్య. వెంట మిత్రుడిచ్చిన ఒకటిరెండు పుస్తకాలను తీసుకెళ్లాడు. ఇంటి పెద్ద దరువాజ (సింహద్వారం) దగ్గర బూడిద గుమ్మడి కాయ కట్టి ఉండటం చూశాడు. కరీంనగర్‌లో షాపులముందు కూడా అవి కట్టుండటం చూశాడు. అవి అలా ఎందుకు వేలాడదీస్తారో ఎవరినైనా అడుగుదామనుకుంటూనే మరిచిపోయాడు. తల్లినడిగి తెలుసుకోవాలని అడిగాడు.




"గదా బిడ్డ! ఇంటికి దయ్యాలు, భూతాలు రావద్దని కడ్తరు. ఏమాశించద్దని అట్ల జేత్తరు. మనూల్లె రాత్రి ఓ ముసల్ది ఇంటింటికి తిరుగుతంది. చెరిసగం రాత్రి వచ్చి వాకిట్ల నిల్చొని 'బర్రిత్తవా...? పుర్రిత్తవా?' అని అడుగుతంది. బర్రిత్తనంటె బూడిద గుమ్మడికాయను చూసి వెళ్లిపోతుంది. లేకుంటె తలకాయ తీసుకొని పోతది. పుర్రె పోతదని ఇంటింటికి బూడిద గుమ్మడికాయ కట్టింద్రు''

ఇలాంటి వదంతులు తన చిన్నతనంలోనూ, ఆ తర్వాత కూడా ఎన్నో విన్నాడు సాంబయ్య. అయితే ఆ దయ్యాలను, అలాంటి ముసలమ్మలను చూసినవాళ్లు లేరు. ఇవి ఎలా ప్రచారమవుతాయో అతనికర్థంకావడంలేదు.

"అవ్వా! మరా ముసలమ్మ మనింటికొచ్చిందా?" అన్నాడు.

"నేను మొదలే బూడిద గుమ్మడికాయ తెచ్చి కట్టిన... అవుతలివాడకచ్చిందట ముసలమ్మ''

"మరెవ్వలదన్న తల తీసుకపోయిందా?"

"బూడిదగుమ్మడికాయ కట్టకుంటె తీసుకపోదా బిడ్డ? అదేదో కాముని భూతం... ముసల్దాని లెక్క వత్తది. తర్వాత మంత్రకాల్లను పిలిపిచ్చి కొలుపుజేసి సాగనంపింద్రల్లె''

"అవ్వా! అవుతలి వాడకొచ్చిందని ఇటు వాడవాళ్లు, ఈ వాడకొచ్చిందని ఆ వాడవాళ్లు అనుకుంటుంటారు. అసలా ముసల్దే ఉండది. ఏ వాడకు రాదు''

"మీ చదువుకున్నోల్లు గివ్వన్ని నమ్మరు బిడ్డ. మా నమ్మకాలు మాకున్నయి''

"సరెగని అవ్వా! చవితి రోజున ఇండ్లమీద రాళ్లు విసిరేసేవాళ్లు గద... ఇప్పుడు గూడ విసిరేస్తంద్రా...?"

"చవితినాడు తిట్లు తినన్నని అట్ల జేత్తరు. ఒకవేళ తప్పిపోయి చవితి చంద్రుడ్ని చూసినా వచ్చే అపనిందలు తిట్లు తింటె పోతయని నమ్ముతరు. అందుకే ఇండ్లమీద రాల్లిసిరేత్తరు'' అంది రాజమ్మ.

ఓదిక్కు పోరాటాలకు సన్నద్ధమవుతున్న జనం, మరోదిక్కు మూఢ నమ్మకాల్లాంటివి చెక్కు చెదరకుండా ఉండటం గమనిస్తున్నాడు సాంబయ్య. అతడేం మాట్లాడలేదు.

"చెల్లె చెక్కరి కుడుకలు పోసుటానికత్తనన్నది. ఈ ఏడు కుడుకలు పోసే సంవత్సరమచ్చిందట. దానికో చీర కొనియ్యాలె''

"మా కొనిత్తాం తియ్యే అవ్వ. మొన్ననే నా స్కాలర్‌షిప్ పైసలొచ్చినయి. బాపుకిచ్చిన... మరి బావ మంచిగ చూసుకుంటున్నడా చెల్లెను''

"ఏం చూసుకునుడో బిడ్డ! వానింట్ల పీనుగెల్ల. వానికెప్పుడు పైసలు పైసలనే ఆరాటమే. సంపాయించుకుంటె సంపాయించుకోనియ్యకని దాన్ని గోసవెట్టుకుంటెట్ల? తాపకోసారి తిట్టి కొట్టి తోలె... ఓసారి ఆవుల్యాగను, ఓసారి పాలిచ్చె బర్రెను, ఇంకోసారి చెవులకు కమ్మలు, పైసలు ఇచ్చుకుంట తోలుడుగావట్టె. నౌకరయినంక లగ్గం జేసుకుంటె ఎక్కో కట్నమచ్చేదట అయినెకు. మరెవ్వలు చేసుకోమన్నరు? ఇలవర్నె తీరుచేసుకున్నడు. పోరి పుట్టినా దానికి కష్టాలు తప్పపాయె. ఒక్క పోరిని గంటె ఏ మచ్చెబిడ్డ? నలుగురిపెట్టు దాని కొక్కదానికే ఇచ్చుడుగావట్టె. బాగ పంటలు పండి మంచిగున్నా నాకేం పర్వన్నట్టుండు... సంసారమేమొ చేతికి మూతికన్నట్టె గావట్టె''

"ఒక్కతే చెల్లెగాదె అవ్వ! దానికివ్వకుంటె ఎవ్వలకిస్తం చెప్పు?, పోతెమానాయెపటు... దానికి బిడ్డ పుట్టిందిగద! రేవుకు మా వస్తడు బావ"

"ఎడ్లెనుక ముడ్లని రేపు అయినెకుండదా సాలు'' అని అరుగుమీదినుంచి లేచి వంటింట్లోకెళ్లింది రాజమ్మ.

సాంబయ్య లేచి మిత్రులను కలుసుకోవడానికి ఊళ్లోకెళ్లాడు. కత్తెర్ల శంకరయ్యింటికెళ్లాడు. అతడింట్లో లేడు. తండ్రి చనిపోడంవల్ల శంకరయ్య పదవ తరగతితోనే చదువాపి వ్యవసాయం చూసుకుంటున్నాడు. జీవితంలో హెచ్.ఎస్.సి. పాసు కాననుకున్న భూమానందం జై తెలంగాణా పుణ్యమాని పాసయ్యాడు. ఐ.టి.ఐ. పూర్తిచేసి సింగరేణి కాలరీస్‌లో ఫిట్టర్‌గా పనిచేస్తున్నాడు.

వెంకటేశం ఇంటికెళ్లాడు సాంబయ్య. అతనితో చిన్ననాటి విషయాలను జ్ఞాపకం చేసుకున్నాడు. వెంకటేశం తొమ్మిదో తరగతిలో ఉండగానే తెలుగు ఎంట్రన్స్ ఇచ్చి ఆ తర్వాత డి.ఓ.ఎల్ చదివి తెలుగు పండితుడిగా పనిచేస్తున్నాడు. హనుమంతరాజు సారు చెప్పినా సాంబయ్యప్పుడు ఎంట్రన్స్ పరీక్షకు కట్టలేదు.

వెంకటేశం ఇంట్లోంచి బయటకొస్తూ 'రేపటికోడికన్న ఈ రోజున్న గుడ్డే నయం... నేనారోజే తెలుగు పరీక్షకు కట్టుంటే రెండేళ్లకి తమే ఉద్యోగమయ్యేది' అనుకున్నాడు సాంబయ్య. అయినా దేని విలువ దానికిలే అని తననుతాను సమాధానపరచుకున్నాడు.

సెలవులయినా మ్యాథమాటిక్స్, ఫిజిక్స్, కెమిస్ట్రీ ప్రాబ్లమ్స్ చేసుకుంటూ కాలం గడుపుతున్నాడు. రోజుకొక్కసారైనా సెలవుల్లో ఇంటికొచ్చిన కిషన్‌రెడ్డిని కలిసి మాట్లాడుతున్నాడు.

"అదృష్టం అందలమెక్కిస్తనంటె నొసలు కట్టెలు మోస్తనన్నదట... ఇంజనీరింగ్ చదువుకు పొమ్మంటె పోకపోతివి'' రెండుమూడు సార్లన్నాడు కొండల్‌రెడ్డి.

సాంబయ్య తల వంచుకొని సమాధానమియ్యలేదు.

"ఇంజనీరింగ్‌ల సీటును విడిచిపెట్టినోన్ని నిన్నొక్కన్నే చూసిన. బడిపంతులైతనని మావోనికుత్తరం రాసినవటకద! యాదికుందా? మన్నుపాడైందా గా నౌకర్ల? బతుకలేనోడు బడిపంతులు? పల్లెల పొంటుండాలె. నువ్వు చదువుల ఉషారున్నవు. బాగ మార్కులతోని పాసై వేరే ఏదన్న నౌకరి చూసుకో. ఇంకో సంవత్సరంమ్మైతే చదువ్వయిపోతదిగదా!" అన్నాడు కొండల్‌రెడ్డి.

"అలాగే చేస్తాను'' అన్నాడు సాంబయ్య.

"సార్లు పూర్తిగ చెడిపోయింద్రు. కొందరైతె తాళ్ళకు పోయి కల్లు తాగుతంద్రు. పిల్లలతోనె సిగరెట్లు తెప్పించుకుంటుంద్రి. పెద్ద పోరగాండ్లతోని పేకాట గూడ ఆడుతంద్రు. ఇక వాళ్లు చదువేం చెప్పుతరు? వీళ్లు ఏం వింటరు? ఇదంత తెలంగాణ లొల్లయినంకనే మొదలయింది. అంతకుముందు సార్లంటె గౌరవముండేది. సార్లు కూడా మంచిగనే ఉందురు''

"రామచంద్రం సారును ట్రాన్స్‌ఫర్ చేయించారటకద. ఆ సారేం తప్పు చేశాడు సార్?" అన్నాడు సాంబయ్య.

"ఊరికి చేసిన ఉపకారం పీనుక్కు చేసిన సింగారంలాంటిది. ఆ సారు బడికోసమెన్ని చేసిండు? బడి టైమయిపోయినా పిల్లల ధ్యాసే ఆయనకు. అయినా అతనంటె పడని వాళ్లు జిల్లాపరిషత్‌లో దరఖాస్తు పెట్టి ఇక్కన్నుంచి పంపించింద్రు. నేను వద్దని చెప్పినా వినలేదు. ఆయనిక్కన్నుంచి పోవడమే మంచిదైంది. సుల్తానాబాద్‌లో క్షౌరషాపు పెట్టి మంచిగ సంపాయించుకుంటున్నాడు. నేనేం తక్కువ చేశానూరికి? బడి దెప్పించిన, గుడి కట్టించిన. బస్సు వేయించిన. మొన్న మొన్ననే కరెంటు తెప్పించిన. చెరువుకు పెద్ద మత్తడి శాంక్షన్ చేయించిన. అయినా నన్ను కూడ అడిగెటోల్లయింద్రు జనాలు. కాలం మునుపటితీరుగ లేదు. పెద్ద చిన్న భేదం లేకుంటయిపోతోంది''

సాంబయ్యేం మాట్లాడలేదు.

"సాంబయ్యా! మంచిగ చదువుకో. మీటింగులని, అవ్వని ఇవ్వని తిరుగకు. కాలేజీల్లో కూడా గొడవలైతన్నయట. అవన్ని




పట్టించుకోకుండ్రి'' అన్నాడు కొండల్‌రెడ్డి.

"అవన్ని మేమెందుకు పట్టించు కుంటం?" అని సర్పంచ్‌కు నమస్కరించి ఇంటికొచ్చాడు సాంబయ్య.

ఊళ్లలో కొన్ని కొన్ని మార్పులొస్తున్నట్టు గమనిస్తున్నాడు. ఉదయమే అన్నం తిని మంచంలో పడుకొని చదువుకుంటున్నాడు సాంబయ్య. చిలుకయ్య కొడుకు దగ్గరకొచ్చి నిల్చున్నాడు. ఈమధ్య చిలుకయ్యకు కొడుక్కు పని చెప్పాలంటే వెనుక ముందవుతోంది. కాలేజీ చదువుతున్న కొడుక్కు మోటుపని చెప్పడం కొంత బాధనిపిస్తోంది. అయినా ఇదేం మోటుపని కాదులే అనుకొని "సాంబయ్యా! ఎడ్లతోలుకొని చెలుకలకు పో. చెలుక ఈటిపోయినట్టేకాని అడుగుబొడుగు కంకుతయెడ్లు! పొద్దంత కొట్టంల కట్టేసుంచుతేమత్తది?" అన్నాడు.

డిగ్రీ చదువుతున్న తాను ఎడ్లకాయపోవడమా అని అనుకున్నా సాంబయ్య తమ కుటుంబాల్లో తప్పదని "సరె బాపూ!" అని మంచంలోంచి లేచాడు.

అంగీ వేసుకొని కరీంనగర్‌నుంచి తెచ్చుకున్న ఓ పుస్తకం తీశాడు. దాన్ని చేతిలో పట్టుకొని కొట్టం దగ్గరికెళ్లాడు. ఎడ్లను విడుచుకొని చెలుకలోకి కొట్టుకెళ్లాడు. వాటినక్కడ వదిలిపెట్టి చెట్టుకింద కూర్చున్నాడు. అవి బరుకూ బరుకున నోటికందని గడ్డిని మేయడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆ చెలుకలోనే మరికొన్ని ఎడ్లు మేత మేస్తున్నాయి. చెట్టుకింద ఇద్దరు ముగ్గురు మనుషులు కూర్చొని మాట్లాడుకుంటున్నారు.

"అత్తా గొట్టే మామా గొట్టే...
మోటాకాడా మొగడు గొట్టె రాజన్నా...
మొగడు గొట్టె రాజన్నా!

అంటూ పాట పాడుతూ అక్కడికొచ్చాడు నర్సయ్య. అతడు చాలా సంతోషంగా ఉన్నట్టు అతని ముఖమే చెబుతోంది.

"ఏం నర్సయ్యా! పాటలేమొ బాగా పాడుతున్నావు?" అన్నాడు సాంబయ్య.

"నువ్వానె సాంబన్న... ఎడ్ల గొట్టుకొని నువ్వచ్చినవా? మీ బాపేం జేత్తండు? గంత పెద్ద చదువులు చదువుతన్నవు గీ ఎడ్లగాత్తవానె!" అన్నాడు నర్సయ్య.

"కోటి విద్యలు కూటికొరకే కద! చదువుకున్నంత మాత్రాన ఎడ్ల మేపొద్దా? ఇంట్లో ఉండి ఏం చేయాలని వచ్చిన. సరెగని జోరుగ పాటలు పాడుతన్నవు... ఏమన్న శుభవార్త?"

"ఏం లేదే వర్థిగనే అట్ల పాడిన"

చెట్టుకింద కూర్చున్న కొంరయ్య అక్కడికొచ్చాడు.

"గది గాదే సాంబన్న- పోరి మంచిగ విన్నట్టుంది రాత్రి. అందుకే రాగాలు దీత్తండు'' అన్నాడు కొంరయ్య.

సాంబయ్య కా మాటలర్థం కాలేదు.

"ఏ పో... నీయవ్వ!" అన్నాడు నర్సయ్య.

"సిగ్గుపడుడెందుకురా తమ్మి?" నర్సయ్యతో అని,

"నర్సయ్యకు రొన్నెల్లకిందనే లగ్గమైందే సాంబన్న. పోరి సరిగ్గ వినదట. పోరి మంచిగ విన్ని రోజు చెంగలిచ్చుకుంట మొకం మాడ్చుకొనే ఉంటడు'' అని నవ్వాడు కొంరయ్య. అతన్తోపాటు అంతా నవ్వారు.

కొద్దిసేపు వాళ్ళంతా కలిసి ఊరి విషయాలు మాట్లాడుకున్నారు. వాళ్ళ ఎడ్లు దూరంబోతే లేచిపోయారు.

మేం వాట్ని మల్లేస్తం.. కూచోయే సాంబన్న... ఏదో వయి (పుస్తకం) తెచ్చుకున్నవు కద... చదువుకో..." అంటూ వెళ్ళిపోయాడు కొంరయ్య.

వడగాలొస్తోంది. చెట్టుకొమ్మలూగుతున్నాయి. ఎడ్లు కొంచెం దూరంగా మేస్తున్నాయి.

'మహాప్రస్థానం' పుస్తకం తెరిచాడు సాంబయ్య. ఆ పుస్తకం పేరు ఇదువరకు విన్నాడు సాంబయ్య... పుస్తకం గురించి అక్కడక్కడ చదివాడు. కాని ఆ పుస్తకాన్ని చదువలేదు. ఇచ్చేప్పుడు మిత్రుడు ఏ పుస్తక మిస్తున్నాడో చెప్పలేదు. వెళ్ళే హడావిడిలో ఇస్తే బ్యాగులో పెట్టుకొని వచ్చాడు.

ఆ పుస్తకాన్ని తెరుస్తుంటేనే సాంబయ్య ఒళ్ళు పులకరించింది. ఏదో ఆత్మీయమైన, అత్యంత ప్రియమైన వస్తువు తన చేతిలో ఉన్నట్టునిపించింది. ఓసారి తీసి కళ్ళకద్దుకున్నాడు.

మొదట చలం యోగ్యతాపత్రం చదివాడు. దాన్ని చదువుతుంటేనే తానిదివరకెప్పుడూ చదువనిదేదో చదువుతున్నట్టనిపించింది. సాంబయ్యలో ఏదో అలజడి రేగింది. ముందుమాట చదవితేనే 'రాబందుల రెక్కల చప్పుడు, పయోధర ప్రపంచ ఘోష ఝంఝూనిల షడ్జధ్వానం' విని పించిది సాంబయ్యకు. ఇక ఆ పుస్తకాన్ని చదివి తాను భరించగలడా అనుకున్నాడు.

ఒక్కొక్క పేజీ తిరగేస్తున్నాడు.

మహాప్రస్థానం గేయంనుండి జగన్నాథ రథచక్రాల వరకు ఊపిరి బిగపట్టి చదివాడు. ఆతనిలో ఉద్వేగం చెలరేగింది. పతితులు, భ్రష్టులు, బాధాసర్పద్రష్టులు... కుక్కపిల్లా, అగ్గిపుల్లా అన్నీ సాంబయ్య కళ్ళముందు కదిలాయి. యముని మహిషపులోహ ఘంటలు ఖణేల్మన్నట్టనిపించాయి. తిరిపెమునకు పిడికెడు మెతుకుల పేదల బతుకులు కళ్ళెదుట నిలిచాయి. దగాపడిన తమ్ముళ్లను అక్కున చేర్చుకోవడానికి జగన్నాథ రథచక్రాలు భూమిపైకొస్తున్నట్టనిపించింది.

సాంబయ్య శరీరమంతా ఊగిపోయింది. అతనిలో అంతులేని అలజడి ప్రారంభమైంది. అతని కళ్ళవెంట బొటబొటా నీళ్ళు గారాయి. అతని రక్తం ఉద్వేగంతో ఉప్పొంగింది.

ఇంతవరకు సాంబయ్య కొన్ని కవితలు, కథలు, నవలలు చదివినా అతన్నింతగా ప్రభావితం చేసిన పుస్తకం లేదు. ఏది చదవడానికైతే తాను జన్మజన్మలుగా ఎదురుచూస్తున్నాడో, ఏ పుస్తకం చదవడానికి తాను చదువు నేర్చుకోవాలనుకున్నాడో అదే ఈ పుస్తకం అనుకున్నాడు సాంబయ్య. అంతర్లీనంగా తనలో ఉన్న భావాలకు ప్రతిరూపం ఈ పుస్తకం అనిపించింది సాంబయ్యకు. పుస్తకాన్ని తీసి హృదయానికి హత్తుకున్నాడు. మరోసారి యోగ్యతాపత్రం చదివాడు. ఇప్పుడా యోగ్యతా పత్రం యొక్క విలువ మరింత తెల్సింది సాంబయ్యకు.

"స్వయంగా చదవండి, చదివింతర్వాత శ్రీశ్రీని చూడాలనిపిస్తే స్వయంగా చూడండి'' చెలం మాటలను మరోసారి చదివాడు.

"శ్రీశ్రీ ఎక్కడుంటాడు? శ్రీశ్రీని చూడాలి. ఒక్కసారైనా చూడాలి. శ్రీశ్రీ మద్రాసులో ఉంటాడని మిత్రుడు చెప్పాడు. అతన్ని చూడాలి. చూసి కౌగలించుకోవాలి. దూరం నుంచైనా చూడాలి. తనలో తాననుకున్నాడు. ఆ పుస్తకాన్ని అపురూపమైందిగా భావించాడు. కింద పెట్టాడు. ఇప్పుడా పుస్తకాన్ని చూస్తుంటేనే అతని ఒళ్ళు పులకరింతకు గురవుతుంది.

"సాంబన్నా! ఎడ్లు చెలుకదాటి మన పొలిమేర దాటిపోతన్నయి. నేనే మర్లేసుకచ్చిన... మీ చదువుకున్నోల్ల దొక్కటే చూపు. పులిచూపు... వెనుకకు చూడనే చూడరు. పుస్తకం చదువుకుంట ఎడ్లను మరిసిపోయినట్టున్నవు గద!" అన్నాడు నర్సయ్య. ఆ మాటలు విని సిగ్గుపడ్డాడు సాంబయ్య.

"ఆం... ఆం... పుస్తకం చదువుకుంటూ ఎడ్లు పోయింది చూల్లేదు'' అన్నాడు.

"నయ్యమిపుడు. ఎక్కడేం చేండ్లులేవు. పజ్జొన్న మొక్కల కాలంలనైతె నామచ్చి చచ్చిపోతయి. చెలుకల ఏం పాడైందే? ఇంటి






కి కొట్టుకపోయి కట్టేసి మేతెయ్యిండ్రి. రాత్తిరి దాక కంకినా కడుపునిండది వాటికి'' అని వెళ్ళిపోయాడు నర్సయ్య.

మరికొద్దిసేపుండి ఎడ్లను తోలుకొని ఊళ్ళో కొచ్చాడు. కొట్టంలో కట్టేసి మేతేసాడు. ఇంటి కెళ్ళాడు. ఆ రోజు సాంబయ్య మరేం చదువ లేకపోయాడు. ఆ తర్వాత రెండు రోజులవ రకు కూడా అలాగే జరిగింది. ఒకసారి శ్రీశ్రీని చూడాలనుకుంటూనే సెలవులు గడి పాడు సాంబయ్య. ఊళ్లో చూచాయగా వస్తు న్న మార్పులు శ్రీశ్రీ కోరుకున్నటు వంటివే నా అని అనుకోకుండా ఉండలేకపోయాడు సాంబయ్య.

సెలవులయిపోగానే కరీంగనర్‌కెళ్ళాడు. చదువులో నిమగ్నమయ్యాడు. సమయం దొరికినప్పుడు చలం రచనలు కొన్ని చదివా డు. మరోకొన్ని సాహిత్య గ్రంథాలు చదివా

డు. ఎక్కువగా అయితే తన చదువుకు ఆటంకం కలుగుతుందని చదువుపైకి దృష్టి మరల్చి నిర్విరామంగా చదువుతున్నాడు. మంచి మార్కులతో పాసవడమే ధ్యేయంగా చదువుతున్నాడు. అయితే ఓసారి శ్రీశ్రీని చూస్తే బాగుండునన్న కోర్కె మాత్రం అంత ర్లీనంగా ఉండనే ఉంది.

ఈ చదువులు పనికిరానివని, ఈ వ్యవస్థ మనదికాదని ఈశ్వర్ సాంబయ్య సీరియస్‌గా చదువుతుంటే దెప్పుతూనే ఉన్నాడు. కొన్ని నెలలు గడిచాయి. కాలేజీ రెగ్యులర్‌గా సాగుతోంది. సాంబయ్య చదువు... చదువు...అని లెక్కలతో కుస్తీపడుతున్నాడు. భౌతికశాస్త్రంతో సాముగరిడీలు చేస్తున్నాడు. రసాయనశాస్త్రాన్ని ఔపోసన పడుతున్నాడు.

"కరీంనగర్‌కు శ్రీశ్రీ వస్తున్నాడు" వార్త మోసుకొచ్చాడు ఈశ్వర్.

"నిజమా?" అని ఆశ్చర్యపోయాడు సాంబయ్య. 'రెండ్రోజుల్లో వస్తున్నాడు' అని శ్రీశ్రీ రాక గురించి తయారుచేసిన కరపత్రాలనిచ్చి వెళ్ళిపోయాడు ఈశ్వర్. శ్రీశ్రీ రాక గురించి ఈశ్వర్ చెప్పడం నచ్చకున్నా అతడు వస్తున్నందుకెంతో ఆనందంగా ఉంది సాంబయ్యకు. తాను చూడాలనుకున్న శ్రీశ్రీని ఇంత త్వరగా చూడగలనని ఊహించని సాంబయ్యకెంతో సంతోషమైంది. ఆ రెండ్రోజులు శ్రీశ్రీ పేరు పలువరిస్తూనే గడిపాడు. అతడెదురు చూస్తున్న రోజు రానే వచ్చింది. మునిసిపాలిటీ ఆడిటోరియం దగ్గర బహిరంగ సభనేర్పాటుచేశారు.

ప్రభుత్వ ప్రజావ్యతిరేకత గూర్చి, తెలంగాణా ప్రజల వీరోచిత రజాకరు పోరాటం గూర్చి, ఇంకెన్నో విషయాల గూర్చి చెప్పాడు శ్రీశ్రీ... స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళు గడిచినా జిల్లా హెడ్‌క్వార్టర్‌కు రైల్వేలైను లేకపోవడం గూర్చి ఆశ్చర్యం వ్యక్తంచేశాడు. లూజు పాంటు, లూజు షర్టు వేసుకొని ఎంతో మామూలుగా ఉన్న శ్రీశ్రీ మాట్లాడుతున్నంతసేపూ తన్మయుడై చూశాడు సాంబయ్య.

వరవరరావు, చెరబండరాజు కూడా మాట్లాడారు. విప్లవ రచయితల సంఘం గూర్చి చెప్పారు.

చెరబండరాజు

'ఊరు మేలు కొన్నదీ ఏరు మేలుకొన్నదీ
ఊరిలోని కూలిజనం
చుక్కపొద్దు లేచినదీ... సూర్యునితో నడిచినదీ..'

పాట పాడాడు. ఆ పాటకంతా ఊగిపోయారు. ఇప్పుడు సాంబయ్యకు కవిత్వమంటే, పాటలంటే తమకు తెలిసిన విషయాల గూర్చి రాయడమేకదా అనిపించింది. ఆ పాట సాంబయ్య నాలుకపై ఎప్పుడూ కదులుతూనే ఉంటుంది.

మీటింగ్ అయిపోయింతర్వాత గెస్ట్ హౌస్‌లో శ్రీశ్రీని కలవాలని సాంబయ్య, మరికొందరు విద్యార్థులు పోయారు. శ్రీశ్రీ వాళ్ళతోనెంతో ఆప్యాయంగా మాట్లాడాడు. సాంబయ్య భుజంపై చెయ్యేసి అభయమిస్తున్నట్టుగా నిమిరాడు. శ్రీశ్రీ చేయి భుజంమీద పడగానే ఏదో ఆత్మీయమైన వస్తువుతాకినట్టుగా అనిపించింది. ఆ స్పర్శ సాంబయ్య జీవితకాలమంతా మరిచిపోలేని అనుభూతిని కలిగించింది. తను చూడాలనుకున్న శ్రీశ్రీని తనివితీరా చూసి రాత్రివరకక్కడే ఉండి గదికెళ్ళాడు సాంబయ్య. ఆ రాత్రి అన్నం తినకుండానే పడుకున్నాడు.

శ్రీశ్రీని చూసిన, ఆయనతో మాట్లాడిన జ్ఞాపకాలనతడెప్పుడూ మరిచిపోలేదు. పాఠ్యపుస్తకాలతో తలవేడెక్కినప్పుడు సాంబయ్య లైబ్రరీకెళ్ళి కొన్ని సాహిత్య పుస్తకాలు తిరగేసి వస్తున్నాడు. పరీక్షలు దగ్గరపడుతున్నకొద్దీ క్లాసులు, ప్రైవేటు క్లాసులు జరుగుతున్నాయి. ఇప్పుడు సాంబయ్య పూర్తిగా చదువులోనే మనసు లగ్నం చేసి




కుస్తీపడుతున్నాడు.

ఊర్నుండి వచ్చిన వ్యక్తితో ఓ కాగితం రాయించి సాంబయ్య కివ్వమని పంపాడు చిలుకయ్య... కాగితాన్ని విప్పాడు సాంబయ్య.

"సాంబన్నా!

చెల్లెను కొట్టి పంపించాడు బావ! పిల్లతోనచ్చి గొడగొడా ఏడుస్తుంది. నువ్వొక్కసారి రా... వెంటనే పోవచ్చు. ఇంకొద్దిరోజులైతె పరీక్షలుంటాయి. చెల్లె నిన్ను చూడాలంటుంది. కొన్ని మాట్లాడాలి. మీ బావకు తక్కువ కట్నమిచ్చామట. మిగతా విషయాలు కల్మిడిలో మాట్లాడవచ్చు. ఈ కాగితం ముట్టగానే రా...

మీ నాన్న''

ఆ ఉత్తరాన్ని చదివిన సాంబయ్య తల పట్టుకున్నాడు.

"రేపొస్తానని నాన్నకు చెప్పు" అని వచ్చినతన్ని పంపించాడు.

ఇంటికెళుతూ బస్సులో కూర్చున్న సాంబయ్యలో ఎన్నో ఆలోచనలు... చెల్లి సమస్యనెలా పరిష్కరించడమా అని పరిపరి విధాలుగా ఆలోచిస్తున్నాడు.

తాను చదువుకున్నాడు. ఇంకో రెండు నెలల్లో తాను గ్రాడ్యుయేటవుతున్నాడు. తెలంగాణా సమ్మెకాలంలో వృథా అయిన సంవత్సరంతో కలుపుకొని పదహారు సుదీర్ఘ సంవత్సరాలు తాను చదువుకుంటూనే గడిపాడు. అయితే ఇంతకాలంగా తానేం నేర్చుకున్నాడు? ఈ చదువులు తనకేం నేర్పాయి? ఇంత చదివీ తాను చిన్నచిన్న సమస్యలొస్తేనే బెంబేలు పడిపోతున్నాడు. చదువుకోని తల్లిదండ్రుల్లా తాను కూడా చెల్లెను బావ కొట్టి పంపినప్పుడల్లా డబ్బిచ్చి పంపమంటున్నాడు. ఏదైతే అదవుతుంది లే అని ధైర్యంగా నిర్ణయాలు తీసుకోలేకపోతున్నాడు. న్యాయసమ్మతమైనవే అయినా ఉద్యమాలంటే తను వణికిపోతున్నాడు.

అసలిన్నేళ్ళ చదువులు తనకేం చెప్పాయి...? రాత్రింబవళ్ళు కష్టపడి చదివిన చదువులవల్ల తనకొచ్చిందేంటి? ఏం సాధించబోతున్నాడు తను. ఊళ్ళో దొరలకెందుకు వంగివంగి నమస్కారాలు పెట్టాలో ఈ చదువులు చెప్పలేదు. కొందరికెందుకు నూర్లకొద్దెకరాల భూములున్నాయో, మరికొందరికే మాత్రం భూమెందుకు లేదో తన ఇన్నేళ్ళ చదువు చెప్పలేదు. దొరల అధికారాలకు వెనుకున్న మూలాలేంటో చెప్పలేదు. కొందరెంత కష్టపడుతున్నా కూలినాలితో అర్ధాకలితోనే ఎందుకు బతకాల్సి వస్తుందో ఏ చదువూ చెప్పలేదు.

నాన్న ఒంటి నాగలెవుసంతో సతమతం కావడం, అవ్వ తన జీవితాన్నంతా భూమికే అంకితం చేయడం వెనుకున్న కోణాలు తనకీ చదువులు చెప్పలేదు. తాను చూస్తూ ఉండగానే కొందరాస్తులు విపరీతంగా పెరగడం, మరికొందరివి సున్నకావడం ఎందుకు జరుగుతుందో చెప్పలేదు చదువులు. సమాజంలోని అంతరాలు, సాంఘిక దురన్యాయాలు, దోపిడి, పీడనలాంటి ఏ విషయాన్ని గూర్చీ చెప్పలేదు చదువులు. అయినా తాను తనలాంటి లక్షలాదిమంది సుదీర్ఘకాలాన్నీ చదువులకోసం వెచ్చిస్తున్నారు.

తన చెల్లెల్లాంటి చెల్లెండ్లెంతోమందున్నారు. సమాజంలో... మరిలాంటివాళ్ళ సమస్యలకు ఏం పరిష్కారాలను చెబుతుందీ చదువు? అసలీ చదువులు తనలాంటి వాళ్ళనీ సమాజంలో ఎలా బతకమన్నాయి? సమస్యలనెలా పరిష్కరించమన్నాయి? అసలీ చదువుల ప్రయోజనమేంటి?

ఈశ్వర్ చెప్పినట్టు ఈ చదువులు కేవలం గుమాస్తాలను తయారుచేయడానికేనా? పోనీ చదువుకున్న వాళ్లందరికీ ఉద్యోగాలు దొరుకుతాయా? ఇప్పటికే ఎంతోమంది వీధుల్లో తిరుగుతున్నారు. తనలా చదువులో తెలివితే

టలున్న వాడికి తొందరగానే ఉద్యోగం దొరుకవచ్చు. కాని ఉద్యోగం దొరకనివాళ్ళంతా ఏంచేయాలని చెబుతున్నాయీ చదువులు? ఎలా బతకమంటున్నాయి?

అసలీ చదువులు, పాఠ్యపుస్తకాలు ప్రపంచం గూర్చి ఏం చెప్పాయి? సామాజిక పరిణామాల గూర్చి ఏం బోధించాయి? మరి తన ఇన్నేళ్ళ చదువుల కర్థమేంటి?

సాంబయ్యలో రకరకాల ప్రశ్నలు.

ఈ సమాజం గూర్చి తాను కొంతైనా తెలుసుకున్నాడంటే అవి తాను బయట చదివిన పుస్తకాల ద్వారానే. మరీ పాఠ్యపుస్తకాల చదువుల ఉపయోగమేంటి?

చెల్లెలి సమస్య పరిష్కారం గూర్చి ఆలోచిస్తూ, ఎన్నో విధాలుగా ఆలోచిస్తున్నాడు సాంబయ్య.

తాను చలం గూర్చి కొంత చదివాడు. మరి డబ్బు మనిషైన బావనొదిలి రమ్మని చెల్లెకు తాను సలహా ఇవ్వగలడా? ఆమె వచ్చినా తానామెకండగా ఉండగలడా? తల్లిదండ్రుల నావిషయాని కొప్పించగలడా? లోకం మాటల కెదురునిలిచి మనగలడా? ఇన్నేళ్ళ చదువూ తనకాధైర్యాన్నెందుకివ్వలేదు? ఇంతకీ ఇప్పుడు తానేం చెయ్యాలి? తల్లిదండ్రులు ఆందోళన పడకుండా ఎలా చూడాలి? దీనికి పరిష్కారమేంటి? తన చదువులకు ప్రయోజనమేంటి? చదువుకున్నవాడైన తాను నాలుగు కళ్ళతో ప్రపంచాన్ని చూస్తాడన్న తల్లికి తానేవిధంగా పరిష్కారం చూపాలి?

బస్సు ఊరు చేరుకునే వరకూ ఆలోచిస్తూనే ఉన్నాడు సాంబయ్య... బస్సు దిగి ఇంటికెళ్ళాడు.

సాంబయ్య కాళ్ళమీద పడి అతని చెల్లెలు గొడగొడా ఏడుస్తోంది. చెల్లి లేపి కూర్చోబెట్టాడు. ఓదార్చాడు. ఆమె బిడ్డనెత్తుకున్నాడు.





"సాంబయ్యా! మీ బావ రక్తం రుచి మరిగిన పులోలె చేస్తండు. ఏం జేసుడో తెలుస్తలేదు. మనం పట్టించుకోకుంటె దాని సంసారం పాడైపోతది'' అన్నాడు చిలుకయ్య.

తర్జనభర్జనలు చేసుకున్నారు. ఆఖరుకు చిలుకయ్య చెప్పినట్టు మరికొంత డబ్బిచ్చి తన జోలికి రాకుండా చేయాలనుకున్నారు. అదే చేశారు.

తెల్లవారుండి కరీంనగర్ బయలుదేరాడు సాంబయ్య. 'స్వాతంత్ర్య పోరాటకాలంలో ఉండికూడా గురజాడ, వీరేశలింగం పంతులులాంటి వాళ్ళు స్వాతంత్ర్యం గురించి ఎందుకు పట్టించుకోలేదు? సంఘసంస్కరణల కోసమే సమయాన్నంతా ఎందుకు వెచ్చించారు?' అప్పుడప్పుడనుకుంటూండేవాడు సాంబయ్య.

సామాజిక సంస్కరణలెంత అవసరమో, వాళ్ళెందుకు వాటికీ ప్రాధాన్యతనిచ్చారో సాంబయ్యకు తన చెల్లె సంఘటన ద్వారా తెలిసింది.

ఫైనలియర్ పరీక్షలు బాగానే రాసాడు సాంబయ్య. ఫస్టుక్లాసు తప్పకుండా వస్తుందని ఊహిస్తున్నాడు. మిత్రులందరి దగ్గరా వీడ్కోలు తీసుకొని గది ఖాళీ చేసి ఊరికొచ్చాడు సాంబయ్య. అప్పుడప్పుడు కరీంనగర్ వెళ్ళి వస్తున్నాడు. జిల్లా పరిషత్కు, ఎంప్లాయ్‌మెంట్ ఆఫీసుకు, మరికొన్ని ఆఫీసులకు వెళ్ళి ఉద్యోగాల కోసం ఎంక్వయిరీ చేస్తున్నాడు. రిజల్టు వచ్చిన రోజున సాంబయ్య ఎగిరి గంతేసాడు. చక్రపాణి, సారథి, వేణు సాంబయ్య అంతా ప్రథమశ్రేణిలో పాసయ్యారు. ఈశ్వర్ మాత్రం ద్వితీయశ్రేణిలో పాసయ్యాడు. సగంమందికి పైగా ఫెయిలయ్యారు. ఏదైనా సరే త్వరగా ఉద్యోగం సంపాదించుకోవాలని నిర్ణయించు

కున్నాడు సాంబయ్య.



"సాంబయ్యా! డిగ్రీ ఫస్టుక్లాసులో పాస య్యావు. ఎమ్మెస్సీ చెయ్యొచ్చుగదా! కిషన్‌రెడ్డి ఎమ్.ఏ. చదువుతానంటున్నాడు'' అన్నాడు కొండల్‌రెడ్డి.

"మా నాన్నకిప్పటికే చాలా కష్టమవుతుంది. అప్పుల కిందికి మంచి చేను అమ్ముడు పోయింది... ఇంకా నేనాతన్ని ఇబ్బంది పెట్టదలుచుకోలేదు. ఏదైనా ఉద్యోగం సంపాదించుకోవాలని ప్రయత్నం చేస్తున్నాను'' అన్నాడు సాంబయ్య.

"ఉద్యోగమంత సులభంగా దొరుకుతుందా? కనీసం ఉద్యోగమయ్యేంతవరకైనా చదువుకోలేకపోయావా? ఉద్యోగం దొరికితే వదిలిపెట్టచ్చు''

ఈ ఆలోచన బాగానే ఉందనిపించింది సాంబయ్యకు. కాని తన ఇంటి పరిస్థితులింకా చదువుకోవడానికి అనుకూలించడంలేదు. తండ్రిని మరింత ఇబ్బందిపెట్టి చదువుకోవడం అతనికిష్టంలేదు.

"మీరు చెప్పింది బాగానే ఉంది కాని మాకు వెళ్ళేట్టు లేదు. అందుకోసం ముందేదైనా ఉద్యోగం చూసుకుంటాను. ఉద్యోగం చేస్తూ క్వాలిఫికేషన్స్ పెంచుకోవచ్చు''

"మరిప్పుడు దేనికోసం ప్రయత్నిస్తున్నావు?"

"ట్రెయినింగ్ లేకున్నా ఉద్యోగాలకోసం హాఫ్ ఎ మిలియన్ జాబ్స్ స్కీమ్‌కింద గ్రాడ్యుయేట్లను ఉపాధ్యాయులుగా తీసుకుంటున్నారు. తర్వాత బి.ఎడ్.కు పంపి పర్మినెంట్ చేస్తారు. దానికోసమే ప్రయత్నిస్తున్నాను''

"ఏమో సాంబయ్యా! అప్పుడేమో బంగారంలాంటి ఇంజనీరింగ్ అవకాశాన్ని పాడు చేసుకున్నావు. ఇప్పుడేమో బడిపంతులు నౌకరికి పోతానంటున్నావు. నీకేం చెప్పేది? సరే నీ ఇష్టం"

సాంబయ్య తన ప్రయత్నాలు చేస్తూనే ఉన్నాడు. నిరుద్యోగిగా ఉన్న సాంబయ్య ఇప్పుడు తల్లిదండ్రుల కండ్లకు కూడా చులకనగా కనబడుతున్నాడు. ఆర్థిక ఇబ్బందులు తట్టుకోలేకనో, చదువుకున్న కొడుకు ఖాళీగా ఉండడం భరించలేకనో చిలుకయ్య గొణుక్కోవడం మొదలుపెట్టాడు. ఉద్యోగాలకు దరఖాస్తు చేయడానికి డబ్బులియ్యమన్నా, కరీంనగర్ వెళ్లడానికి డబ్బులీయమన్నా 'ఇక చేస్తవు తియ్యి పొడుగు' అంటున్నాడు. తననెంతో ప్రాణాధికంగా చూసుకున్న తండ్రి ప్రవర్తన సాంబయ్యకు మింగుడు పడడంలేదు. కొన్ని నెలలు గడిచాయి నిరుద్యోగిగా.

పెళ్లి చేసుకొమ్మని అడిగాడు చిలుకయ్య.

ఉద్యోగం అయ్యేవరకాగమన్నాడు సాంబయ్య.

"ఆం... నీకు దొరుకుతదుద్యోగం? మమ్ముల నుద్ధరిత్తవు. దానికి దీనికి సంబంధమేంది? పెండ్లి చేసుకో' అన్నాడు.

"నాన్నా! నాకెప్పుడు దొరుకపాయె ఉద్యోగం? చదువయిపోయి ఆర్నెల్లవుతుందో లేదో? నా ప్రయత్నాలు నేను చేస్తూనే ఉన్నానుకద! మీకప్పుడే ఎందుకింత యాష్టకొస్తోంది?"

కొడుకు మాటలు విని కొంత తగ్గాడు చిలుకయ్య.

"ఉద్యోగమదే అవుతుందికాని పెళ్లి చేసుకో. ఇరవై మూడేండ్లచ్చినయి. ఇంకెప్పుడు చేసుకుంటవు? మన ఇండ్లల్ల పదిహేను, పదహారేండ్లకే చేస్తిమి. చదువుకుంటున్నవని ఇన్ని రోజులాగినం" అన్నాడు చిలుకయ్య.

సాంబయ్యెంత చెప్పినా వినలేదు. ఇక ఔననక తప్పలేదు. నిరుద్యోగిగా ఉంటూనే పెళ్లి చేసుకొని సాంబయ్య ఎంతో మానసిక వేదననుభవించాడు. కొత్త మురిపెంతో భార్యతో సరదాగా తిరుగుదామన్నా, కరీంనగర్ వెళ్లి సినిమా చూద్దామన్నా, ఓ చీర కొనిద్దామన్నా ప్రతి రూపాయీ తండ్రినడగాల్సిన పరిస్థితి అతనికి బాధాకరంగా ఉంది.

డబ్బడిగితే తండ్రి విసుక్కుంటున్నాడు

"నిన్నూ నీ పెండ్లాన్నిద్దర్ని సాదాలా?" అంటున్నాడు.

"మరి వద్దంటున్నా పెళ్లెందుకు చేశావు?"

"బాగ బల్సి..."

తండ్రి నిష్ఠూరాలకు కారణం ఆర్థిక దుస్థితే అని అర్థం చేసుకున్న సాంబయ్య తండ్రితో ఏవాదం పెట్టుకోవడంలేదు. పెళ్లయిన రెండు నెలల్లోనే హాఫ్ ఎ మిలియన్ స్కీమ్ కింద ఉపాధ్యాయుడిగా ఉద్యోగమొచ్చింది సాంబయ్యకు. తాను కోరుకున్న ఉపాధ్యాయ ఉద్యోగం వచ్చినందుకు ఎగిరి గంతేశాడు సాంబయ్య. కుటుంబ కష్టాలు తీరుతాయనుకున్నాడు.

వెంటనే వెళ్లి ఉద్యోగంలో జాయినయ్యాడు. వెంట భార్యను కూడా తీసుకెళ్లాడు. అయితే ఏ వసతులూ లేని పల్లెటూళ్లో తన భర్త ఉద్యోగం చేయడం ఆమెకు నచ్చలేదు. ఆమె అన్నలంతా ఉన్నతోద్యోగాల్లో ఉన్నారు. వాళ్లు సాంబయ్య మంచి ఇంటలిజెంటని తెలుసుకొని భవిష్యత్తులో మంచుద్యోగం వస్తుందని భావించి చెల్లినిచ్చి పెండ్లి చేశారు. అవన్నీ జ్ఞాపకం వచ్చి సాంబయ్య భార్య మరేదైనా ఉద్యోగం చూసుకొమ్మని పోరు పెట్టసాగింది. దానికి తోడు పల్లెల్లో ఆ సమయంలో ఉపాధ్యాయుడికేమాత్రం విలువ లేకపోవడం చూశాడు.

"అయ్యో సాంబయ్యా! నీకే ఉద్యోగం దొరుకలే! గీ టీచర్ నౌకరి కచ్చినవేంది?"

"నువ్వు చదువులుషారుగద గీ నౌకరి జేత్తన్నవేంది?"

"అయ్యో సాంబయ్య గంత జదివి నువ్వు చేసేది పంతులు నౌకరేనా?" అంటూ

ఊరెళ్లినప్పుడు తన ఉద్యోగాన్ని చులకన చేసి మాట్లాడటం బాధ కలిగించింది సాంబయ్యకు.

"బతుకలేనోడు బడిపంతులని చదువుల గంతుషారున్నవు. గీ నౌకరి జేత్తావు?" అనే దెప్పసాగారు.

ఇవన్నిటిమధ్య తాను ఉపాధ్యాయుడిగా చేరి ఏవేవో చేస్తానని కిషన్‌రెడ్డికి రాసిన ఉత్తరం జ్ఞాపకం వచ్చి సాంబయ్యలో రకరకాల సంఘర్షణలు మొదలయ్యాయి. మరో ఉద్యోగం కొరకు ప్రయత్నించక తప్పలేదు సాంబయ్యకు. అప్పుడే గోదావరి ఖనిలో మందుల ఫ్యాక్టరీ నిర్మాణం ప్రారంభమైంది. అది కేంద్రప్రభుత్వ యాజమాన్యంలోని పెద్ద ఫ్యాక్టరీ. అందులోకి ఉద్యోగం ఇంటర్వ్యూకోసం లెటరొచ్చింది. వెళ్లి సెలెక్టయ్యాడు సాంబయ్య. ప్రారంభంలోనే జీతం హెడ్ మాస్టర్ జీతానికంటెక్కువుంది. అందరూ ఆ ఉద్యోగంలో జాయిన్ కావాలనే సలహా ఇచ్చారు. ఉపాధ్యాయ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఫాక్టరీ ఉద్యోగిగా చేరాడు సాంబయ్య.

జీతం ఫర్వాలేదు. అన్ని వసతులున్న క్వార్టర్ దొరికింది. చదువుకున్న భార్య, ఆ కాలనీలో ఉండేవాళ్లంతా ఉద్యోగులే. స్కూటర్లు, టీవీలు, ఫ్రిజ్‌లు, డైనింగ్ టేబుళ్లు, ఇతర ఫర్నీచర్‌లాంటివి చేకూర్చుకోవడంలో నిమగ్నమయ్యాడు సాంబయ్య. తన జీవితాన్ని సుఖమయం చేసుకోవడంలో మునిగిపోయాడు.




కొన్నేళ్లు గడిచాయి. సాంబయ్యకు పిల్లలయ్యారు. అయినా చిలుకయ్య ఊళ్లో ఒంటినా గలెవుసం చేస్తూనే ఉన్నాడు. రాజమ్మ వ్యవసాయపు పనుల్లో మునిగి తేలుతూనేవుంది. వాళ్లనేపని చేయకుండా కూర్చొని తినమనే ధైర్యం సాంబయ్యకు లేదు. వ్యవసాయం మానుకోమన్నా చిలుకయ్య మానుకోవడానికి సిద్ధంగా లేడు. అయినా తాను చదువుకునే వయసులో ఏమైతే అనుకున్నాడో వాటిని చేయడానికి సాంబయ్యచుట్టూ గిరిగీసుకున్న కుటుంబ పరిధి అనుమతించడంలేదు. మాటవరుసకైనా తండ్రిని వ్యవసాయం మానుకొమ్మనలేదు సాంబయ్య. కొన్ని అప్పులుంటే తీర్చాడు. అప్పుడప్పుడు తండ్రికి నామమాత్రంగా కొంత డబ్బిస్తున్నాడు. ఊరెల్లి వస్తున్నాడు.

ఈమధ్య ఊళ్లలో చాలా మార్పులొచ్చాయి. వస్తున్నాయి. ఉద్యమాలు ఉవ్వెత్తున లేచాయి. ఇన్నాళ్లుగా అణగిమణిగి ఉన్నవాళ్లు, నీ బాంచెన్ కాల్మొక్తా అంటూ బతికిన వాళ్లు తిరగబడుతున్నారు. కూలిరేట్లు పెంచుతున్నారు పాలేర్ల జీతాలు పెంచుతున్నారు. దొరలకెదురు నిలిచి పోరాడుతున్నారు.

ఉద్యమాలకు పూర్వం తెలంగాణా గ్రామాల్లో హరిజనుల పరిస్థితి కోస్తా ప్రాంత హరిజనులకంటె అధ్వాన్నంగా ఉండేది. పరమ దయనీయంగా ఉండేది. వెట్టిచాకిరి, బానిసత్వం తప్పేవి కావు. ఉద్యమాల తర్వాత వాళ్లది పైచేయయింది. కోస్తా ప్రాంతపు హరిజనుల పరిస్థితికంటె ఎన్నో రెట్లు మెరుగైంది. సాంప్రదాయ పాటలకు బదులు గద్దర్ పాటలు ప్రజల నోళ్లలో తిరుగాడుతున్నాయి. పోలీసు దాడులతో, ఉద్యమకారుల దాడులతో తెలంగాణ ఊళ్లన్నీ భయకంపితమవుతున్నాయి.

మరి కొద్దిరోజుల తర్వాత ఎరుపును సమర్ధిస్తూ, ఎరుపును విమర్శిస్తూ పాటలు, స్లోగన్లు, గోడ రాతలు పట్టణాల్లోనూ, ఊళ్లలోనూ దర్శనమివ్వసాగాయి.

'ఎరుపంటే కొందరికీ భయం భయం...

పసిపిల్లలు వాళ్లకంటె నయం నయం...'

అని ఒకరు ప్రచారం చేస్తుంటే-

'ఎరుపంటే ఎవడికిరా భయం భయం...

అది నా తల్లి నుదుటి సింధూరంరా..."

అని దానికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నారు.

'లాల్‌బనో గులామీ చోడో బోలో వందే మాతరం' అని ఉద్యమకారులు ప్రచారం చేస్తుంటే,

'లాల్‌గులామీ చోడో బోలో వందే మాతరం' అని మరో వర్గంవారు ప్రచారం చేస్తున్నారు.

విద్యార్థుల్లోనూ అన్ని వామపక్ష పార్టీల యూనియన్లు, పాలక పార్టీల యూనియన్లు పనిచేస్తున్నాయి.

పోలీసులపై ఉద్యమకారుల దాడులు, ఉద్యమకారులపై పోలీసుల దాడులు జరుగుతున్నాయి. సాంబయ్య ఉన్నటువంటి కాలనీల్లో పరిస్థితి అంత భయంకరంగా లేకున్నా గ్రామాల్లో మాత్రం ప్రజల బతుకు అడకత్తెరలో పోకల్లా ఉంది. ఉద్యమకారులకు ఆశ్రయమివ్వకుంటే వాళ్లు, ఇస్తే పోలీసులు ప్రజలపై దాడి చేస్తున్నారు. ఈ మధ్యనే ఓ పోలీసాఫీసర్‌ను హత్య చేశారు ఉద్యమకారులు. రోజూ ఎన్‌కౌంటర్ పేరుమీద ఎక్కడో ఓచోట యువకులు బలవుతున్నా పోలీసాఫీసర్ హత్యను తీవ్రంగా తీసుకున్నారు పోలీసులు. ఊళ్లమీద దాడిచేశారు. పదిహేనేళ్ళు నిండీ నిండనివాళ్లనుంచి మొదలుకొని యువకులంతా ఊళ్లనొదిలి వెళ్లిపోయారు. వాళ్లు దొరుకకుంటె కొడుకుల నెక్కడికి పంపించారని వృద్ధులని కూడా కొట్టారు పోలీసులు. కొన్ని రోజులు గ్రామాల్లో నానా భీభత్సం జరిగిన తర్వాత లోకల్ ఎమ్.పి., ఎం.ఎల్.ఏ. జోక్యంతో దాడులాగిపోయాయి. ఊళ్లోకి కొత్తవాళ్లెవరొచ్చినా పోలీసు

లకు తెలియజేయాలన్న షరతుపై ఊళ్లలో నుంచి పోయారు. కల్లోలిత ప్రాంతాల ప్రకటన, పౌరహక్కుల సంఘాలు, ఎన్‌కౌంటర్లు, హత్యలు, దాడులు, పోలీసు బూట్ల చప్పుళ్లతో తెలంగాణా గ్రామాలు అట్టుడికినట్టుడికి పోతున్నాయి.

పోలీసాఫీసర్‌ను చంపి ఊళ్లో దాడులు జరిగింతర్వాత ఊరికెళ్లాడు సాంబయ్య. ఇంకా యువకులంతా ఊళ్లోకి రాలేదు. పొద్దు పోవడం లేదని బస్టాండుదగ్గరున్న హోటల్లో కూర్చున్నాడు. కుమ్మరి వెంకయ్య పదిహేను రోజులకింద ఊరు వదిలి పోయిన కొడుకుకోసం ఎదురుచూస్తున్నాడు. 'కొడుకు ఎడ్డోడేనాయె... ఎందుకు పోయిండు?' అన్న బెస్త నర్సింలుతో తన వ్యధంతా చెప్పుకుంటున్నాడు వెంకయ్య.

"ఎడ్డోడయితేంది? ఎవ్వడైతేంది? మూతిమీద మీసముండి అంగిలాగు తొడుక్కున్న పడుసు పోరగాండ్లనందర్ని మలేసి కొడుతండ్రు పోలీసులు. గా పోలీసయినెను సంపినకాన్నుంచి ఊరంత బెగ్గం పాడైంది. అసలోడెవ్వడో దొరుకపాయెగని అట్టట్టోల్లనయితె ఉతుకవట్టిరి. గా హరిజనుల ఇండ్లల్లనయితె ఇంకింత గోరం జేసిరి. ఆల్లతోనే ఆల్ల గుడిసెలను పీకేయించిండ్రు. ఇండ్లు కూలగొట్టిచ్చిండ్రు. వడ్లు దీసి నూతిల పోసిండ్రు. తొక్కుల ఒంటెల్కు పోసిండ్రు. గోరం గోరం జేసిండ్రు. గా పోలీసోల్లు ఊరును మందమీద తోడేలు పడ్డట్టే చేసిండ్రు..."

ఆ మాటలతో ఊళ్ల పరిస్థితులనర్థం చేసుకున్నాడు సాంబయ్య. ఎంతో అమాయకులనుకున్నవాళ్లు, చాకలి బక్కమ్మ కొడుకులాంటివాళ్లు అలాంటి ఉద్యమాలకు నాయకత్వం వహిస్తున్నారని తెలుసుకొని ఆశ్చర్యపోయాడు సాంబయ్య.

తాను, తన పిల్లలు, భార్య, ఉద్యోగం వీటివరకే తనను తాను పరిమితం చేసుకున్న సాంబయ్య వాటిని గురించి ఆలోచించదలుచుకోలేదు. ఆలోచించి ఇబ్బందులు కొని తెచ్చుకోవడమాతనికి ఇష్టంలేదు.

ఉద్యోగం దొరికి పదేళ్లు గడిచిన తర్వాత ఒక్కసారి వెనుదిగిరి చూసుకున్నాడు సాంబయ్య. చాలామంది మధ్య తరగతి జీవుల్లాగే తానెంత మధ్యతరగతి ఊబిలో దిగి బతుకుతున్నాడో అర్థం చేసుకున్నాడు. ఆ ఊబి నుంచి బయటపడే ధైర్యంమాత్రం అతనికి లేదు. బయటపడటం ఇష్టం కూడా లేదు.

తన చదువు, తన జీవితం ఏం నేర్పింది? తను చదువుకొని ఏం సాధించగలిగాడు? తాను చదువులో క్లాసులో ఫస్టయి, ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడై అంత జీవితాన్ని చదువుకే అంకితం చేసి ఏం సాధించినట్టు?

ఎన్నో రకాలుగా ఆలోచిస్తున్నాడు సాంబయ్య. అతనికి ఊరు జ్ఞాపకం వచ్చింది. మార్పులు జ్ఞాపకం వచ్చాయి. తనతో చదువుకున్నవాళ్లు జ్ఞాపకం వచ్చారు.

ఊరొదిలి పోయిన కొండల్‌రెడ్డి, వెంగళరావు, రాజారావు కుటుంబాలు జ్ఞాపకం వచ్చాయి. సాంబయ్యతో చదువుకున్నవాళ్లెంతోమంది ఉద్యమాల్లో మునిగి తేలుతున్నారు. నాయకత్వం వహిస్తున్నారు. కొందరి తలలపై లక్షల రూపాయలను ప్రకటించింది ప్రభుత్వం. అణగిమణిగి వున్న జనం అమాయకులనుకున్నవారు నాయకులై గుండ్లకెదురు నిలిచి పోరాటాలు చేస్తున్నారు.

ఇదంతా విచిత్రంగా అనిపిస్తోంది సాంబయ్యకు. ఈ అమాయకులే, అవ్వ బాంచెను అయ్యబాంచెనుగాల్లే రజాకార్లకెదురు నిలిచి పోరాడారు.

వాళ్లే మళ్లీ దొరల దౌర్జన్యానికి తల వంచారు. ఆ అమాయకులే మళ్లీ ఉప్పెనలై లేచి గుండ్లకెదురు నిలిచి జీవన్మరణ పోరాటాలు చేస్తున్నారు.

ఇప్పుడూరు భూములకు శ్రీరాంసాగర్ నీళ్లొస్తున్నాయి. పటేలు, పట్వారీల స్థానంలో ప్రభుత్వోద్యోగులొచ్చారు. చాలామందిప్పుడు చదువుకుంటున్నారు.




పోరాటాలు ఒక్కోసారి తగ్గినట్టనిపిస్తు న్నాయి... మరోసారి ఉధృతంగా లేస్తు న్నాయి.

'అసలీ పోరాటాలు సరైనవేనా? న్యాయ సమ్మతమైనవేనా? పదేళ్లక్రితమైతే తాను పోరాటాల్లో పాల్గొనకున్నా అవి న్యాయసమ్మ తమైనవే అనుకున్నాడు... మరిప్పుడు?'

వాట్ని గురించి ఆలోచించలేదు. తానిప్పు డనుభవిస్తున్న ఈ జీవితానికి భిన్నంగా ఏం జరిగినా తానిప్పుడు సహించలేడు. తాను గిరి గీసుకున్న పరిధిలోకి ఎవ్వరినీ రానీయ లేడు. తన కుటుంబం గూర్చి తప్ప దేన్ని గురించీ ఆలోచించలేడు. అంతే... అంతే... అనుకున్నాడు సాంబయ్య.

ఊరెళితే మాత్రం అతనికెన్నో జ్ఞాపకం వస్తున్నాయి. మొన్ననే ఊరెళ్లి వచ్చాడు.

"చాకల్దాన్నవ్వా..." అంటూ అన్నం అడుక్కునే చాకలి గంగమ్మ జ్ఞాపకం వచ్చింది సాంబయ్యకు.

ఊళ్లోని వృత్తులు జ్ఞాపకం వచ్చాయి. ఖచ్చితంగా కాకున్నా ఇంకా ఊళ్లలో కులవృ త్తులు సజీవంగా ఉండటం జ్ఞాపకం వచ్చింది. అదే సమయంలో అన్ని కులాలవా ళ్లూ చదువుకుటుండటం, కొందరు ఉద్యోగా లు చేస్తుండటం జ్ఞాపకం వచ్చింది. బాధ్యతా యుతంగా కుటుంబ భారాన్ని మోస్తున్న యువతరం, లుంగీలు కట్టుకొని జులాయీ లుగా తిరిగే లంపెన్ యువతరం కూడా జ్ఞాపకం వచ్చింది.

'ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్
హౌ ఐ వండర్ వాట్ యూ ఆర్...'

సాంబయ్య కొడుకు రైమ్స్ బట్టీ పడుతు న్నాడు.

కొడుకు కంఠం విన్న సాంబయ్యకు తన చదువు జ్ఞాపకం వచ్చింది.

తాను గుడ్డిదీపం వెలుతుర్లో చదువుకు న్నాడు... తన కొడుకు ట్యూబ్‌లైట్ వెలుతుర్లో చదువుకుంటున్నాడు. తాను చదువుకుంటా నంటే కళ్లు పాడైతాయని తండ్రి చాలనేవా డు. తాను కొడుకును కూర్చోబెట్టి చదివిస్తు న్నాడు. తనకు లేని ఎన్నో వసతులు కొడు క్కు కల్పిస్తున్నాడు తాను.

తన కొడుకును మొదట్లో తెలుగు మీడి యంలోనే చదివించాలనుకున్నాడు. కాని తన భార్య వినలేదు. మిత్రులంతా హేళన చేశారు. ఇక కాన్వెంట్లో చదివించక తప్పలే దు.

తాను బడికి పోయినప్పటికంటె ఇప్పటి కి చదువుకునే అవకాశాలు కొంత మెరుగైనా పల్లెల్లో ఇంకా చాలామందికి చదువుకునే అవకాశాలు తక్కువేనని గమనిస్తున్నాడు. అయినా వాటిని గూర్చి ఆలోచించదలుచుకో లేదు సాంబయ్య. ఈ చదువులు పరాయీకర ణకు గురిచేస్తున్నాయని గమనిస్తున్నా మంచి ఉద్యోగమనే లక్ష్యాన్ని దృష్టిలో పెట్టు కొని పిల్లలను చదివిస్తున్నాడు. బడి ఇంటికి పెద్దగా దూరం లేకున్నా తనకు వీలైతే స్కూటర్‌పై తీసుకెళ్లి దింపి వస్తున్నాడు.

పల్లెలో పుట్టిపెరిగిన సాంబయ్య తన పిల్లలకు నాగలి, మోటల బొమ్మలు వేసి ఇది నాగలి, ఇది మోట అని ఇంగ్లీషులో అర్థం చేయిస్తున్నాడు. సాంబయ్య పిల్లలు రోజూ బోలెడంత హెూంవర్క్, క్లాస్ వర్క్ చేస్తు న్నారు. వాళ్లకు మంచి ఇంగ్లీషు మాట్లాడటం నేర్పించడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తున్నా డు సాంబయ్య. తన పిల్లల్లో ఒకర్ని కలెక్టర్, మరొకర్ని డాక్టర్ చేయాలని కలలు గంటు న్నాడు.

అప్పుడప్పుడాతనికి తన ఆదర్శాలు, చు ట్టూ జరుగుతున్న పోరాటాలు, సాహిత్యం, శ్రీశ్రీలాంటివి జ్ఞాపకం వచ్చినా వాటిని బలవంతంగా నొక్కిపెడుతున్నాడు.

వృద్ధుడైన చిలుకయ్య ఇంకా రెండు బక్కెడ్లతో ఒంటినాగలెవుసం చేస్తూనే ఉన్నా డు. రాజమ్మ పొలం పనులకెళ్తూనే ఉంది.



# చమత్కారకత్తెలు

## 'ఎక్స్‌ప్రెస్' ఐడియా!

రామ్మూర్తి మంచి అద్దె ఇంటికోసం వెతికి వెతికి విసిగిపోయాడు. ఊరికి దూరంగా విసిరేసినట్లు ఇళ్ళు దొరికాయి. అద్దె, అడ్వాన్స్ తక్కువయినా సేఫ్టీ కూడా తక్కువని వద్దనుకున్నాడు. విడి ఇళ్లు సిటీలో కొందరు చూపించినా, ఇరుగుపొరుగుతో అంతగా



సంబంధాలు వుండవని ఆ ఇళ్లూ వద్దనుకున్నాడు. అలా ఇళ్ల వేటలో విసిగిపోయిన రామ్మూర్తికి నగరం నడిబొడ్డులో మంచి ఫ్లాట్ దొరికింది. అద్దె, అడ్వాన్స్ రెండూ రామ్మూర్తికి ఇబ్బంది అనిపించలేదు. మంచిరోజు చూసుకుని భార్యా, కుమార్తెతో ఫ్లాట్ ప్రవేశం చేశాడు రామ్మూర్తి. ఆ కాంప్లెక్స్‌లో అంతస్థుకి నాలుగు చొప్పున, నాలుగు అంతస్థులకీ కలిపి పదహారు ఫ్లాట్లు వున్నాయి.

రామ్మూర్తికి, భార్య రాజేశ్వరికి, పాప వసంతకి మొదటి అంతస్థులోని వాళ్ల ఫ్లాట్ ఎంతో నచ్చింది. నీళ్ళకు కష్టంలేదు. దోమలు లేవు. వసంతకి స్కూల్ దగ్గర. రామ్మూర్తికి ఆఫీసు స్కూటర్ మీద పది నిముషాల దూరం. మార్కెట్ కూడా చాలా దగ్గర కావడంతో స్వంత ఇల్లు కట్టుకునేదాకా ఆ ఫ్లాట్‌లోనే వుందామని రామ్మూర్తి నిర్ణయించుకున్నాడు.

రామ్మూర్తి ఫ్లాట్‌లోకి వచ్చిన మర్నాడు... తెల్లవారింది. చెప్పినట్లు కొత్త అడ్రస్‌కి పేపర్ బాయ్ 'హిందూ' తీసుకువచ్చి పడేశాడు. పేపర్ తెరచి హెడ్‌లైన్‌లు, టివి ప్రోగ్రామ్‌లు, స్పోర్ట్స్ పేజీ, 'నగరంలో ఇవాళ ఊరేగింపులు' చూసి పేపర్‌ని టేబుల్ మీద పెట్టి కాఫీ కప్పు తీసుకున్నాడు.

ఇంతలో కాలింగ్‌బెల్ ఎవరో కొట్టారు. తలుపు తెరచి చూస్తే ప్రత్యక్షమైన శాల్తీ తన పేరు విశ్వనాథం అనీ, పక్క ఫ్లాట్‌లో వుంటున్నానని పరిచయం చేసుకున్నాడు. రామ్మూర్తి విశ్వనాథాన్ని కూర్చోమని చెప్పి, 'చెప్పండి' అన్నాడు.

"అబ్బే ఏం లేదు... మీరు హిందూ తెప్పిస్తారా. ఒకసారి ఇస్తే మళ్లీ ఇచ్చేస్తాను'' అడిగాడు విశ్వనాథం.

"సరే తీసుకోండి'' అని ఇచ్చిన పేపర్ సాయంత్రం రామ్మూర్తి ఇంటికి వచ్చిన తర్వాత కాని తిరిగి రాలేదు. అంతేకాదు ఒక రోజుతో యిది ఆగిపోలేదు. ప్రతిరోజూ పేపర్ వచ్చిన అరగంటకే వచ్చి విశ్వనాథం తీసుకు వెళ్లేవాడు. సాయంత్రం కాని యిచ్చేవాడుకాదు. రామ్మూర్తి విసిగిపోయాడు. చేతి ఖర్చయినా విశ్వనాథానికి బుద్ధి తెప్పిద్దామనుకు

న్నాడు. ఏజంట్‌తో చెప్పి ప్రతిరోజూ విశ్వనాథం ఫ్లాట్‌లో 'హిందూ' పడెయ్యమనీ, ఆ బిల్లూ తనే చెల్లిస్తాననీ చెప్పాడు.

రామ్మూర్తి ఇంటికి ఆ మర్నాడు ఏడు గంటలకి వెళ్తున్న విశ్వనాథం తన ఇంట్లోనే హిందూ పడి వుండటం చూసి ఆశ్చర్యపోయాడు. తర్వాత పేపర్ బోయ్‌ని అడిగితే ఆ ఏర్పాటు రామ్మూర్తి చేశాడని తెలిసింది. వెంటనే రామ్మూర్తి ఫ్లాట్‌లోకి విశ్వనాథం అడుగుపెట్టి "థాంక్యూ సార్... హిందూ మాకూ వేయమన్నారుట. అయితే చిన్న రిక్వెస్ట్ సార్... ఇద్దరికీ హిందూ ఎందుకండి! మాకు 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' చెప్పండి. చదువుకుని మార్చుకోవచ్చు. వెరైటీగా వుంటుంది గదండీ. రేపటి నుంచీ మాకు ఎక్స్‌ప్రెస్ చెప్పండి. వస్తా'' అంటూ విశ్వనాథం వెళ్ళిపోయాడు.

ఆ 'ఎక్స్‌ప్రెస్ ఐడియా'కి అదిరిపోయాడు రామ్మూర్తి.

**-తాజీ ప్రసాద్**

## తేడా

**హాల్లో** సోఫాలో కూర్చొని పేపరు చదువుకుంటున్నారు ప్రొఫెసర్ పరశురాం. కిచెన్ లోంచి అరుచుకుంటూ వస్తున్న వంటవాడు బ్రహ్మానందం వంక ఆశ్చర్యంగా చూశారు. 'ఏమిట్రా ఏమయ్యింది'' అనునయంగా అడిగారు ఆయన.

"ఏంటండీ... ఏమవుద్ది. అసలునే నెట్టాక నిపిస్తున్నానండీ. నాకెక్కడా పని దొరక్క మీదగ్గర సేత్తున్నాననుకుంటున్నారా'' నాన్‌స్టాపుగా అరుస్తున్న వాడివంక చిరాగ్గా చూస్తూ "విషయమేమిటో చెప్పకుండా ఈ గొడవేమిట్రా'' అన్నారు.

"గొడవేనండీ... లేకపోతే ఏంటండీ. నెలకి పది రోజులు పన్లోకెళ్తే మిగిలిన రోజులు మీకు మల్లేనే హాయిగా కాలుమీద కాలేసుకుని దర్జాగా కూసోగల్నండీ. అయినా ఎందుకు సేస్తన్నానంట మీ యింట. ఏదో గొప్ప పొఫెసర్‌గందా. మీలాంటోళ్ల కాడ పనిసేస్తే గౌరవంగా ఉంటాదనికదా''

"అవున్రా, ఇప్పుడు మాత్రం కాదనెవరన్నారు. ఏం జరిగిందో చెప్పరా''

"చెప్పడవేంటండీ... ఒకటే చెప్పడం. ఇంక నేను మీకాడ పన్చెయ్యలేనండి. ఇయాల్టితోటే అయిపోయింది. నేపోతానండీ...'' అంటూ వీధి గుమ్మంవైపు నడిచాడు బ్రహ్మానందం.



కంగారుగా లేచారు పరశురాంగారు. వెళ్లబోయేవాణ్ణి ఆపు చేస్తూ "ఆగరా... ఇలా అర్థాంతరంగా వెళ్లిపోతే ఎలాగ. ఇప్పటికిప్పుడు ఎవరు దొరుకుతారు. విషయమేమిటో చెప్పు ముందు'' అన్నారు.

"మీరింత మంచోరు కాబట్టే అమ్మగారలా మాట్టాడతన్నారు. అయినా అయ్యగోరూ... మీకూ నాకూ తేడా లేదాండి...''

"లేకపోవడమేమిట్రా... నీవు వంటవా

డివి. నేను ప్రొఫెసర్ని..."

"అది కాదండీ. మన ఉద్యోగాల గురించికా దండి నేనడుగుతా"

"అదే లేరా... ఈ యింటికి యజమానిని నేను. పనివాడివి నువ్వు. అవునా''

"ఆయ్... అదే కదండిమరి. మనిద్దరి మద్దినా అంత తేడా వుందికదాండి. మరి అమ్మగారు తవర్నీ, నన్ను సమానంగా సేసి మాట్టాడితే -ఎట్టాగండి''

"ఏమన్నార్రా అమ్మగారు'' నవ్వుతూ అడిగారాయన. "ఏముందీ నేనో పనికిమాలిన వెధవనట మీలాగే! ఎంతైనా మిమ్మల్ని తిట్టినట్టు నన్ను తిడితే ఎట్టాగండీ''

"ఆc..." అవాక్కయ్యారు ప్రొఫెసర్గారు.

-నూరిపండు

# రైలు కోసం...

శంకర్రావు రైల్వే ఉద్యోగం చేసి రిటైరయ్యాడు.

రిటైరైనా కూడా పాత అలవాట్లు పోలేదింకా. అందుకే రోజూ సాయంత్రం కాగానే ఇంటి దగ్గర్నుండి అలా అలా షికారుగా



రైల్వేస్టేషన్కు వెళ్ళి అక్కడ ప్లాట్ఫారంమీద కనీసం రెండు గంటలైనా కూర్చొని రావడం అలవాటు. అంతకంటే అలా చేయడం ఆయనకు ఇష్టం అనడం సమంజసంగా వుంటుంది.

ఓరోజు అలవాటు ప్రకారం శంకర్రావు రైల్వే ప్లాట్ఫారంమీద వేంచేసి వున్న సమయంలో.

ఓ యువకుడు గబగబా పరుగెత్తుకుంటూ వచ్చి శంకర్రావువేపు తేరపార చూసి, "ట్రైన్ వచ్చిందా సార్?" అని అడిగాడు.

శంకర్రావు ఆ యువకుడివేపు ఎగాదిగా చూశాడు.

"రాలేదు బాబూ'' అని సమాధానం చెప్పాడు కాసేపాగి.

విసుగ్గా అతన్తో అన్నాడు, "కాస్త దూరానికే మీరిలా వగరుస్తున్నారు. నేను యవ్వనంలో వుండగా ప్లాట్ఫాం దాటేసిన రైలును పట్టుకొని మరీ పరుగెత్తేవాణ్ణి. ఈ కాలం కుర్రాళ్లకి అటు చదువులో తెలివితేటలూ లేవు. ఇటు శారీరక దారుఢ్యమూ లేదు'' అంటూ అతని కేసి చూశాడు శంకర్రావు.

ఆ యువకుడు శంకర్రావునో వెర్రిపీనుగను చూసినట్లు చూస్తూ, "నేను ఈ రైలుకోసం ఇంటికాణ్ణుంచి పరుగెత్తుకురాలేదు సార్!"

"మరి..."

"పక్కస్టేషన్నుంచి పరిగెత్తుకొస్తున్నాను. అక్కడమంచి నీళ్లకోసం దిగాను. రైలెక్కేలోగా అది బయలుదేరితే పరుగెత్తా'' ఆ మాటలు విన్న శంకరం "ఆ... ఆ రైలింకా రాలేదే'' అంటూ స్పృహతప్పి నేలమీద దబ్బుమంటూ పడిపోయాడు.

-కె.ఎస్.ఎస్.రెడ్డి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402